# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

జనవరి 2007 66 రు. 10

- ఫోకస్ : ప్రచార మాధ్యమాలు - విశ్వసనీయత
  ఐదు వ్యాసాలు
- మందుకు, మనీకి లొంగని కరీంనగర్ ఓటర్లు
- భూమిలేని నిరుపేదల ప్రయోజనాలు చర్చకు రావాలి!
- ప్రత్యేక తెలంగాణ లక్ష్యసాధన దిశలో...
- ఎన్నికల సంస్కరణలు వ్యవస్థను మారుస్తాయా?
- బుష్ సైగతో సద్దాంకు ఉరి

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక పత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

66 జనవరి 2007

*సంపాదకీయం*

# ఖైర్లాంజి పాఠాలు

ఖైర్లాంజి హత్యాకాండ మన సమాజంలోని అన్ని వ్యవస్థలూ, అన్ని మానవ విలువలూ పతనమయి పోయాయనడానికి, విధ్వంసమై పోయాయనడానికి విస్పష్ట నిదర్శనంగా నిలుస్తుంది. గ్రామం అనే ఒక సమగ్ర వ్యవస్థ లేదు. గ్రామీణుల మధ్య సహకారం లేదు. గ్రామంలో నేరం జరగకుండా చూసే రక్షణ వ్యవస్థలేదు. నేరం జరిగిన తర్వాత పరిశోధించి, నేరస్తులను అదుపులోకి తీసుకుని, విచారణకు నిలబెట్టే శాసన, న్యాయ వ్యవస్థలు లేవు. సమాజ సమస్యలను పరిష్కారం చేస్తామనే వాగ్దానంతో అధికారానికి వచ్చిన రాజకీయ వ్యవస్థ లేదు. సమాజ భద్రతకు కాపలా కాయవలసిన ప్రచార మాధ్యమాలు లేవు. మధ్య వయస్కురాలయిన స్త్రీని వీధుల్లో పరుగెత్తించి, వివస్త్రను చేసి, మర్మావయవాల్లోకి బరిసెలూ, వెదురు కర్రలూ జొప్పించడానికి సిగ్గుపడని అహంకార సమాజం మనది. ఇప్పుడిప్పుడే యవ్వనంలో ప్రవేశిస్తున్న యువతి రొమ్ములు నరికేసే, అన్నదమ్ములను ఆమె మీద అత్యాచారం జరపమని నిర్బంధ పెట్టే, కీచకులను తోసి రాజనే అమానుష సమూహం మనది. ఆ దళిత కుటుంబం చేసిన నేరమల్లా హిందూత్వకు భిన్నంగా బౌద్ధధర్మాన్ని ఆచరించడం. గ్రామస్తులు తమ భూమిని లాక్కుంటామంటే అడ్డుకోవడం. మరొక దళితుడి తరపున సాక్ష్యం చెప్పబోవడం. చదువుకుని పైకి వద్దామనుకోవడం. భూమి, మతం, సహ దళితులతో సంఘీభావం, చదువు – దళితులకు వేల సంవత్సరాలుగా ఏవేవి నిరాకరించబడ్డాయో భయ్యాలాల్ బోత్మాంగే కుటుంబం అవి కోరుకున్నది. అందుకే ఆయన భార్య సురేఖ, కూతురు ప్రియాంక, కొడుకులు రోషన్, సుధీర్‌లు అంత క్రూరంగా బలి కావలసి వచ్చింది. ఆ బలియజ్ఞ పూజారులు–మరాఠా కుంబిలు – మామూలు అర్థంలో అగ్రవర్ణాలు కూడ కాకపోవడమే, ఈ దేశంలో అన్ని కులాల మీద హైందవ బ్రాహ్మణీయ భావజాల ప్రభావానికి అద్దం పడుతున్నది. ఆస్తిలో, పెత్తందారీతనంలో అగ్రవర్ణాలతో పోటీపడుతున్న బహుజన కులాలు కూడా అవకాశం వస్తే దళితుల మీద ఎంత అమానుషమైన దౌర్జన్యాలు జరపగలవో ఈ ఘటన మరొకసారి చూపుతున్నది. ఈ సమాజమంతా వ్యాపించిన అగ్రవర్ణ భావజాలాన్ని కడిగివేయకుండా, దళిత బహుజన శ్రేణులలో కూడ విస్తరిస్తున్న అగ్రవర్ణ మానసిక స్థితిని తుడిచి వేయకుండా ఉన్నంతకాలం ఖైర్లాంజిలు పునరావృతమవుతూనే ఉంటాయి. విశ్వాసాలలో స్వయం నిర్ణయాధికారం, భూమి మీద యాజమాన్యం, విద్యావకాశాలు, సహపీడితులతో సంఘీభావం అనే నాలుగు మౌలికాంశాలూ మొత్తం సమాజంలో అంతరాల భావజాలాన్ని రద్దు చేసే పోరాటమూ కలిసి మరింత ఉధృతంగా సాగవలసిన అవసరాన్ని ఖైర్లాంజి మృత దేహాలు మరొకసారి చాటి చెపుతున్నాయి. ◆

## లోపలి పేజీల్లో...




### ప్రసార, ప్రచార మాధ్యమాలు - విశ్వసనీయత

ప్రసార, ప్రచార సంస్థల యాజమాన్యాలకు సమాచార సేవ కంటే లాభాలు దండుకోవడం, పదవులు సంపాదించడం ముఖ్యమైనప్పుడు మొట్టమొదట బలి అయ్యేది విశ్వసనీయతే. పనికట్టుకొని అవాస్తవాలను వాస్తవాలుగా చిత్రించడం, గోరంతను కొండంతగా చూపించడం లేదా కొండంతను గోరంతగా చేయడం ఇటీవల ప్రబలుతున్న ప్రమాదకరమైన ధోరణి. న్యూస్ ఛానెళ్లు పెరిగాయి. పత్రికల విస్తృతి, ప్రాబల్యం పెరిగాయి. ప్రజలలో రాజకీయ అవగాహన పెరిగింది. చదవడం, రాయడం రానివారు కూడా టీవీ న్యూస్ ఛానెళ్లను చూసి పరిస్థితులను అర్థం చేసుకుంటున్నారు. మరి వాటి విశ్వసనీయత ఎంత?

**ఫోకస్ : ప్రసార, ప్రచార మాధ్యమాలు - విశ్వసనీయత**






**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై. రామచంద్రం
9949391028
కంపోజింగ్ & లే ఔట్ : సి. రాజశేఖర్

## పాఠకుల వీక్షణం

నవంబర్ వీక్షణం మాస పత్రిక అందింది. అభినందనలు. ఈ పత్రికలో యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ విజయాలు-వైఫల్యాలు చదివి గత కొన్ని సంవత్సరాలలో వచ్చిన మార్పులను అవగాహన చేసుకోగలిగాము. ఇందులో రాసిన విధానం సరళమైన భాషలో సంక్షిప్తంగా లోతైన పరిశీలనతో ఉంది, రాసిన మేధావులందరికీ మా అభినందనలు. వ్యాసాలు చాలా సరళంగా, పాఠకులను ఆకట్టుకునే విధంగా చదివించేవిగా ఉన్నాయి. మాకు పరిమితులను అర్థం చేసుకొని ఈ పత్రికను క్రమం తప్పకుండా అందించగలరని కోరుకుంటున్నాము.

**- ఉగ్గె చంద్రమౌళి**
సెంట్రల్ జైల్, రాయ్‌పూర్

'ఎవరికి సంకేతాలు పంపడానికి అఫ్జల్‌ను ఉరితీయాలి?' కె. బాలగోపాల్ గారి వ్యాసం చదివాను. అసలు ఎవరికి సంకేతాలు పంపడానికి పార్లమెంట్‌పై ఇస్లామిక్ ఉగ్రవాదులు దాడి చేశారో వివరిస్తే సమంజసంగా ఉండేది. ఈ దాడి సంఘటనతో పోల్చదగ్గ దుర్ఘటన స్వతంత్ర భారత చరిత్రలోనే లేదని సుప్రీం కోర్టు చెప్పింది అక్షర సత్యం. అఫ్జల్ గురు సాధారణ నేరగాడు కాదు. జాతి గౌరవానికి భారత సార్వభౌమాధికారానికి ప్రతీక అయిన పార్లమెంట్‌నే చెరపట్టడానికి కుట్ర పన్నిన ఉగ్రవాది. తీవ్రమైన నేరాలకు పాల్పడ్డవాళ్లను ఉరి తీయవచ్చని భారత శిక్షాస్మృతి నిర్దేశిస్తుంది. ఇది రాజ్యాంగంలోని 21వ అధికరణకు భంగం కాదని సుప్రీం కోర్టు ఎన్నడో చెప్పింది. అటువంటి సర్వోత్తమ న్యాయస్థానం ఉరి శిక్షను ఖరారు చేసిందంటే, ఎంతో విస్తృత కసరత్తు జరిగి ఉండాలి. ఈ విచారణ మూడు అంచెల్లో సాగింది. పోటా కోర్టు విధించిన శిక్షను, హైకోర్టు ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పును సుప్రీం కోర్టు కులంకషంగా పరిశీలించాకే అంతిమ తీర్పు వెలువడింది. అయినా సరే, సరైన న్యాయం జరిగిందా? అని శంకిస్తున్న వాళ్ల తీరు సాక్షాత్తు సుప్రీం కోర్టునే బోనులో నిలబెడుతున్నట్టు ఉంది.

**- జూల ముత్తెన్న**
మెదక్

వీక్షణం పత్రిక సంపాదకీయాలు బాగున్నాయి. రాజకీయ, ఆర్థిక పరమైన విషయాలపై మరింత సమాచారంతో విశ్లేషణ వస్తే బాగుంటుంది. విద్యా రంగ సమస్యలపై వివరణలను మునుముందు ఇవ్వగలరు.

**- ఎస్. రాజారావు**
రంపచోడవరం

# కొత్తపుస్తకాలు




- **ఆఫ్రికన్ సోషలిస్టు ఉద్యమం, వాల్టర్ రోడ్నీ** - డేవిడ్ రెన్‌టన్ - అనువాదం : పి.ఆర్. ప్రకాశరావు - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 20 పేజీలు, 1/8 డెమీ, రు. 6, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు - 522 002.
- **విశాలాంధ్రలో తెలంగాణకు విద్రోహం** - బందగీ ప్రచురణలు, 35 పేజీలు, 1/8 డెమీ, రు. 12, ప్రతులకు : శ్రీ సంగమేశ్వర నిలయం, ఇం.నెం. 9-7-141, శ్రీ భీమేశ్వరాలయం వీధీ, వేములవాడ, కరీంనగర్ జిల్లా - 505, 302, అన్ని పుస్తక కేంద్రాలు.
- **గతకాలపు స్మృతి చిహ్నంగా మారనున్న రాజోలిబండ - నివేదిక** - తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ, 20 పేజీలు, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు : ఎం. కోదండరాం, కన్వీనర్, తెలంగాణ విద్యావంతుల వేదిక, 3-4-142/6, బర్కత్‌పుర, హైదరాబాద్.
- **భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు** - సయ్యద్ నశీర్ అహమ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ప్రచురణ, 72 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, సందేశభవనం, లక్కడ్‌కోట్, హైదరాబాద్ - 500 002.
- **బాలలు-జాతి సంపద** - వి.ఎస్. కమల, తరిమెల నాగిరెడ్డి ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రచురణ, 88 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : మణి బుక్ స్టాల్, మైత్రీ బుక్ హౌస్, జె.వి.వి. ప్రచురణల విభాగం.
- **ఊయలకి వందేండ్లు ఉరికొయ్యకి డెబ్బై ఐదేండ్లు** - భగత్‌సింగ్ శతజయంతి స్మారకార్థం, పి.డి.ఎస్.యు. పి.వై.ఎల్. ప్రచురణ, 48 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : పి.డి.ఎస్.యు., పి.వై.ఎల్. రాష్ట్ర కార్యాలయం, మార్క్స్‌భవన్, ఇ.నెం. 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్. నవోదయ బుక్ హౌస్, సహచర బుక్ మార్క్, దిశ పుస్తక కేంద్రం, విశాలాంధ్ర, ప్రజాశక్తి బుక్ హౌస్.
- **చారిత్రక నేపథ్యంలో ఐదవ షెడ్యూలు** - మజ్జి శంకర రెడ్డి - జనచేతన, బ్రెడ్స్, వెలుగు, నేచర్, ఆర్క్, ప్రచురణ, 53 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : జనచేతన, రాజాంరోడ్డు, పాలకొండ, శ్రీకాకుళం - 532 440
- **నెమలి కన్ను -** చిన్న కథలు - భూపాల్ - వెన్నెల ప్రచురణ - 164 పేజీలు - 1/8 డెమీ. రు. 63, ప్రతులకు : ఎం. సద్గుణ, 2-2-985, అంబర్‌పేట్, హైదరాబాద్ - 13. ప్రజాశక్తి, దిశ, విశాలాంధ్ర, నవయుగ, నవోదయ, తెలుగు బుక్‌హౌస్ పుస్తక కేంద్రాలలో లభించును.
- **ఊరేగింపు -** తెలంగాణ సంగతులు - జాడ (తెలంగాణ చరిత్ర, కళా పరిశోధన) ప్రచురణ - 151 పేజీలు, 1/4 క్రౌన్, రు. 80, ప్రతులకు : అన్ని పుస్తక కేంద్రాలలో.
- **మహత్తర శ్రీకాకుళ పోరాటం -** డా. బి. శివరామిరెడ్డి - చాగంటి భాస్కరరావు ప్రచురణ, 518 పేజీలు, రాయల్, రు. 200, ప్రతులకు : ప్రజా పంథా, విశాలాంధ్ర, ప్రజాశక్తి, సహచర, దిశ, మైత్రీ బుక్ హౌస్, మణి బుక్ హౌస్, నవోదయ, తెలుగు బుక్ హౌస్ లలో లభించును.



# మందుకు, మనీకి లొంగని కరీంనగర్ ఓటర్లు

– డా. గోపు లింగారెడ్డి

చారిత్రాత్మక కరీంనగర్ పార్లమెంటరీ ఉపఎన్నిక ఓ ఉద్యమంలాగా సాగింది – మందు, మనీకి లక్ష ఆమడల దూరంలో కరీంనగర్ ఓటర్లున్నారు. కాంగ్రెస్ పార్టీ ఆకాశాన్ని, భూమిని ఏకం చేసైనా కెసిఆర్‌ను ఓడించాలని సర్వశక్తులు కూడగట్టుకుని ఢిల్లీ, హైదరాబాద్ యావత్తు కరీంనగర్‌కు దింపింది. కాని తెలంగాణ సెంటిమెంట్ ముందు వాళ్ల డబ్బు లీల పని చేయలేదు. దాదాపు రెండు వందల కోట్లు ఖర్చుపెట్టినా వృధా ప్రయాసే అయింది. కేసిఆర్ మాటల్లోనే ఉపఎన్నికల్లో కాంగ్రెస్ ఖర్చుపెట్టిన డబ్బుతో ఓ నీటి ప్రాజెక్ట్ కట్టొచ్చునన్నారు. ఎన్నికల ప్రకటనకు ముందు అదే కే.సి.ఆర్. కాంగ్రెస్ ఇచ్చిన డబ్బు తీసుకుని తెరాసకు ఓటు వేయమని ఓ సంచలన, వివాదాస్పద ప్రకటన చేశారు. దీనిపై కోర్టులో కూడా కేసు నమోదయ్యింది. ఇది అక్షరాల నిజమైంది.

గ్రామాల్లో డబ్బు తీసుకుని ఓటు మాత్రం తెరాసకు వేశారు. ఎన్నిక ముందురోజు కరీంనగర్‌లో ఒక్కో కార్పోరేటర్‌కు పదిలక్షలు ముట్టినట్లు తెలిసింది. ఇలా ఒక్క కరీంనగర్ పట్టణంలో ఐదు కోట్లు వెదజల్లారు. వేములవాడలో కాకతీయ యూనివర్శిటీ విద్యార్థులు సర్వేకు వెళ్ళినపుడు తెదేపా కోసం మహిళలు ప్రచారం చేస్తున్నారు. అమ్మ మీ ఓటు ఎటు వేస్తారని అడిగితే వాళ్లు ఏమాత్రం తటపటాయించకుండా "ఏదో మనిషికి వందరూపాయలిస్తే ఇట్ల తిరుగుతున్నాం కాని మా మనసు నిండా తెలంగాణనే వుంది. మా మొగోళ్లు సదువుకోలేదు. కాయకష్టం సేస్తరు, మా పోరగాండ్లు సదువుతున్నరు. వాళ్లకు సర్కార్ నౌకర్లు దొరకాలంటే తెలంగాణకే ఓటెయ్యాలన్నారు. తెలంగాణ సెంటిమెంట్ దెబ్బకు జాతీయపార్టీలే కాదు ప్రాంతీయ పార్టీలూ కుప్పకూలాయి. తెదేపా బిసికార్డ్ ఉపయోగించి రమణను అభ్యర్థిగా నిలబెడితే ఆయన పుట్టిన గడ్డ జగిత్యాలలోనే బిసి ఓటర్లు తెలంగాణ వాదాన్ని భుజాన మోశారు. మరో బిసి ఓటర్ ఇలా అన్నారు. తెదేపా పార్టీ బిసి ఆయన్ను నిలబెట్టారని గొప్పలు సెబుతుండ్రి కాని ఆయన్ని ఆడించే రిమోట్ కంట్రోల్ ఓ.సి.నే కదా! ఇదంతా ఓటర్లను దగా చేయడానికే కదా! అన్నాడు. అందుకే తెదేపా బిసి కార్డ్ పని చేయలేదు – అసలు వాళ్లు సమైక్యవాదులా? ప్రత్యేక తెలంగాణా రాష్ట్రవాదులా? అని ప్రశ్నిస్తే – బాబు సిద్ధాంతం ప్రకారం సమైక్యగానం వినిపిస్తే ఓట్లు రావు – ప్రత్యేక రాష్ట్ర నినాదాలిస్తే బాస్ మొట్టికాయలేస్తాడని భయం. పాపం తెదేపార్టీ వారు నలభై కోట్లు ఖర్చుపెట్టినా వాదాల మధ్య నలిగిపోయి ఖంగుతిన్నారు. ప్రభుత్వ వ్యతిరేకత, కరెంట్ సమస్య వాల్లను కాపాడాయి.

అధికారపార్టీ మండలానికో శాసన సభ్యున్ని, అసెంబ్లీ నియోజక వర్గానికో మంత్రిని ప్రచారానికి పంపారు. పాపం వారి పరిస్థితి దయనీయంగా ఉండింది. సిరిసిల్ల నియోజక వర్గానికి ఓ రాష్ట్రమంత్రిని, ఓ జిల్లా శాసనసభ్యునికి బాధ్యతలిచ్చారు. కాని అదివరకే యాభై గ్రామాల ప్రజలు తెరాసకి ఓట్లేయ్యాలని ఏకగ్రీవ తీర్మానాలు చేశాయి. సదరు శాసనసభ్యుడు పోలీస్ అధికారుల్ని ఆయా గ్రామాలకు పంపి ప్రజల్ని బెదిరించి ఏకగ్రీవ తీర్మానాల్ని రద్దు చేయించే ప్రయత్నం చేశారు. కాని ఆ గ్రామాలన్నీ పోరాటాల నుండి పుట్టుకొచ్చాయి. ఎవరి బెదిరింపులకు లొంగలేదు. ఇంకా ఎక్కువ సంఖ్యలో తెరాసకు ఓట్లు పడ్డాయి. ఆ నియోజకవర్గపు ఇన్‌ఛార్జ్ మంత్రి కష్టాలు ఇన్నీ అన్నీ అని చెప్పడానికి వీల్లేనన్ని ఉన్నాయి. ప్రచారానికి గ్రామాల్లోకి వెళితే రేషన్ కార్డులివ్వలేదని, కరెంట్ సమస్యతో కష్టాలు పడుతున్నామని నిలదీశారు. హరీశ్‌రావు దెబ్బకు సదరు ఎం.ఎల్.ఏ ప్రచారానికి దూరంగా ఉన్నాడు. ఆ మంత్రివర్యులు ఓ గ్రామానికి ప్రచారానికి వెళ్లి చేయి గుర్తుకే ఓటు వేయండని ఊదరగొడితే 'మీ ప్రభుత్వం మాకేం చేసింది–రాత్రి కరెంట్‌తో ప్రాణాలు తీసింది. అన్నలని చెప్పి ఎన్‌కౌంటర్లు సేత్తండ్రు–తిరుగంగ తిరుగంగా తెల్ల రేషన్ కారటుకు బదులు పసుపు పచ్చ కారటు ఇస్తిరి. పంటలు పండక ఇసం తీసుకుని చస్తే పైసల కోసం వీళ్ళు చస్తున్నరంటిరి –ఎరిగోస పుచ్చుకుంటుండ్రు–నడువుండ్రి మా వూళ్లోకెళ్లి పోండ్రి అన్నారు.' అంతలోగా మంత్రివర్యులు ఓ మహిళ నుద్దేశించి 'మీ పెన్షన్ పెంచినం కదా అవ్వ' అంటె 'పెంచినవ్ పెంచినవ్ అంటున్నవ్–మీ అయ్య ఇంట్లకెళ్లి ఇస్తుండ్రా? నీ ఇంట్లకెళ్లి ఇస్తున్నవా? నడువుండ్రి –ఇంకో గంట సెపికనగుంటే ఇజ్జత్ దక్కదని' గ్రామస్థులు వెంటబడితే –ఓ జిల్లా అధికార పార్టీ జడ్‌పి చైర్‌మన్‌తో బాటు మంత్రి పరుగుతీశారు.

టిడిపి కూడా నలభైకోట్ల డబ్బు ఖర్చు పెట్టిందని అంచనా–ఉచిత కరెంట్, ప్రభుత్వ వ్యతిరేకత, బీడి కట్టలపై పుర్రె గుర్తులనే అస్త్రాలతో ఎన్నికల సమరంలో దిగింది–తెలంగాణ సెంటిమెంట్ ముందు మరేమీ పని చేయలేదు.

ఇక బిజెపి కూడా తెలంగాణ జపం చేసినా, కాకినాడ తీర్మానానికే కట్టుబడి ఉన్నామని ప్రకటించినా జనం నమ్మలేదు. ఇదంతా ఎన్నికల స్టంట్‌లని కరీంనగర్ ఓటర్లు బిజెపి అడ్రస్ గల్లంతు చేశారు. అసలు ఆ పార్టీ నామినేషన్ వేసినప్పుడే డిపాజిట్ కూడా రాదని రాజకీయ విశ్లేషకులు అంచనా వేశారు. ఉత్తర భారతదేశంలోని బిజెపి పాలిత రాష్ట్రాల నుండి ఎన్నికల నిధి సుమారు పది కోట్లు అందాయని రాజకీయ పండితులు అంచనా వేశారు. అందులో బిజెపి వాల్‌పోస్టర్ల కోసం ఓ లక్ష ఖర్చు పెట్టి వుంటుంది–మిగతా డబ్బేమయినట్లు? లోగుట్టు పెరుమాళ్లకెరుక–ఎన్నికలయిన రోజు బిజెపి అభ్యర్థి విద్యాసాగర్ రావు కెసిఆర్ గెలుస్తాడని చెప్పారు. అదే రెండు రోజులు ముందు పోటీ నుండి తప్పుకుంటున్నానని ప్రకటించి తెరాసకు మద్దతు ఇస్తున్నట్లు ప్రకటించినా జాతీయ పార్టీ గౌరవం దక్కేది–పార్టీ ఉనికి కోసం పోటీ చేశామని చెప్పుకుని ఆ పార్టీ అభాసు పాలయింది.

మిగతా మూడు పార్టీలకు పోలైన వోట్లు తెరాసకు పోలైన వోట్లతో సమానంగా ఉన్నాయి. ఇందులో సగం ఓట్లు గద్దర్ తెలంగాణ ధూంధాం ప్లస్ విద్యావంతుల చైతన్య సదస్సుల ద్వారానే వచ్చాయి.

*(మిగతా 48వ పేజీలో...)*

# భూమిలేని నిరుపేదల ప్రయోజనాలు చర్చకు రావాలి!

– వరవరరావు

వై.ఎస్.రాజశేఖరరెడ్డి, నారా చంద్రబాబునాయుడు ఇద్దరూ విద్యావంతులే. ఒకాయన వృత్తిరీత్యా వైద్యుడు, మరొకాయన అర్థశాస్త్రంలో ఎం.ఫిల్ చేస్తూ వదిలేసాడు. ఇద్దరూ రెండున్నర దశాబ్దాల క్రితం నవయువకులుగా ప్రజాసేవ చేయడానికి రాజకీయాల్లోకి వచ్చారు. ప్రజా ప్రతినిధులుగా ఎన్నికయితే ప్రజానుగుణమైన చట్టాలు చేయవచ్చునని, మంత్రిగానో, ముఖ్యమంత్రి గానో ఉండే ఆ చట్టాలను అమలుచేసే అవకాశం కూడా వస్తుందని గాఢాభినివేశంతో ఆయా పదవులకు ఎన్నికయ్యారు కూడ. వాళ్లు చట్టాలు తెలియని అజ్ఞానులు కాదు.

తెలుగు నేలమీద ప్రజా ఉద్యమాల ప్రభావంతో కొన్ని చట్టాలు వచ్చాయి. జాతియోద్యమ ప్రభావంతో వచ్చిన రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలకు, రాజ్యాంగంలో హామీ యివ్వబడిన కొన్ని అధికరణలకు అనుగుణంగా అవి 1952లో జమిందారీ, జాగీర్దారీ వ్యవస్థను రద్దుచేసి రక్షిత కౌల్దారీ చట్టాన్ని అమలులోకి తెచ్చాయి. 1970లో ఆదివాసులకు అడవిభూమిపై హక్కును గ్యారంటీచేశాయి. 1973లో ప్రతి కుటుంబానికి గరిష్ట భూపరిమితిని నిర్ణయించాయి. మొదటిది తెలంగాణ రైతాంగ పోరాట ఫలితమైతే, తర్వాత రెండూ శ్రీకాకుళ రైతాంగ పోరాట ఫలితాలు. రెండు సందర్భాల్లోనూ 'దున్నేవారికే భూమి' నినాదంతో తెలుగు ప్రజలు వీరోచిత పోరాటాలు నిర్వహించారు. వేలాదిమంది ప్రాణాలర్పించారు.

వై.ఎస్.ఆర్., చంద్రబాబు నాయుడే కాకుండా ప్రస్తుత శాసన సభలో ఉన్న చాలామంది విద్యావంతులు న్యాయవాదులు కావచ్చు, డాక్టర్లు కావచ్చు, మరొకరు కావచ్చు, పెద్దగా విద్యలేని ధనిక రైతులో, వ్యాపారవేత్తలో, పారిశ్రామిక వేత్తలో బతుకుదెరువు లేక రాజకీయాల్లోకి వచ్చిన వాళ్లు కారు. ప్రజాసేవ చేయడానికి ఆ అవకాశాలు వదులుకొని రాజకీయాల్లోకి వచ్చినవాళ్లు. మరి వీళ్లు కంపెనీలు ఎందుకు పెట్టుకున్నట్లు, రకరకాల లాభసాటి వ్యాపారాలకు ఎందుకుదిగినట్లు, అందుకోసం అసైన్డ్ భూములు, అడవి భూములు, చట్టం అనుమతించని భూములు ఎందుకు సేకరించినట్లు? ఎందుకివ్వాళ రాజకీయాలతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలు ఉన్నవాళ్ల అందరికీ భూపరిమితిచట్టం 54 ఎకరాల మెట్టభూమిని నుంచి వందల, వేల ఎకరాల భూమి వున్నట్లు? ఇవేవీ వీళ్లెవరికీ పూర్వార్జితంగా, వారసత్వంగా వచ్చినవి కూడా కాదు. భూపరిమితి చట్టం వచ్చాక వీళ్లు సేకరించినవే. ఇప్పుడు స్వయంగా వై.ఎస్.ఆర్. చెప్తున్న ప్రకారమే ఆయన తండ్రి రాజారెడ్డిగారు ఈ భూపరిమిత చట్టంనుంచి మినహాయింపు పొందడానికి కంపెనీ పేరు మీద కుటుంబం కోసం వందల ఎకరాలు కొన్నాడు. ఈ ముప్పై ఏళ్లలోనే చెట్లమీద ప్రేమ కనుక అడవి భూములు కలుపుకోవడానికి వీలుగా కొన్ని వేల ఎకరాలు కొన్నాడు. స్వయంగా వై.యస్.ఆర్. తన సంతానంతో కలసి కంపెనీ పేరు మీద కొన్ని వందల ఎకరాలు కొనడానికి ఒప్పందం చేసుకున్నాడు. చెట్లను, వ్యవసాయాన్ని పందులు పాడుచేస్తాయి గనుక గోడ పెట్టుకున్నాడు. రైతులు గనుక భూమి మీద, చెట్లమీద ఆయన నాయనగారికి, ఆయనకు చాలా ప్రేమ వుంది. జనార్ధనరెడ్డి కూడా రైతు కుటుంబం నుంచే వచ్చి రాజశేఖర రెడ్డి వలె ఎంబిబిఎస్ చదివినా ఆయనకు ప్రైవేటు వైద్య కళాశాల పెట్టడమే తెలిసింది గానీ భూముల్ని గొలుసులతో కొలుస్తారు టేపులతో కాదు అని తెలియ లేదు. పైగా కరువు జిల్లాలో పుట్టి నాగం జనార్దనరెడ్డి శాసనసభలో క్యాట్‌వాక్ చేయగలనని చేసి చూపాడు గానీ ఎన్నడూ భూమి మీద గొలుసులతో కొలవడానికైనా సరే అట్లా నడిచినట్లు లేదు.

వై.ఎస్.ఆర్ అట్లాకాదు. ఆయనకు తన ఎస్టేట్ అంటే ఎంతో ప్రేమ. దానిని తన రక్త మాంసాలతో పెంచి పోషిస్తున్నాడు. విశ్రాంతికీ, శుభసందర్భాలకూ అక్కడే గడపడానికి వెళ్తుంటాడు. ఈ క్రిస్మస్ మూడురోజులూ అక్కడే ఉండబోతున్నాడు. పాపుల్నందరినీ క్షమించే జీసస్ క్రైస్తుకు, బహుశా ప్రేమగా, గోముగా నిమిరే గొర్రెపిల్ల తప్ప (అది కూడా ఆయనదో కాదో తెలియదు) ఆస్తి ఉన్న దఖలా లేదు. పైగా సిలువ ఎక్కి ఈ నేల మీద పండిన పాపాన్నంతా తన రక్తంతో కడిగినాడాయన. తనకు ద్రోహం చేసి సిలువ ఎక్కించి మేకులు కొట్టిన వాళ్లను కొన ఊపిరి దాకా క్షమించమని ప్రభువును వేడుకుంటూ ప్రాణాలు వదలినవాడు. కనుక మనం కూడా వైఎస్ఆర్ తెలిసి చేసినా, తెలియక చేసినా ఏ ఆక్రమణా దాచుకోకుండా శాసనసభలో కూడా చెప్తున్నాడు గనుక ప్రభువు ముందు ఒప్పుకోలు (కన్ఫెషన్) చెల్లుతుందేమో కానీ ప్రభుత్వ చట్టం ముందు చెల్లదని పట్టుబట్టనక్కర్లేదు. ప్రభువు ముందు పశ్చాత్తాపం చాలు. ప్రభుత్వానికి ఆక్రమించిన వాటిల్లో కొంతయినా తిరిగి ఇస్తాననంటున్నాడు కదా. అందరూ అట్లా చేసేలా చూస్తాననంటున్నాడు. అందుకు చట్టాన్ని కూడా సవరిస్తాననంటున్నాడు. తొమ్మిది లక్షల ఎకరాల అసైన్డ్ భూములు ఎందరో ప్రముఖుల ఆక్రమణలో ఉందని అదంతా సేకరించి పేదలకు పంచుతాననంటున్నాడు. ఇప్పటికే ఉజ్జాయింపు లెక్కలకే యాభై లక్షల వివిధ రకాల ప్రభుత్వ మిగులు భూములు అన్యాక్రాంతంగా ఉన్నాయని తేలింది. ఇంకా శోధన చేస్తే ఇది చర్చల కాలంలో రెండు నక్సలైట్ పార్టీలు చెప్పిన కోటి ఇరవై అయిదు లక్షలని తేలవచ్చు. అయినా ఎవరు ముందు చెప్పారు. ఎవరు ముందు డిమాండు చేశారో అనే పట్టుదలలు కూడా మనకు అక్కర్లేదు. ఇప్పటికైనా ఈ ప్రభుత్వ మిగులు భూములు భూమిలేని నిరుపేదలకు పంచడానికి ప్రభుత్వం పూనుకోవడానికి ఒక ప్రజాభిప్రాయ నిర్మాణం కావాల్సి ఉన్నది.

అయితే పెద్దల దురాక్రమణలో ఉన్న ఆసైన్డ్ భూములు పేదలకు పంచడానికే వెనక్కు తీసుకోవాలని ఈ ప్రభుత్వం అనుకుంటున్నదా అనేది ఈ రెండున్నరేళ్ల ప్రభుత్వాచరణను బట్టి విశ్లేషించాలి. ఆసైన్డ్ భూములను ప్రభుత్వం వెనక్కి తీసుకోవడానికి ఒక ఆర్డినెన్స్ హైదరాబాదు నగరంలో రింగు రోడ్డు, ఫ్యాబ్ సిటీ, రిలయన్స్ కోసం రెండున్నర వేల

ఎకరాల భూమి, హార్డ్‌వేర్ పార్క్ మొదలైన వాటి అవసరాల దృష్ట్యా వచ్చిందని ప్రతిపక్షపార్టీలు, ప్రజాసంఘాలు అన్నీ ఆందోళన చేసాయి. హైదరాబాద్ నగరం చుట్టూ పేదలనుంచి అసైన్డ్ భూములు సేకరించడానికి ప్రభుత్వం నుంచి నోటీసులు జారి అయి బలవంతపు సేకరణలు జరుగుతున్నాయి కూడా. ఉదాహరణకు యాచారం మండలం యాచారం, పిల్లిపల్లి, చేరకిపల్లి గ్రామాల్లో 1969 నుంచి 75 దాకా ఎస్సీలకు అసైన్ చేసిన 115 ఎకరాల భూమిని మైనింగు జోన్ కోసం వాపసు ఇవ్వాలని నోటీసు జారీ అయింది. ఐదేళ్లుగా సాగు చేయడం లేదు గనుక వెనక్కు తీసుకుంటామని సెప్టెంబర్ 10న ప్రభుత్వం నోటీసు జారీ చేసింది. నీళ్లు, వనర్లు లేక అక్కడి దళితులు, బడుగువర్గాలు ఆ భూమిని సాగు చేసుకోలేకపోయాయి. ఇదే సాకుతో బాట సింగారంలో వందమంది ఎస్సీ, ఎస్టీ, ముస్లీం మైనారిటీలనుంచి వంద ఎకరాల భూమి వెనక్కి తీసుకోవడానికి నోటీసు యిచ్చారు. ఇక్కడా అంతర్జాతీయ విమానాశ్రయం వస్తున్న పరిసరాల్లో రిలయన్స్ కంపెనీ కోసమే 2,500 ఎకరాల భూ సేకరణ ప్రభుత్వం చేస్తున్నదని మీడియాలో చాలా ప్రచారం జరిగింది. బాట సింగారం ప్రజలు పెద్ద ఎత్తున ఆందోళన చేస్తే అటువంటిదేమీ లేదని తాత్కాలికంగా అధికారులు హామీ యిచ్చారు గానీ భూమి వెనక్కు తీసుకునే పనులు జరుగుతూనే ఉన్నాయి.

ఇంతకన్నా విచిత్రం 'అపర వినోబాభావేగా కాంగ్రెస్‌లో అనుచరులు అభివర్ణిస్తున్న వై.ఎస్.ఆర్. హయాంలో వినోబా భూదానోద్యమంలో ఎస్సీ, ఎస్టీ, బి.సి., ఒ.సి. మైనార్టీ ముస్లీంలకు పంచిన రెండు వందల ఎకరాల భూమిని వాపసు ఇవ్వాలని ఆదిభట్ల గ్రామంలో పేద రైతులకు నోటీసులిచ్చారు. ఇక్కడ హార్డ్‌వేర్ పార్క్ వస్తుందని చెప్తున్నారు. ఇంక జనహర్ష రియల్ ఎస్టేట్ పోర్కలపల్లి, రాపోలు మొదలైన గ్రామాల్లో కొంత కొనుగోలు చేసి, ఎంతో కలుపుకున్న భూదానోద్యమ భూములు, బినామీ భూముల సంగతి ఇప్పటికే కొంత మీడియాలో వెలుగు చూసింది.

ఇది కేవలం కొన్ని ఉదాహరణలే. పేదలకు పంచిన భూములు పెద్ద పెద్ద పరిశ్రమలు, ఎనిమిది లైన్ల రోడ్లు మొదలైన భారీ నిర్మాణాల కోసం వెనక్కి తీసుకోవడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను ప్రజలు, ప్రతిపక్షాలు, ప్రజాసంఘాలు అభ్యంతర పెట్టిన నేపథ్యంలో కేంద్రం చల్లగా ప్రత్యేక ఆర్థిక మండలాలు ఏర్పాటు నిర్ణయం తీసుకున్నది. సమాచార హక్కు బిల్లును ప్రవేశపెట్టి, చట్టం చేయడానికి ఐదేళ్లు దేశవ్యాప్తంగా చర్చ జరిగింది. మళ్లీ దానికి సవరణల పేరుతో తూట్లు పొడిచారు గానీ ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టం మీద చాపకింద నీరులా ఏ చర్చ లేకుండా చట్టం వచ్చిందని ఇటీవలే ఒక సదస్సులో అరుణారాయ్ తీవ్రంగా విమర్శించింది. ఇపుడింక ఈ అసైన్డ్ భూములను, లేదా భూపరిమిత చట్టానికి మించి ఉన్న భూములను, చివరకు రైతుల పట్టా భూములను కూడా ప్రభుత్వం సేకరించాలని పూనుకున్నా పట్టుదల వెనక ఈ ప్రత్యేక ఆర్థికమండలాల ఏర్పాటు దృష్టిని మనం కనిపెట్టాల్సి ఉన్నది.

రాష్ట్రంలో ప్రాంతాల వారీగా ఇప్పటికే సుమారుగా 49 ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది. వీటి కింద తొలిదశలో దాదాపు లక్ష ఎకరాల భూమి, మలిదశలో అంతకన్నా ఎక్కువే భూమి రైతుల నుంచి సేకరించి ఇవ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది. ఇవన్నీ సస్యశ్యామలమైన వ్యవసాయభూములే. గోదావరి జిల్లాలోని సారవంతమైన భూములవంటి వ్యవసాయ భూములను డెబ్భైలలో విప్లవాత్మక భూ సంస్కరణలు చేసిందని పేరు తెచ్చుకున్న బెంగాల్‌లోని లెఫ్ట్ ఫ్రంట్ ప్రభుత్వం సింగూరులో టాటా కంపెనీకి ఇవ్వడానికి సిద్ధ పడినపుడు ఆంధ్రప్రదేశ్‌లో గానీ, మరోచోట గానీ బహుళజాతి కంపెనీల కోసం, కార్పోరేటు సెక్టార్ కోసం ప్రభుత్వమే భూమి సేకరించి ఇవ్వదనే భ్రమలు అక్కర్లేదు.

ఇవ్వాళ మనం ఏ దశకు చేరుకున్నామంటే పేరు ఏదయినా పెట్టనివ్వండి – ప్రత్యేక ఆర్థిక మండలుల పేరుతో భూసేకరణ చేసి బహుళ జాతి కంపెనీల, కార్పోరేటు సెక్టర్ల ఒక ఏజెంటుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పని చేయడానికే ప్రజాప్రతినిధుల సభలు చట్టాలు చేస్తున్నాయి.

ఈ సంవత్సరం ఫిబ్రవరి నుంచి అమలులోకి వచ్చిన ప్రత్యేక ఆర్థిక మండలులలోకి చేరడానికి టిసిఎస్, ఇన్ఫోసిస్, విప్రో, సత్యం తదితర బడా సాఫ్ట్‌వేర్ కంపెనీలతో పాటు రిలయన్స్, ఎస్సార్, టాటా, బజాజ్ ఆటో, భారత్ ఫోర్జ్ వంటి బడా కార్పోరేటు సంస్థలు, నోకియా, ఫైక్స్‌ట్రానిక్స్, పోస్కో వంటి విదేశీ కంపెనీలు కూడా ముందుకు వస్తున్నాయి. వీటిలో ప్రత్యేకించి మన రాష్ట్రంలో సెజ్‌లో చేరడానికి దరఖాస్తులు పెట్టుకున్న సంస్థలు కూడా వున్నాయి.

మొదలు సెజ్‌లకిచ్చే ప్రత్యేక రాయితీల వల్ల ప్రభుత్వ ఖజానాకు లక్ష కోట్లకు పైగా ఆదాయం గండి పడుతుందని ఆర్థికమంత్రి చిదంబరం అన్నాడు. రిజర్వు బ్యాంకు, బీమా నియంత్రణ అభివృద్ధి సంస్థకూడ మొదట విముఖత తెలిపాయి. వ్యవసాయేతర ప్రయోజనాలకోసం వ్యవసాయ భూములు సేకరించవద్దని మొదట సోనియాగాంధీ, మన్మోహన్ సింగ్ కూడా అన్నారు. కాని సెజ్‌లు వృద్ధి రేటును పెంచుతాయని, ఉద్యోగావకాశాలు పెంపొందుతాయని ప్రధాని మాటమార్చారు. పరిశ్రమల మంత్రి కమలనాథ్ ప్రతిపాదనే పై చేయి కావడానికి ఆయన పాల్గొన్న అన్ని అంతర్జాతీయ ప్రపంచబ్యాంక్ సదస్సుల ఒత్తిడియే కారణం.

నిజానికి బహుళజాతి కంపెనీల పెట్టుబడులతో వచ్చే ఉద్యోగావకాశాల గురించి ఒక్క ఉదాహరణ చాలు. పంజాబ్‌లో వేలాది ఎకరాల వ్యవసాయ భూమిని రైతుల తీవ్రమైన ప్రతిఘటనను కాదని, యాభైవేలమందికి ఉద్యోగాలు వస్తాయని చెప్పి ప్రభుత్వం పెప్సీ కంపెనీకి ధారాదత్తం చేసింది. పెప్సీ కంపెనీ 489 మందికి మాత్రమే ఉద్యోగాలు ఇచ్చింది. ఎంతో సాంకేతికమైన, కంప్యూటరైజ్డ్ నైపుణ్యాన్ని ఉపయోగించుకుంటున్న హైటెక్ కంపెనీలు ఎటువంటి ఉద్యోగావకాశాలు, ఎంతమందికి కల్పించగలవో అనుమానమే.

ఒకవైపు జలయజ్ఞం పేరుతో సాగుభూమికి నీటివసతి పెంచుతామంటున్న ప్రభుత్వం, ఇప్పుడు 'భూమి భారతి' పేరుతో సేకరించే భూమి వ్యవసాయం కోసమే పేదరైతులకు పంచుతుందా అన్నది సందేహమే. ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగా వ్యవసాయరంగాన్ని నిరుత్సాహపరుస్తున్నది. వ్యవసాయ సంబంధమైన పరిశ్రమలు నెలకొల్పడం లేదు. ఉన్నవి మూతబడి పోతున్నాయి. ఆహార ధాన్యాలు,

చమురు గింజలు, చెరకు, పత్తి, జనపనార మొదలైన పైర్లు ఆంధ్రప్రదేశ్‌లో 97 నుంచి 2002 వరకు 11.13 మిలియన్ హెక్టార్లలో సాగు కాగా 2002–2006 మధ్యకాలంలో 10.55 హెక్టార్ల సాగుకు తగ్గిపోయిందని స్వయంగా వ్యవసాయ మంత్రి శరద్‌పవార్ పార్లమెంటులో చెప్పాడు. ఇందులో తెలంగాణ ప్రాంతంలో, హైదరాబాద్ నగర పరిసరాల్లో వ్యవసాయ భూములన్నీ కంపెనీల భూములుగా, రియల్ ఎస్టేట్‌గా, రింగురోడ్లుగా మారడం మన కళ్ల ముందే చూస్తున్నాం.

శాసనసభలో రెవిన్యూ మంత్రి ధర్మాన ప్రసాదరావు మూడు హామీలు ఇచ్చారు. అసైన్డ్ భూములు సేకరించి, అవి నగర పరిసరాల్లోనయితే పేదలకు గృహవసతి, వైద్యశాలలు నిర్మిస్తామని, ఉపాధికి అనుగుణమైన ఇన్‌ఫ్రాస్టక్చర్ కోసం కేటాయిస్తామని అన్నారు. ఇవి వినడానికి చెవికి ఇంపుగా ఉంటాయి. ఇవన్నీ ఏ రంగంలో చేపడతారనేది ఒక ప్రశ్న. ఇప్పటికే చాలా రియల్ ఎస్టేట్ కంపెనీలు ఇల్లు కట్టించడానికే పేద రైతుల నుంచి వేల ఎకరాల భూములు కొనుగోలు లేదా ఆక్రమణ చేసాయి. ప్రభుత్వానికయితే అటువంటి బడా నిర్మాతల కోసం సేకరించడం ఇంకా సులభమవుతుంది. ప్రభుత్వం నెలకొల్పిన ఒక్క ఆసుపత్రి గురించి కూడ ఇటీవల కాలంలో వినలేదు. నగరం నిండా ఐదునక్షత్రాల ప్రైవేటు ఆసుపత్రులే వెలిసాయి. నగర పరిసరాల్లోనూ రోగులదివిటి ఆర్థికవాహకుహారాలు అవే. ఒక్క వై.ఎస్.ఆర్. ఎస్టేట్‌ను అభివృద్ధిపరచడానికి ప్రభుత్వ శాఖలన్నిటి నుంచీ వాడుకున్నా ఇన్‌ఫ్రాస్టక్చర్ గురించి చర్చ జరుగుతున్నది గానీ రాష్ట్రంలో ప్రజా ప్రయోజనం నెపంతో ధారాదత్తం చేసిన భూములన్నింటికీ తొండలు కూడా గుడ్లు పెట్టని భూములను స్వర్గధామాలుగా మార్చడానికి ఉపయోగపడినవి ప్రజల వనర్లే, ప్రజల శ్రమ వనర్లే. అటువంటి ప్రకృతి, మానవ వనర్ల సేకరణకు నిన్నటిదాకా సంక్షేమ రాజ్యంగా ప్రకటించుకున్న ప్రభుత్వమే ఇవ్వాళ ఏజెంటుగా మారడమన్నదే ప్రజాస్వామ్యానికి ఒక పెద్ద సవాల్.

ప్రభుత్వం పేదలకు కేటాయించిన అసైన్డ్ భూములు పరాధీనమైన పక్షంలో వాటిని వెనక్కి తీసుకుని మళ్లా వాళ్లకివ్వడం కాకుండా ప్రజాప్రయోజనాల కోసం వినియోగిస్తామని ప్రభుత్వం అనడంలో చిత్తశుద్ధిని శంకించాల్సి వున్నది. అసైన్డ్ భూములను ఇతరులుకొంటే ప్రభుత్వం, వాటిని స్వాధీన పరుచుకొని మళ్లీ పాత అసైనీకే ఇవ్వాలని 1997 చట్టం చెబుతున్నది. అయితే ఆ భూములను వెనక్కు తీసుకొని ప్రభుత్వం భావించే ప్రజా ప్రయోజనాలకు వినియోగించుకునే వీలు కల్పించే బిల్లు ప్రస్తత శాసనసభలో ప్రవేశ పెట్టారు. అది 22 డిసెంబర్ నాటికి ఆమోదాన్ని కూడా పొందవచ్చు.

అన్యక్రాంతమైన భూములను స్వాధీనపరచుకొని ప్రభుత్వం బలహీన వర్గాల గృహ నిర్మాణం చేపట్టాలనే విశిష్ట ప్రతిపాదన తప్ప నవంబర్ 6 నాటి ఆర్డినెన్స్‌లో ప్రవేశపెట్టిన ప్రజోపయోగాలు, మౌలిక సదుపాయాలు, అభివృద్ధి లేదా ఇతర ప్రజావసరాల కోసం వినియోగిస్తామనే మాటలు చాలా అనిర్దిష్టమైనవి. ప్రభుత్వం మనసులో ఏముందో పేదప్రజలకు అంతుపట్టనవి ఇప్పుడు కొత్తగా వాటికి పరిశ్రమలు, పర్యాటకాభివృద్ధి అనే మాటలు చేర్చి డిసెంబరు 19న శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టారు. ఈ పరిశ్రమలు, పర్యాటకాభివృద్ధి రెండూ బహుళజాతి కంపెనీల కోసమేననేది చాలా స్పష్టం.

సామ్రాజ్యవాద భూదాహాన్ని తీర్చే దిశగా కాకుండా దళితులు, ఆదివాసీలు, భూమిలేని నిరుపేదలయిన బడుగు వర్గాలు కూడు, గూడు, గుడ్డ, పొందగలిగే నిర్దిష్టమైన ఏర్పాట్లతో భూ పంపిణీ చేపట్టాలి. అది గ్రామాల్లో ప్రజల ముందు చర్చించి నిర్ణయించాలి. గరిష్ట భూపరిమితి గాక గ్రామాల్లో భూమిలేని నిరుపేదల కుటుంబాలను గుర్తించి, వారు ఆ భూమిలో స్త్రీ, పురుషులు సమష్టిగానే కష్టం చేసుకుని పండించగలరు గనుక వారి జీవికకు అవసరమైన భూమిని ఇంటి యజమానురాలయిన మహిళ పేరుమీద పట్టా చేసి పంచాలి. ఇది కనీసం మూడు నుంచి ఐదు ఎకరాలనయినా ఉండాలి. ఇటువంటి కుటుంబాలు దళిత, ఆదివాసీ, బడుగు వర్గాలే అవుతాయనేవి స్పష్టమే. రైతాంగం పోరాడి సాధించుకున్న భూములు వారికి స్వాధీనం చేయాలి. 1/70 చట్టాన్ని సక్రమంగా అమలుచేయాలి. ఆదివాసేతర సేవలకు మైదాన ప్రాంతాలలో భూమి ఇవ్వాలి. కార్పోరేటు, కాంట్రాక్టు వ్యవసాయాన్ని రద్దు చేసి ఆహార పంటలకు ప్రాధాన్యతనిచ్చే వ్యవసాయ విస్తరణ సేవలను చేపట్టాలి. కొత్తగా భూపంపిణీ వల్ల భూమి పొందే చిన్న రైతులకు అవసరమైన వ్యవసాయ ఉత్పాదకాలన్నింటినీ ప్రభుత్వం చౌకధరల ద్వారా, బ్యాంక్ వడ్డీలేని రుణాల ద్వారా ఇప్పించాలి. భూమితో పాటు ఉపాధి సౌకర్యాలు కల్పించాలి. నీటి సౌకర్యాల కోసం భారీ ప్రాజెక్టులు కాకుండా చిన్న తరహా ప్రాజెక్టుల నిర్మాణం, ఎత్తిపోతల పథకాలు చేపట్టాలి. చెరువులు, కుంటలు మరమ్మత్తులు చేయించాలి. వ్యవసాయంతో సంబంధం లేని ఫార్మ్‌హౌజ్‌లు, స్టూడియోలు, పరిశ్రమలు కార్పోరేట్ విద్య, వైద్యం, వినోదం, రియల్ ఎస్టేట్, పత్రికల పేరు మీద కొనసాగుతున్న వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకొని పేదలకు పంచాలి. పట్టణాల్లో వివిధ సంస్థలకు అవసరానికి మించి ప్రభుత్వం యిచ్చిన భూమిని స్వాధీనం చేసుకుని పేదలకు పంచాలి. లేదా ప్రభుత్వమే పేదల కోసం గృహనిర్మాణాలు, ప్రభుత్వ రంగంలో ఆసుపత్రులు, పాఠశాలలు, పరిశ్రమలు నెలకొల్పాలి. ఈ ప్రతిపాదనలు కొత్తవికావు. 2004 అక్టోబర్‌లో శాంతిచర్చలలో నిర్దిష్టమైన ప్రతిపాదనలుగా చర్చకొచ్చినవే. అపుడు రెండు నక్సలైట్ పార్టీలు కె.ఆర్.వేణుగోపాల్ అధ్యక్షతన ఎస్ఆర్ శంకరన్, బొజ్జా తారకం మొదలైన ముప్ఫైంమందితో భూమి కమీషన్ వేసి ఈ చర్యలు చేపట్టమని సూచించాయి. ప్రభుత్వం కోనేరు రంగారావు అధ్యక్షతన ఆరుగురితో కమీషన్ వేసింది. ఆ కమీషన్ రిపోర్టు కూడా ఇచ్చింది. అందులో ఏ సూచనలున్నాయో బయటికి రాలేదు. ఇప్పుడు మళ్లీ కారణాలేమయితేనేమిటి భూ సంస్కరణల చర్చ ప్రారంభమైంది. సిపిఐ, సిపిఎం, వంటి పార్టీలు, ప్రజాసంఘాలు, విప్లవపార్టీలు కూడా మళ్లీ భూమిలేని నిరుపేదలకు నిర్దిష్టంగా భూమి చెందాలనే ప్రతిపాదనలతో ముందుకొస్తున్నాయి.

ప్రభుత్వం బహుళజాతి కంపెనీలకోసమో, ప్రత్యేక ఆర్థికమండలాల కోసమో, భూస్వాధీన భూమి భారతి యజ్ఞం ప్రారంభించింది కావచ్చు. దాని ప్రయోజనలేమయినప్పటికీ ఈ చర్చను భూమిలేని నిరుపేద ప్రజల కూడు, గూడు, గుడ్డ వంటి మౌలిక అవసరాలు తీర్చే భూపోరాటంగా చేపట్టాల్సిన బాధ్యతమాత్రం ప్రజల మీద, ప్రజాస్వామ్యవాదుల మీద వుంది. ◆

# ప్రత్యేక తెలంగాణ లక్ష్య సాధన దిశలో...

**- జి. ప్రభాకర్**

ప్రత్యేక తెలంగాణ అనేది తెలంగాణ ప్రజల చిరకాల ప్రగాఢ ఆకాంక్ష. తొలి భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సందర్భంగానే ఆంధ్రరాష్ట్రంతో పాటుగా తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగానే ఏర్పడి ఉండాల్సింది. నాటి ఫజుల్ ఆలి కమిషన్ చేసిన సిఫార్స్ ఇదే. అప్పట్లో నెహ్రూ సైతం అన్యాపదేశంగా వెలిబుచ్చిన అభిప్రాయం కూడా ఇదే. కానలా జరగలేదు. 'పెద్ద మనుషుల ఒప్పందం' లాంటి కంటి తుడుపు ఒప్పందాలతో, బూటకపు వాగ్దానాలతో బుజ్జగింపులతో ఆదరాబాదరాగా తెలంగాణను కలిపేసుకుంటూ ఆంధ్రప్రదేశ్ అవతరించింది (1956). అలా ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ అంతర్భాగమైంది. ఇది చారిత్రక సత్యం. కనుకనే ఒక పుష్కరకాలం గడిచేప్పటికే 1969లో 'ప్రత్యేక తెలంగాణ' ఉద్యమం రక్తసిక్తంగా బద్దలైంది. ఈ నినాదం ఆలంబనగానే దూసుకొచ్చిన తెలంగాణ కాంగ్రెస్ నేత చెన్నారెడ్డి ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని అఖిలభారత కాంగ్రెస్ అధినేత ఇందిరమ్మకి పాదాక్రాంతం చేసేసి సమైక్యాంధ్ర ముఖ్యమంత్రిగా సర్దుకుపోయాడు. 1956 నాటి ఆంధ్రప్రదేశ్ అవతరణ తెలంగాణకు జరిగిన మొదటి విద్రోహం అయితే, 69-70లలో జరిగినది స్వద్రోహం. ఇలా ఆదినుండీ ఏదో ఒక ద్రోహానికి గురవుతూనే వస్తోంది తెలంగాణ.

రాష్ట్రంలో తొలినుండి పాలక పార్టీగా ఉన్న జాతీయ పార్టీ కాంగ్రెస్, తరువాత పాలకపార్టీ స్థానాన్ని ఆక్రమించిన ప్రాంతీయ పార్టీ టి.డి.పి., పాలనాధికారానికి ఏనాడు కాస్తంత కూడా చేరువ కాలేకపోయినా జాతీయ పార్టీ విభాగంగా రాష్ట్రంలో తన అస్థిత్వాన్ని చాటుకువస్తున్న బి.జె.పి., పశ్చిమ బెంగాల్, కేరళల్లో లాగ తాముగా పాలనాధికారానికి చేరువ కాలేని అశక్త పార్టీలే అయినా అధికారాన్ని అందుకోవాలని, అంటిపెట్టుకోవాలని ఆశించే ఏ పార్టీ అయినా తమను మచ్చిక చేసుకోవాల్సిన స్థితిని కల్పించే రీతిలో ఉంటూ నాలుగు, పుంజీల ఓట్లు - నాలుగు సీట్ల కోసం ఏదో ఒక పాలక పార్టీకి దన్నుగా ఉండడంలోనే తమ అస్థిత్వాన్ని చాటుకుంటున్న సి.పి.ఐ., సి.పి.ఎం. పార్టీలు - ఈ పార్టీలన్నింటికీ చాలా స్పష్టంగా తెలుసు తెలంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రాన్ని గాఢంగా కోరుకుంటున్నారని. ఆ ప్రజల ప్రగాఢ ఆకాంక్షని కడాకూ నిరాకరించుకుపోవడం అప్రజాస్వామికమని, అసాధ్యమని కూడా వాటికి తెలుసు. అయినా ఒక పట్టాన ఈ పార్టీలేవీ ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకు అంగీకరించవు. ఇటీవలి వరకూ ఈ పార్టీలన్నీ ప్రత్యేక తెలంగాణ ప్రతిపాదనను వ్యతిరేకిస్తూనే వచ్చాయి. ప్రత్యేక తెలంగాణ సాధనే తన లక్ష్యంగా ప్రకటించుకుని రంగం మీదికి వచ్చిన తెరాస (టి.ఆర్.ఎస్.) అందుకోసం ఢిల్లిలో తాను చేసే లాబీయింగ్‌ల మీద, కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీని ప్రసన్నం చేసుకోవడం పైనే ఆధారపడిపోతూ వచ్చింది. పొత్తు ధర్మంగా కేంద్రంలోని కాంగ్రెస్ సంకీర్ణ ప్రభుత్వం విదిల్చిన రెండు మంత్రి పదవులతో తెరాస అగ్రనేతలిద్దరూ సర్దుకుపోతూ వచ్చారు. అందని 'ప్రణబ్ కమిటీ' ద్రాక్షపళ్ల గుత్తివైపు ఆశగా చూస్తూ, ఇదిగో అదిగో తెలంగాణ ద్రాక్ష గుత్తిని నోటకరుచుకు ఒస్తున్నాం, తెస్తున్నాం అంటూ నమ్మబలుకుతూ కాలక్షేపం చేసారు. చేరువగా ఉంచుకుంటూనే చేటు చేసి తరిమేసే కళలో చేయి తిరిగిన చేతిపార్టీ చేతీవాటాన్ని తెరాస నాయకత్వం గుర్తించేప్పటికే జరగాల్సిన నష్టం జరిగిపోయింది. ఎంత పదాలో అంతగానూ భ్రష్టుపడ్డ తరువాతనే భంగబడ్డ తర్వాతనే, తెరాస బయటపడింది.

అయినప్పటికీ తెరాస తెలంగాణలో ఇతర పార్లమెంటరీ పార్టీలన్నింటికీ గుబులుపెట్టించేదిగానే ఉండగలుగుతోందంటే అందుకు కారణం అది తన భుజాన్నెత్తుకున్న నినాదమే! ఆ బలం ఆ గొప్పదనం అంతా 'ప్రత్యేక తెలంగాణ' నినాదానిదే! తెలంగాణలో ప్రజాభిప్రాయానికి ప్రజల ఆకాంక్షకి ఒక్క తెరాస మాత్రమే ప్రాతినిధ్య పార్టీగా మిగిలుండిపోతుండటం అనేది ఇతర పార్టీలకి పెద్ద కంట్రగింపే. తెలంగాణలో తమ ఉనికినే ప్రశ్నార్థకం చేసే విపరిణామం ఇది. కనుక అలాంటి విపరిణామాన్ని అడ్డుకోవడం కోసం ఇప్పుడు తొట్రుపాటుతో తమతమ గొంతులు సవరించుకొంటున్నాయి. తెలంగాణ వివక్షకు గురవుతూ వెనుకబడిపోయి ఉంటుండడం నిజమే అయినా అందుకు పరిష్కారం 'ప్రత్యేక ప్యాకేజీ'యే తప్ప విడిపోవడం కాదని అంటున్నా రాష్ట్రంలో సి.పి.ఐ. ప్రత్యేక తెలంగాణ పట్ల కరడుగట్టిన వ్యతిరేకతతో ఏనాడు లేదు. సూత్రరీత్యా సిద్ధాంత రీత్యా ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకు ఒప్పంగాక ఒప్పం అని పదేపదే ఉద్ఘాటిస్తూ వచ్చిన సి.పి.ఎం. తన బాణిని, వాణిని మార్చుకుని 'కాంగ్రెస్ వారిస్తే, తెరాస వారు పుచ్చుకుంటే మధ్యలో మేమడ్డుకుంటామా? ఇవ్వడం ఇష్టం లేని కాంగ్రెస్ అలా చెప్పకుండా మధ్యలో మా భుజంపై తుపాకి పెట్టి తెలంగాణపై గురిపెట్టడమేమిటి?' అంటూ గుర్రుకుంటోంది. ప్రత్యేక తెలంగాణకు బద్ధవిరోధి అయిన టి.డి.పి. అధినేత చంద్రబాబుతో నెయ్యం కోసం 'రెండు రాష్ట్రాలు - ఒక ఓటు' అనే తన కాకినాడ తీర్మానాన్ని అటకెక్కించేసింది బి.జె.పి. ఇటీవలి వరకు బి.జె.పి. అగ్రనేతలు అద్వానీ, వెంకయ్యలు అనేక సందర్భాలలో 'ప్రత్యేక తెలంగాణ' ఊసే వద్దని ఉద్బోధిస్తూ వచ్చారు. అలాంటి బి.జె.పి., టి.డి.పి. తో తన పొత్తు పొగిలిన తరువాత ఇప్పుడు, కాకినాడ తీర్మానం బూజు దులిపి ముస్తాబు చేసుకుంటోంది. ప్రత్యేక తెలంగాణను ఒక్క జాతీయ పార్టీయే ఏర్పరచగలదని, తెరాస లాంటి ప్రాంతీయ పార్టీవల్ల అది సాధ్యపడదని అంటోంది. జాతీయ పార్టీ అంటే కాంగ్రెస్ కూడా అని పొరపడకూడదని, కాంగ్రెస్ అది చేయజాలదని, తమ హయాంలోనే ఛత్తిస్‌ఘడ్, జార్ఖండ్, ఉత్తరాఖండ్ లాంటి చిన్న రాష్ట్రాలు ఏర్పడ్డాయని కనుక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సైతం తమ వల్లనే సాధ్యమని ఢంకా భజాయించేస్తోంది. కాగా ఈ విషయంలో కాంగ్రెస్ ఇతర పార్టీలన్నింటికీ మించిన బడాయితనాన్ని ప్రదర్శిస్తోంది. తాను సైతం ప్రత్యేక తెలంగాణకు

వ్యతిరేకం కాదని, అయితే ఆ ఏర్పాటు ఎప్పుడు ఎలా చేయాలనే బాధ్యతను సోనియాగాంధీ చేతుల్లో పెట్టామని, ఆమె 'సరైన సమయం'లో 'సరైన తీరులో' సదరు ఏర్పాటును ప్రకటిస్తారని, కనుక దేవతలాంటి సోనియమ్మపై విశ్వాసముంచి వేచిచూడాలే తప్ప అనవసరంగా యాగీ చేయడం తగదని రాగాలాపన చేస్తోంది.

ప్రత్యేక తెలంగాణ పట్ల, ఆ నినాదాన్ని భుజాన్నెత్తుకున్న తెరాస పట్ల, ప్రత్యేకించి తెరాస అధినాయకులు కె.సి.ఆర్., నరేంద్రల పట్ల రాజశేఖరరెడ్డి తన విముఖతని నిర్లక్ష్యాన్ని అనేక సందర్భాలలో చాటుకుంటునే వస్తున్నాడు. వారితో కొంత సంయమనంతో సమన్వయంతో ఉండాలనే అధిష్ఠానం హితవు పట్ల అసహనంతో ఇబ్బంది పడుతూనే వచ్చాడు. ప్రత్యేక తెలంగాణ అవసరాన్ని అతడేనాడూ అంగీకరించలేదు. 2004 ఏప్రిల్ ఎన్నికల నాటి కాంగ్రెస్ ప్రణాళికలో చేసిన వాగ్దానానికి 2వ ఎస్.ఆర్.సి. వేయడమని భాష్యం చెబుతూ వచ్చాడు. తెరాస తో పొత్తు రద్దవడమే మేలని అతడు భావిస్తూ వచ్చాడు. బంకలా తమతో అంటకాగుతున్న తెరాసను చీల్చి చిచ్చుపెట్టాడు. తమతో పొత్తు భాగస్వామిగా ఉంటుండిన తెరాస మునిసిపల్ పంచాయితీ ఎన్నికల్లో చితికిలపడిపోవడం పట్ల సంతోషించాడే తప్ప విచారించలేదు. ఆ ఎన్నికల్లో తన ప్రధాన ప్రత్యర్థి పార్టీ టి.డి.పి. పుంజుకోవడం పట్ల బాధ కంటే, తెరాస చిత్తయిపోయినందుకు అతడు సంతోషించాడు. ఇక ఆ తరువాత తెరాసను పొత్తు బంధం నుండి విడదీసి సాగనంపే ప్రక్రియని వేగిరపరచాడు. మున్సిపల్ పంచాయితీ ఎన్నికల్లో రాజశేఖరరెడ్డి చాటుకున్న ఏకచ్ఛత్రాధిపత్యాన్ని, తెరాస చతికిలబడిపోవడాన్ని గమనించిన కాంగ్రెస్ అధిష్ఠానానికి ఇక హితవు చెబుతూ రాజశేఖరరెడ్డిని ఇబ్బందిపెడుతూ, తాము ఇబ్బందుల్లో ఇరుక్కోకూడదనే జ్ఞానోదయం అయిపోయింది. వెరసి ఈ పరిణామ పరంపర పరాకాష్టగానే కరీంనగర్ లోక్‌సభా స్థానానికి ఉప ఎన్నికనేది రంగం మీదికొచ్చింది.

తమతోని సాంగత్యం ఫలితంగా తెరాస దాని అధినేతలైన కె.సి.ఆర్., నరేంద్రలు ఎంతగా తమ బరువూ పరువూ కోల్పోయినప్పటికీ వారు భుజాన్నెత్తుకున్న నినాదం బరువు చూసి రాజశేఖరరెడ్డి సైతం కొంత భయపడుతున్నాడనే చెప్పాలి. కనుకనే 'తెలంగాణకు సంబంధించి తలుపలు మూసుకుపోలేదు, సోనియాగాంధీ దీనిపై తీవ్రంగా ఆలోచిస్తున్నారు. మిగిలిన రాష్ట్రాల్లో కూడా ఇలాంటి సమస్యలున్నాయి. అందువల్ల ఆమెకు కొంత సమయం కావాలి' అని తాజాగా ముక్తాయిస్తూ ప్రత్యేక తెలంగాణ ఏర్పడటమంటూ జరగాలంటే అది ఒక్క తమవల్లనే సాధ్యం అని చెబుతూ, రాజశేఖరరెడ్డి కూడా తెలంగాణ సెంటిమెంట్ పాచికతోనే కరీంనగర్ ఎన్నికల గండం నుండి గట్టెక్కాలని ప్రయత్నిస్తున్నాడు.

తెలంగాణ ప్రజలు ప్రత్యేక తెలంగాణను గాఢంగా కోరుకుంటున్నారనే వాస్తవాన్ని రాష్ట్రంలోని చిన్నా పెద్దా రాజకీయ పార్టీలన్నీ కాదనలేకపోతున్నాయి. పైగా ఒక టి.డి.పి. మినహా ఇతర పార్టీలన్నీ ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకు తాము వ్యతిరేకం కాదని కూడా ప్రకటించుకుంటున్నాయి. అయినప్పుడిక ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకి మార్గం సుగమం అయినట్టు భావించగలమా? భావించలేం. ఎందుకంటే, ఇవి తెలంగాణ ప్రజల ప్రగాఢ ఆకాంక్షకు సూచికలే తప్ప ఆ ఆకాంక్ష నెరవేరుతుందనే హామీకి నిదర్శనాలు ఎంతమాత్రం కావు.

ప్రత్యేక తెలంగాణ సాధన అనేది అంత సులువైనదే అయితే రక్తార్పిత త్యాగాలతో కూడిన 1969ల నాటి ఉద్యమ పర్యవసానంగానే అది జరిగి ఉండేది. కానలా జరగలేదు, ఇందుకు చెన్నారెడ్డి ద్రోహచింతనే కారణమని చెబితే సరిపోదు. దీనర్థం చెన్నారెడ్డి ద్రోహానికి పాల్పడలేదని చెప్పడం కాదు. అది సమస్య లోతుల్ని అర్థం చేసుకొని పైపై పరిశీలన మాత్రమేనని చెప్పడానికే. ప్రత్యేక రాష్ట్ర సాధన సంగతలా ఉంచి, చెన్నారెడ్డితో కలుపుకుని నలుగురు తెలంగాణ ప్రాంతీయులే రాష్ట్ర ముఖ్యమంత్రులుగా ఉండిన కాలంలో కూడా తెలంగాణపై కొనసాగుతున్న వివక్షని ఏ మాత్రం అడ్డుకోలేకపోయారు. ఇది కేవలం వారివారి వ్యక్తిగత అసమర్థతలు, అశక్తతలు, అమ్ముడుపోడాలు, విద్రోహాలుగానే పరిగణించడం లోతైన పరిశీలన అనిపించుకోదు. అసలు ప్రత్యేక తెలంగాణ సమస్యని రాష్ట్రంలోని వివిధ రాజకీయ పార్టీలు వాటివాటి విధానవైఖరుల పరిమితిలో చూడటమనేది కూడా పాక్షిక పరిశీలనే. ఈ పార్టీల వెనుకుండే పాలక వర్గ శక్తుల ప్రయోజనాలు, వాటి కార్యకలాపాల నేపథ్యంలో పరిశీలించాల్సి ఉంటుంది. ఎందుకంటే, ఈ పార్టీలు ప్రభుత్వాలు పాలకవర్గాల ప్రయోజనాలకు అనుగుణంగా వాటి చేతిలో పనిముట్లుగానే పనిచేసేవి. కనుక వీటి సాధారణ ప్రకటిత వైఖరులు విధానాలు అనేవి ప్రజాసంక్షేమం, ప్రజాప్రయోజనాల పేరుమీదనే చెలామణి అవుతుంటాయి. కానీ వాటి అంతస్సారాలు, అంతిమ ఫలితాలు మాత్రం పిడికెడు దోపిడీ పాలకవర్గాల అనుకూలంగాను, ఆశేష ప్రజానీకానికి వ్యతిరేకంగానే ఉంటుంటాయి.

భద్రాచలం నుండి విశాఖపట్నం వరకు విస్తరిస్తున్న బహుళజాతి కంపెనీలకి ప్రత్యేక ఆర్థిక మండళ్లకి (సెజ్‌లు) అవసరమైన అపార జలాల్ని అందించడానికి తలపెడుతున్నదే పోలవరం ప్రాజెక్టు, అయితే అది కేవలం లక్షలాది బడుగురైతుల సేద్యపు అవసరాలకోసమేనంటారు. అడవులు కొండలు అన్నింటినీ స్వదేశీ, విదేశీ బడాకంపెనీలకి ధారాదత్తం చేసేస్తూ అక్కడి నుండి ఆదివాసీ ప్రజలందరినీ దేశం నలుమూలలకీ బికారులుగా బిచ్చగాళ్లుగా తన్నితరిమేస్తూ అదంతా దేశాభివృద్ధికీ ప్రజల సంక్షేమానికే అంటారు. బహుళజాతి కంపెనీల ప్రయోజనాల కనుగుణంగా వందల వేల వస్త్రోత్పత్తి పరిశ్రమల్ని మూసేస్తూ లక్షలాది కార్మికుల్ని వీధుల పాల్జేస్తూ అదంతా దేశప్రయోజనాలకేనంటారు. ఈనాడు మగ్గం గుంతలే నేతకార్మిక కుటుంబాల బొందల గడ్డలవుతున్నాయి. వలలే మత్స్యకారులకు ఉరితాళ్లవుతున్నాయి. పురుగు మందులే బడుగు రైతులకి పెరుగన్నాలవుతున్నాయి. ప్రభుత్వాసుపత్రులు పేదరోగుల్ని పైలోకాలకి పంపే పాస్‌పోర్టు కార్యాలయాలవుతున్నాయి. ప్రభుత్వ పాఠశాలలు పగలే గబ్బిలాల నిలయాలవుతున్నాయి. రింగ్‌రోడ్డులు, స్టార్ హోటళ్లు, పబ్‌లు, డిస్కోథెక్‌లు, ఐమేక్స్ థియేటర్లు, ఫిల్మ్‌సిటీలు, హైటెక్ సిటీలు ఇవన్నీ ప్రజలనుద్ధరించడానికే అంటున్నారు. ప్రజలనెత్తురు పిండి మరీ వసూళ్లు చేసే ప్రభుత్వ ఖజానా నుండి అప్పనంగా వీటి నిర్వాహకులకి నిధుల వరదని ప్రవహింపజేస్తున్నారు. పేదలని తన్ని తరిమేసి మరీ వీటికి వందలవేల ఎకరాలు కట్టబెడుతున్నారు. బడాబాబులు, బడాకంపెనీలు ఫ్యాషన్‌షోల పేరుతో

ప్రదర్శనలు నిర్వహిస్తూ కోట్లు కూడేసుకుంటున్నారు. ఒకపక్క ఒంటిని కప్పుకోడానికే గుడ్డముక్కల్లేక కోట్లాది ప్రజలు అర్ధనగ్నంగానే ఉంటుండగా, ఇంకో పక్క ఒంటినిండా కావలసినన్ని గుడ్డలతో కప్పుకోగల అవకాశాలున్న వారి చేతనే పావునగ్నం, అర్ధనగ్నమే కాదు పేయింటింగ్ పేరుతో ఏకంగా పూర్తి నగ్న ప్రదర్శనలు సైతం నిర్వహిస్తూ ఆ రకంగా పేద-సంపన్న వర్గాల మధ్య సమానత్వాన్ని సమతుల్యతని సాధించి పెట్టేస్తున్నారు, ఏమిటీ వెర్రి? అని అడిగితే అంగాంగ ప్రదర్శన కూడా ఒక పరిశ్రమే అంటున్నారు. దీని ద్వారా అనేక మందికి ఉపాధి కల్పన జరుగుతోందంటున్నారు. ఈ సోకాల్డ్ పరిశ్రమకి ప్రసార ప్రచార మాధ్యమాలలో విపరీత ప్రాధాన్యత ఇస్తున్నారు. కేవలం ఫ్యాషన్‌షోల ప్రచారానికే కేటాయింపై ప్రచారం కల్పించే మ్యాగజైన్లు, టీవీ ఛానల్లు పుట్టుకొస్తున్నాయి. ఈ తీరులో పనిగట్టుకు మరీ యువతరంలోని సామాజిక చైతన్యాన్ని నాశనం చేస్తూ యువతరాన్నంతటినీ నిర్వీర్యపరుస్తూ చేయాల్సిన కీడంతా చేసేస్తున్నారు. కోట్లాది మంది పేద అల్పాదాయ వర్గాల ప్రజలకందుబాటులో ఉంటూ వారి అవసరాలనాదుకుంటున్న, లక్షలాది పేదలకు ఏదో మేరకు ఉపాధి కల్పిస్తున్న చిల్లర దుకాణాలు, బడ్డీకొట్లు, కాకాహోటళ్లు, తోపుడుబళ్ల దుకాణాలు, సంతలు లాంటి వాటిని పనిగట్టుకు మరీ నాశనం చేసేస్తున్నారు, మాయం చేసేస్తున్నారు. వాటి స్థానే బడాకంపెనీలు, బహుళజాతి కంపెనీల చేత ఉన్నత మధ్యతరగతి వాళ్లు, సంపన్నవర్గాలు మాత్రమే అడుగుపెట్టగల బడామాల్స్‌ని తెరిపిస్తున్నారు. ఈ తీరులో సామాన్య ప్రజల బతుకుల్ని అనుక్షణ నరకంగా మార్చేస్తూ, ఇక బ్రతుకు వృధా అనే నిరాశా నిస్పృహలతో ఆత్మహత్యలకు పాల్పడేలా వారిని ఒక కొసకి నెట్టేస్తూ పరమ ప్రజాకంటక, అభివృద్ధి నిరోధక, అమానవీయ విధానాల్ని అమలు చేస్తూనే అవన్నీ ప్రజల కోసం, అభివృద్ధి కోసమేనని దబాయిస్తుంటారు. ఈ పార్టీలు-ప్రభుత్వాలు, వాటికి వంత పాడుతూనే ఉంటాయి నేటి ప్రసార ప్రచార మాధ్యమాలు. గతంలో ముఖ్యమంత్రి స్థానంలో ఉన్నప్పుడు చంద్రబాబు 'బిజినెస్ స్కూల్ సైతం పేదలకోసమే' నని ప్రకటించగలిగాడంటే ఈ పార్టీలు ప్రభుత్వాల ఘరానాతనం, బడాయితనం, దబాయింపుధోరణులకి హద్దులుంటాయని భావించలేం.

కనుక ప్రత్యేక తెలంగాణ విషయమై పాలక, ప్రతిపక్ష స్థానాల్లో ఉండే వివిధ పార్టీలు పైకి ఏం చెబుతున్నాయనే దానికి మనం ఏ మాత్రం విలువనియ్యాల్సిన అవసరం లేదు. వాటివాటి సంకుచిత తక్షణ రాజకీయ ప్రయోజనాలు, అస్తిత్వ ప్రయోజనాల కనుగుణంగా ఈ రోజు అవునన్న దానినే రేపటికే కాదంటాయి. అవునన్నంత సులువుగానూ కాదనగలవు, కాదన్నంత సులువుగానూ అవుననగలవు. కనుక ఈ పార్టీలన్నింటినీ పక్కన పెట్టి తెరవెనుకనుంటూ వీటిని తోలుబొమ్మల్లా ఆడించే ఆధిపత్య పాలకవర్గాల రిలేషన్‌లో చూస్తేనే విషయం స్పష్టంగా అర్థమవుతుంది. తెలంగాణలోని బహురకాలైన భూ, జల, ఖనిజ, మానవ వనరులపైన తమ గుత్తాధిపత్యాన్ని నెలకొల్పుతున్న తెలంగాణేతర వలసాధిపత్య వర్గాలు ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణ విడిపోవడాన్ని అంత తేలికగా అనుమతిస్తాయా? అనేది అసలు సమస్య. తాము కబ్జా చేసుకు అనుభవిస్తున్న వనరులు సంపదలపైన తమ అధికారానికి యజమాన్యానికి ధోకా ఉండదనే స్పష్టమైన హామీ లభిస్తే వారు తెలంగాణ విడిపోవడాన్ని అభ్యంతర పెట్టకపోవచ్చు, సరికదా అందుకు సంతోషంగానే అంగీకరించవచ్చు కూడ. ఎందుకంటే తెలంగాణ ప్రజల మనోభీష్టాన్ని గౌరవిస్తూవారిని సంతృప్తిపరచడం ద్వారా వారిపై తమ పట్టు మరింత బిగించుకోగలుగుతాయి. కాని, ఇలాంటి కచ్చితమైన హామీ వారికి కనబడటం లేదనే చెప్పాలి. ఎందుకో ఎలానో పరిశీలిద్దాం.

రేపొకవేళ తెలంగాణ వేరుపడటం అంటూ జరిగితే దాని పాలక, పగ్గాలు చేపట్టేది ఇప్పుడు రాష్ట్రంలో ఉంటున్న వివిధ రాజకీయ పార్టీలు వాటికి తోడు అదనంగా తెరాస, ఇవి కాక తెలంగాణలో రేపు మరొకటి రెండు పార్టీలు పుట్టుకొచ్చినా పుట్టుకు రావొచ్చు. సరే, కొత్తగా పుట్టబోయే పార్టీలు సంగతలా ఉంచి ఇప్పటికిప్పుడున్నవి తెరాసతో కలుపుకొని అన్నీ పాత పార్టీలే కదా, తరతమ స్థాయిల్లో అన్నీ తెలంగాణ ప్రాంతంలో తమతమ ఉనికిని చాటుకుంటున్నవే కదా. మరి ఈ పార్టీలు వీటితో ఏర్పడబోయే ప్రభుత్వాలు తెలంగాణలోని వలసాధిపత్య వర్గాల ప్రయోజనాలకి భంగకరంగా వ్యవహరిస్తాయా? ఈ విషయమై మిగతా పార్టీలు గుర్చి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరం లేదు. కనుక ఇతర పార్టీల సంగతలా ఉంచి 'ప్రత్యేక తెలంగాణ' కోసమే ఏర్పడినట్టు చెప్పుకునే తెరాస మాత్రం ఇతర పార్టీలకి పూర్తి భిన్నం కాకపోయినా ఎంతో కొంత తేడాగా ఉండగలదని భావిస్తామా? తెలంగాణలోని ఆధిపత్య వర్గాల దోపిడీ ప్రయోజనాలని తెరాస ఏదో మేరకైనా నిరోధించగలదిగా ఉంటుందని భావించగలమా? ఆ మేరకు అది తెలంగాణ జనసామాన్యానికి చేరువగాను వారి ప్రయోజనాలను ఏదో మేరకు పరిరక్షించేదిగాను ఉంటుందని ఆశిస్తామా? అంటే ప్రారంభం నుంచి సాగుతూ వస్తున్న ఆ పార్టీనడక, ఆ పార్టీనేతల పోకడ అలాంటి భ్రమలకు అస్కారంలేదని డప్పేసి మరీ చాటుతాయి.

మరి తెలంగాణ వేరుపడే విషయమై అక్కడి ఆధిపత్య వర్గాలని కలవరపెడుతున్న అంశాలేమిటి? కారణాలేమిటి? శక్తులేమిటి? తెలంగాణ వెనకేసుకున్న చరిత్ర. చరిత్రంటే మరీ పాత చరిత్రేమీ కాదు, ఆంధ్రప్రదేశ్‌లో అది అంతర్భాగం అయినప్పటినాటికి ఉండిన చరిత్ర. అలానే తెలంగాణ సంతరించుకున్న సంస్కృతి. ఇవీ అక్కడి ఆధిపత్య వర్గాలని కలవరపెడుతున్న అంశాలు. నైజాం నిరంకుశ పాలనని, రజాకారు ముష్కరమూకల్ని అతిభయంకర, అమానవీయ భూస్వామ్య ఆధిపత్యాన్ని సమరశీలంగా ఎదిరించి వాటి వెన్ను విరిచిన ఘనచరిత్రని తెలంగాణ జనసామాన్యం తమ వెనకేసుకున్నారు. ఆ క్రమంలోనే గొప్ప ప్రజాస్వామ్య పోరాట సంస్కృతి, సాంప్రదాయాల్ని సైతం తెలంగాణ ప్రజలు సముపార్జించుకున్నారు. కనుక, 1956 నాటి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా ఆనాడే ఆంధ్రప్రదేశ్‌లో కలియడానికి బదులు, తెలంగాణ ప్రాంతం వేరు రాష్ట్రంగా ఏర్పడి ఉండినట్లయితే అది ఇతర రాష్ట్రలతో పోలిస్తే ప్రత్యేకించి ఆంధ్రరాష్ట్రంతో పోలిస్తే ప్రజాపయోగకరమైన తీరులో సాపేక్షంగా అభివృద్ధి అయ్యి ఉండేది. 1969 నాటి ఉద్యమ ఫలితంగా తెలంగాణ వేరుపడి ఉండినా నేటి దుస్థితితో పోలిస్తే కొంత మెరుగ్గానే ఉండేది. దీనర్థం వేర్పాటు అనేది సర్వరోగనివారిణి అని చెప్పడం కాదు. తెలంగాణ ప్రజల వేతలన్నింటినీ వేర్పాటు దానికదిగానే పరిష్కారం అయిపోజాలదు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడటమంటే దేశంలో నేడు ఉన్న పెద్దా చిన్నా రాష్ట్రాలకు

తోడు మరొక చిన్న రాష్ట్రం ఏర్పడటమే. వివిధ హిందీ భాషా రాష్ట్రాలున్నట్టుగానే ఒక పెద్ద తెలుగు భాషా రాష్ట్రం ప్రక్కన మరో చిన్న తెలుగు భాషా రాష్ట్రం ఏర్పడటమే. అంతకు మించి తెలంగాణ వేర్పాటుకు విశేష ప్రాధాన్యత ఏమీ ఉండబోదనే చెప్పాలి.

కాని, ముందే చెప్పుకున్నట్టుగా తెలంగాణ ప్రాంతం అక్కడి ప్రజలు వెనకేసుకున్న విశిష్టమైన చారిత్రక సాంస్కృతిక నేపథ్యాల రీత్యా వేరుపడ్డ తెలంగాణ సాపేక్షంగానైనా ప్రజాస్వామ్యయుతంగా, ప్రజోపయోగకరంగా అభివృద్ధి కాగల అవకాశాలుంటాయి. వాటిని అందిపుచ్చుకొని సద్వినియోగ పరచుకోవాల్సి ఉంటుంది. లేనప్పుడు ప్రత్యేక రాష్ట్రంగా విడిపోయినంత మాత్రానే తెలంగాణ ప్రజలకి జరిగిపోగల, ఒరిగిపోగల మేలంటూ ఏమీ ఉండదు. అయితే వేరుపడ్డ తెలంగాణను ప్రజాస్వామ్యీకరించడం అనేది వేరుపడడంతో పాటే జరిగిపోగల అద్భుతం ఏమీ కాదు. అంతేకాదు, అది వేరుపడటమంతటి సులువైనదీ కాదు. అదొక సుదీర్ఘ ప్రక్రియ. అదొక కష్టతరమైన నిర్మాణ క్రమం. అలాంటి ప్రజాస్వామ్య తెలంగాణ నిర్మాణానికి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడటమనేది తొలిమెట్టుగా ఉంటుంది. అంతే కాదు అదొక షరతుగా కూడ ఉంటుంది. ఎందుకంటే తెలంగాణ వేరుపడటం ద్వారానే అది ప్రజాస్వామ్యీకరించబడగల అవకాశాలుండటం అనేది ఎంత నిజమో, వేరుపడకుండానే అది ప్రజాస్వామ్యీకరించబడటం అసాధ్యం అనేది కూడా అంతే నిజం.

ఇకిప్పుడు తెలంగాణ వేర్పాటు గూర్చి చర్చిద్దాం. విచిత్రం, ఆశక్తికరం అయిన విషయం ఏమంటే, రేపు తెలంగాణ వేరు పడటం అంటూ జరిగితే అప్పుడది ప్రజాస్వామ్యీకరించబడగల అవకాశాలు ఉంటుండటమనేదే దాని వేర్పాటుకి పెద్ద ఆటంకంగా ఉంటుంది. 1946-51ల మధ్య సాగిన మహత్తర తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం, ఆ తరువాత 70,80 దశకాలలో ఒకప్పటి పీపుల్స్‌వార్ పార్టీ (నేటి మావోయిస్టు పార్టీ) నాయకత్వంలో పెను ప్రభంజనంలా సాగిన భూస్వామ్య వ్యతిరేక రైతాంగ పోరాటాలు తెలంగాణ జనసామాన్యంపై ప్రత్యేకించి తెలంగాణ గ్రామీణ రైతాంగంపై వేసిన ముద్రలు సామాన్యమైనవి కావు. తొల్లింటి తెలంగాణ సాయుధ పోరాటం నేటికి చరిత్ర కావొచ్చు. అలాగే నిన్నటి పీపుల్స్‌వార్ ఉద్యమం తెలంగాణలో నేడు స్తబ్దంగా ఉండొచ్చు, అయినా అది నడుస్తున్న చరిత్రగానే భావించాలి. అలానే 69ల నాటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమ ముద్ర కూడా తెలంగాణ ప్రజలపై బాగానే ఉంటుంది. వెరసి ఈ ముద్రలన్నింటి కారణంగా వేరుపడ్డ తెలంగాణ ఏదోమేరకైన ప్రజాస్వామ్యీకరించబడిపోయే 'ప్రమాదం'(!?) ఉంటుందనేదే ఆధిపత్యవర్గాల ఆందోళన. 69 నాటి ఉద్యమం చెన్నారెడ్డి విద్రోహంగా ముగిసిపోవడం వెనుక బలియంగా పనిచేసిన కారణం ఇదే! ఈ అంశం, ఈ కారణం ఈ నాటికీ వాస్తవంగానే ఉంటోంది కనుక, ఇదే వేర్పాటుకి ప్రతిబంధకమవుతుందని భావించాల్సి ఉంటుంది. అందుకనే, రాష్ట్రంలో నక్సలైట్ ఉద్యమాన్ని అణచివేయడానికి నిన్నటి చంద్రబాబు టిడిపి ప్రభుత్వం ఎంతటి ప్రాధాన్యతనిచ్చిందో, తెలంగాణ వేరుపడకుండా నిరోధించడానికి సైతం అది అంతటి ప్రాధాన్యతనూ ఇచ్చింది. మరీనాడు వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ ప్రభుత్వం ఈ రెండు విషయాలలోను చంద్రబాబు ప్రభుత్వాన్ని మరిపించే తీరులో అంతకు మించిన పట్టుదలతో క్రూరత్వంతో పని చేస్తోందని చెప్పడానికి అంత వివరణ అవసరం లేదు. ఈ రెండు ప్రభుత్వాలు ఈ రెండు విషయాలలో ఇంత గొప్పగా ఐక్యరాగాలాపన చేయడానికి అనువుగా 'వెనకుండి శృతులు సవరించేది ప్రపంచబ్యాంకేనని చెప్పడానికి సైతం వివరణ అవసరంలేదు.

అయితే మరి ప్రత్యేక తెలంగాణ లక్ష్యానికి స్వస్తి చెప్పి ఊరకుండిపోవడమే మార్గమా? కాదు, ఎంతమాత్రం కాదు. ప్రత్యేక తెలంగాణ సాధన ఎంతటి క్లిష్టతరం, కష్టకరం అయినా కర్తవ్యమో ఎరుక చేయడమే తప్ప లక్ష్యాన్ని విడచిపెట్టాలనేది సందేశం కానేకాదు. అయినా ఈ లక్ష్యసాధనా క్రమాన్ని సౌలభ్యపరచడానికి, సరళీకరించడానికి పాపం తెరాస నాయకత్వం తనది అయిన తీరులో చాలా ప్రయాస పడుతోందనే చెప్పాలి. వేరుపడుతున్న తెలంగాణ ప్రజాస్వామ్యీకరించబడే 'ప్రమాదం' లేదనే స్పష్టమైన సంకేతాల్ని అందించేదిగానే ఉంటోంది తెరాస నాయకత్వ కార్యాచరణ శైలి అంతా. వివిధ తెలంగాణ ప్రజా ఉద్యమ వేదికల నుండి, అలానే వివిధ రాజకీయ పార్టీలనుండి, ఆఖరుకి పాలక కాంగ్రెస్‌కే చెందిన కొందరు తెలంగాణ ప్రాంత ప్రముఖుల నుండి కూడా ఆగ్రహాందోళనలు విమర్శల వెల్లువతో చర్చకు వస్తున్నాయి. తెలంగాణ ప్రాంతాన్ని ప్రజల్ని పట్టి పల్లారుస్తున్న 610 జి.ఓ., పోతిరెడ్డిపాడు ఎత్తిపోతల పథకం, పులిచింతల పోలవరం ప్రాజెక్టులు లాంటి సమస్యలపై తెరాస నాయకత్వం ఉద్యమించడం సంగతలా ఉంచి, కనీస నిరసన ప్రకటనలకి సైతం దూరంగా నిమ్మకినీరెత్తినట్టు ఉండిపోయింది. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధి నోటి నుండి వాగ్దాన వరముత్యం రాల్పించే ఘోర తపస్సులో తనమునకలై తరించిపోయింది. తపోభంగంతో తప్పస్సమాధి నుండి బయటపడిన తరువాతనే తాజాగా అరకొరగానైనా తెలంగాణ సమస్యల గూర్చి మాట్లాడుతోంది తెరాస నాయకత్వం.

తెరాస నాయకత్వపు ఈ తీరుని మనం ఎలా అర్థం చేసువాలి? చాలామంది విమర్శకులు, విశ్లేషకులు దీన్ని కాంగ్రెస్‌పై తెరాస నాయకత్వం పెంచుకున్న భ్రమలుగా వ్యాఖ్యానం చేస్తున్నారు. అవునా? దీన్ని 'భ్రమ' అనే అంటామా? కాదు, దీన్ని భ్రమగా భావించడం, చెప్పడం సరికాదు. అది నష్టదాయకం, ఇలా చెప్పడం అంటే దృష్టిని పక్కతోవ పట్టించడమే. నిజం ఏమిటంటే,ఎలాంటి ప్రజాసమస్యలతోను, ప్రజా సమీకరణలతోను, ఉద్యమాలతోనూ పని లేకుండానే కేవలం తమ స్వయం ప్రతిభతో, తమ టక్కుటమార విద్యలతో సునాయసంగా ప్రత్యేక తెలంగాణను సాధించేయాలనేది తెరాస నాయకత్వపు అంతరంగ లక్ష్యం. తదనుగుణంగానే దాని కార్యాచరణ శైలి ఉంటోంది. తెరాస నాయకత్వం సాలోచనగానే, మెలకువతోనే ఇలాంటి వైఖరిని అవలంభిస్తోంది తప్ప, వట్టి భ్రమతో కాదు. ఎందుకంటే, ఈ తీరులో ప్రత్యేక తెలంగాణను సాధించుకుంటేనే దాన్ని ప్రజాస్వామ్యీకరించాల్సిన అవసరం పూర్తిగా విస్మరించ సాధ్యం కాకపోయినా, అలాంటి అవసరం కచ్చితంగా కొంతైనా తగ్గుతుంది. తెరాస నాయకత్వం సరిగ్గా కోరుకునేది ఇదే.

ఎలాంటి ప్రజా ఉద్యమంతోనూ పని లేకుండానే కేవలం రాజకీయ లాబీయింగులు, పైరవీలతోనే 'ప్రత్యేకరాష్ట్రం' లాంటి లక్ష్యాలు సాధించేయడం సాధ్యం కాదు. నిన్నటి వరకు పెద్ద రాష్ట్రంలలో భాగంగా

ఉంటూ చిన్న రాష్ట్రాలుగా వేరుపడ్డ ఛత్తీస్‌ఘడ్, ఝార్ఖండ్, ఉత్తరాఖండ్‌ల అనుభవాలు మనకీ వాస్తవాన్ని చాటుతాయి. ఆయా రాష్ట్రాల ఏర్పాటనేది కేవలం నిన్నటి ఎన్.డి.ఎ. భాగస్వామ్య పక్షాల మధ్య కుదిరిన రాజకీయ అవగాహనలు, బేరసారాల పర్యవసానంగానే జరిగిపోలేదు. వాటి వెనుక సుదీర్ఘ ప్రజా ఉద్యమాల పాత్ర ఉంది. అయితే ఎంతటి తీవ్ర ప్రజా ఉద్యమ పర్యవసానంగా సాధించబడినప్పటికీ ఇలాంటి లక్ష్యాల అంతిమ ఫలితం అంటే, వాస్తవిక లక్ష్యసాధన అనేది వివిధ రాజకీయ పక్షాలు ప్రభుత్వాల మధ్య కుదిరే అవగాహన ఒడంబడికల పర్యవసానంగా జరిగే చట్టపర రాజ్యాంగపర రాజకీయ ఏర్పాటుగానే ముగుస్తాయి. ప్రత్యేక రాష్ట్రం అనేది ఒక చట్టపరమైన రాజ్యాంగ పరమైన ఏర్పాటే అయినప్పుడు, దానికి ప్రజా ఉద్యమం అనివార్యం ఎందుకు కావాలి? ప్రజా ఉద్యమం అవసరం లేకుండానే అలాంటి ఏర్పాట్లు జరగనే జరగవా? అంటే అలా సైతం కొన్ని సందర్భాలలో జరగనూవచ్చు. అదెలాంటి సందర్భాలు? అలా ఎందుకు జరుగుతుంది? అనే చర్చ ఇప్పుడు అప్రస్తుతం. ప్రస్తుతం మనం చర్చిస్తున్న సమస్యా, సందర్భాలు మాత్రం అలా సాధించబడ సాధ్యంకానివి అని చెప్పుకొడానికే పరిమితమవుదాం.

ఇక తెలంగాణ రాష్ట్ర సాధనకి సంబంధించిన మరో కీలకాంశాన్ని చెప్పుకొని ఈ చర్చ ముగిద్దాం. ప్రత్యేక తెలంగాణ వాదులందరి మధ్య, ప్రత్యేక తెలంగాణ ఉద్యమ శక్తులన్నింటి మధ్య సదవగాహన, సమైక్యత అనేవి అత్యంతకీలకం. ఒక రాజకీయ పార్టీగా ప్రత్యేక తెలంగాణ నినాదాన్ని భుజాన్నెత్తుకున్న తెరాస ఇలాంటి ఐక్యతా సాధన అవసరాన్ని ఘోరంగా విస్మరించుకుపోతోంది. దానికది సహజమే, ఎందుకో ఇంతకు ముందే చెప్పుకున్నాం. ఫలితంగా ప్రత్యేక తెలంగాణ నినాదమే కేంద్రబిందువుగా వివిధ రకాల సంస్థలు/వేదికలు రంగం మీదికొచ్చాయి. తెరాసతో పోలిస్తే తెలంగాణ ప్రజాసమస్యలపై ఏదో మేరకైనా స్పందించగలుగుతున్నది ఈ వేదికలతోనని చెప్పొచ్చు. ఈ సంస్థలు తెరాస పట్ల అసంతృప్తి నిరసనలతో ఉంటుండటం అర్థం చేసుకోదగ్గదే. కాని, ఈ అసంతృప్తి నిరసనలనేవి మూల లక్ష్యాన్ని దెబ్బతీసేవిగా ఉండరాదు. తెరాస లాగానే ఈ సంస్థలు వేదికలు సైతం ఒంటెత్తు పోకడతోను, బాధ్యతారహితంగాను, అవాస్తవిక దృష్టితోనూ ఉండిపోడానికి వీల్లేదు. ఇవి సైతం అలానే ఉంటే, తెలంగాణ ప్రజల ఆకాంక్ష దెబ్బతినిపోతుంది.

తెరాస నాయకత్వ కార్యాచరణ శైలి ఎంత అప్రజాస్వామికంగా, ఇంకెంత అరాచకంగా ఉంటున్నప్పటికీ, ఆ కారణంగా అదెంతగా భ్రష్టుపట్టిపోతున్నప్పటికీ 69 నాటి ఉద్యమం తరువాత తిరిగి ప్రత్యేక తెలంగాణ అంశాన్ని విస్తృతంగా చర్చలోకి తీసుకొచ్చి, దాని చుట్టూతా బలమైన రాజకీయ వాతావరణాన్ని కల్పించగలిగింది తెరాసయేననే వాస్తవాన్ని వివిధ తెలంగాణా ఉద్యమ సంస్థలన్ని గుర్తుంచుకోవాల్సి ఉంటుంది. ఆ వాతావరణమే తాము ఉనికిలోకి రాడానికి నేపథ్యంగా దోహదపడిందనే వాస్తవాన్ని సైతం ఈ వేదికలు విస్మరించరాదు. ఇలాంటి గుర్తింపు ఎందుకవసరం? తెరాసతో చెట్టాపట్టాలేసుకు తిరగడానికా? కానేకాదు. తెరాసతో కలిసి నడవాలా లేక విడిగా ప్రయాణించాలా అనేది కాదిక్కడ సమస్య. తెరాసను కాదనుకున్నా అది దోహదం చేసిన వాతావరణాన్ని కాదనలేం. దాన్ని నిలబెట్టుకోవాలి. లక్ష్యసాధన దిశలో దాన్ని మరింతగా బలోపేతం చేసుకోవాలి. అందుకనుగుణంగా వివిధ తెలంగాణ ఉద్యమ వేదికలు తమ మధ్య సదవగాహనను, సమైక్యతా దృష్టిని పెంపొందించుకోవాలి. అందుకు వీలుగా ఈ వేదికలు వివిధ విషయాల్ని, పరిణామాల్ని, పరిస్థితుల్ని వాస్తవిక దృష్టితో బేరీజు వేసుకోగలుగుతుండాలి. లేనపుడు ఆడిపోసుకోడానికి తానన్నివిధాలా అర్హమై మన ముందు ఉంటున్న తెరాసను ఆడిపోసుకోవడం మినహా లక్ష్యసాధన దిశలో ఈ వేదికలు సైతం చేయగలిగేది శూన్యంగానే ఉంటుంది.

ఇలా ఎందుకు చెప్పాల్సి వస్తోందంటే – ఒకే లక్ష్యంతో ఏకకాలంలోనే వేర్వేరు వేదికలు పుట్టుకు రావడమనేదే ఇందుకు ప్రేరేపిస్తోంది. 'తెలంగాణ ఉద్యోగుల సంఘం' 'తెలంగాణ విద్యార్థి సంఘం' 'తెలంగాణ మాదిగ దండోర' 'తెలంగాణ మాల మహానాడు' 'తెలంగాణ విద్యావంతుల వేదిక' అనేవి వేర్వేరుగా ఏర్పడటాన్ని అర్థం చేసుకోవచ్చు. కాని, 'తెలంగాణ సంఘర్షణ సమితి', 'తెలంగాణ జనపరిషత్', 'తెలంగాణ మహాజన సమితి', 'తెలంగాణ రాష్ట్ర ఉద్యమ సమితి' అనే వేదికలూ ఏర్పడ్డాయి. ఇలా ఉండగా 'తెలంగాణ ఐక్య కార్యాచరణ సమితి' అనేది కూడా రంగం మీదికొచ్చింది. వేర్వేరుగా ఏర్పడి పనిచేస్తున్న పైన చెప్పిన సంస్థలన్నింటినీ ఐక్యపరుస్తూ పని చేయగలదిగా ఈ 'ఐక్య కార్యాచరణ సమితి' అయినా ఉండగలుగుతుందా? లేక అది సైతం మరో వేదిక మాత్రమేనా? తెలంగాణ ప్రజా సమస్యలపై, ప్రత్యేక తెలంగాణా లక్ష్యసాధనకై ఉద్యమించాల్సిన వారు ఇన్ని వేర్వేరు సంస్థలుగా ఏర్పడాల్సిన అవసరం ఏమిటి? అందులోని సహేతుకత ఏమిటి? ఇదంతా వైవిధ్యమని సరిపెట్టుకోవాల్సిందేనా? ఇందులో వైరుధ్య కోణాలంటూ అసలు లేనే లేవా? ఉండే ఉండాలి. వివిధ వేదికల నాయకత్వాల మధ్య ఆధిక్యతా సమస్యలు, గుర్తింపు సమస్యలు, అస్తిత్వ సమస్యలు లాంటి వైరుధ్యాంశాలు పనిచేస్తుండాలి. ఇలాంటివి లేకపోతేనే ఆశ్చర్యపోవాలి తప్ప ఉండటం ఆశ్చర్యకరం కాదు. ఏమంటే ఇలాంటి సమస్యలు సంక్షోభాలకి సమకాలిన ఉద్యమం ఏ ఒక్కటీ అతీతంగాను, మినహాయింపుగానూ ఉండలేక పోతోంది. (దీన్ని వివరించాలంటే చాలానే చెప్పాలి. కానిక్కడిలాంటి అవసరం అంతగా లేదు.) అందుకని ఇలాంటి సమస్యలు వైరుధ్యాలనేవిని సహజమనీ, అనివార్యమనే భావిస్తామా? అలాంటి ఉదాసీన వైఖరి అత్యంత నష్టదాయకం. ఇవి సహజమూ కాదు, అనివార్యం అంతకన్నా కాదు. ఇలాంటివన్ని ఉద్యమ నాయకత్వం నిర్వాహకులు, వైఫల్యాలు, సిద్ధాంత రాజకీయ అశక్తతల వ్యక్తీకరణలు, వాటి దుష్ఫలితాలు. కనుక వివిధ తెలంగాణా ఉద్యమ వేదికల నాయకత్వాలు ఉమ్మడి లక్ష్య సాధన దిశలో తమ మధ్య సదవగాహన సమైక్యతలు పెంపొందించుకోడానికి వీలుగా నిరంతరం ఆత్మపరిశీలనా దృష్టితోనూ, వాస్తవిక దృష్టితోనూ ఉంటుండాలి. తమ మధ్య తలెత్తే భిన్నాభిప్రాయాల్ని సవ్యంగా పరిష్కరించుకోగల శక్తియుక్తుల్ని సంతరించుకోవాలి. అప్పుడు తెరాస గమనం ఎలా ఉన్నప్పటికీ ఉద్యమాన్ని గమ్యం చేర్చగలమనే భరోసా దక్కుతుంది. ◆

# ప్రగతి పథంలో పేదరికం!

– విద్యాభూషణ్

**మా**నవ మనుగడ నాణ్యతకు కొలమానం పేదరికం. అందుకే రాజ్యాంగం నియమిత ప్రమాణాలతో, ఇబ్బందులకు గురికాని జీవనాన్ని పేదలకు అందించడం పాలకుల బాధ్యతగా నిర్దేశించింది. అందుకు ప్రమాణాలుగా ఆరోగ్యవంతమైన జీవితం, ఆకలిని దరిదాపులకు రానివ్వని పౌష్టికాహార వెసులుబాటు, అక్షరాస్యత వంటి విషయాలను క్రోడీకరించారు ఆర్థికవేత్తలు. కానీ మనం నిత్యం చూస్తున్నది ఇందుకు పూర్తిగా భిన్నమైన పేదరిక పరిస్థితుల్నే. సంస్కరణల అమలు రెండోదశకు చేరిన నాటినుంచే మన రాష్ట్రంలో అన్నదాతల ఆత్మహత్యలు ఓ పెద్ద చర్చనీయాంశంగానే పరిణమించాయి. ఈ మధ్యనే పిల్లల పెంపకమే పెనుభారమై, 13 ఏళ్లపాటు పెంచి పెద్ద చేసిన కన్నకుతుర్నే బంధువు ఇంటికని రాజధాని నగరానికి తీసుకువచ్చి, బలవంతంగా వదిలేసిపోయిన ఓ తండ్రి గురించి కథనాన్ని చూశాం. ఈ ఒక్క సంఘటన చాలు మన రాష్ట్రంలో పేదరికం ఎంత విస్తృతంగా విస్తరిస్తుందో అంచనా వేసేందుకు. అయినా సంస్కరణల అమలు రాష్ట్రాన్ని ప్రగతిపథంలో నిలుపుతూ దేశానికే ఓ ప్రతీకగా నిలుపుతుందని పాలకులు వారి భుజాలను వారే చరుచుకుంటున్నారు. కేంద్ర ఆర్థికమంత్రైతే మరో అడుగు ముందుకేసి యావత్ ప్రపంచంలోనే భారతదేశం మూడో అగ్రగామిగా నిలువనుందని కీర్తించారు. ఆ మరుసటి దినమే ఐక్యరాజ్యసమితి 177 దేశాల అభివృద్ధి పథాన్ని గణించేందుకు వేసిన అంచనాల్లో మన దేశం 126వ స్థానంలో ఉందని, ఒక్క మెట్టు ఎదిగిందనే ప్రకటనను పేపర్లలో చూశాం. మరి ఇంతటి వైరుధ్య ప్రగతి అంచనాల్లో మన రాష్ట్రం పేదరికాన్ని అంచనా వేయడమే ఈ వ్యాస లక్ష్యం.

**పేదరికం – భిన్న అంచనాలు**

అసలు పేదరికం ఎంత తీవ్రస్థాయిలో ఉందంటే, పేదల సంఖ్యను చిత్తశుద్ధితో గణించేందుకే పాలకులే భయపడే స్థాయిలో. అందుకే ఈ పేదరిక అంచనాలకు నిర్దిష్ట విధానం అంటూ లేకుండానే భిన్న అంచనాలను వ్యక్తం చేయడం జరుగుతుంది. ప్రభుత్వానికి చెందిన డైరెక్టరేట్ ఆఫ్ ఎకనామిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ వంటి సంస్థలు తమ గణాంక సేకరణలో పేదరిక అంచనాలను పూర్తిగా ఉపేక్షించడం కాకతాళీయం అయితే కాదు.

మొట్టమొదటి సారిగా 1957లో జరిగిన ఇండియన్ లేబర్ ఫోర్సు సదస్సులో పేదరికం పై విశ్లేషణ చోటు చేసుకుంది. 1958లో పేదరికాన్ని అంచనా వేసేందుకై భారతీయ వైద్య పరిశోధనా మండలి (ఇండియన్ కౌన్సిల్ ఫర్ మెడికల్ రీసెర్చ్) నడుం బిగించింది. గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో కేవలం తిండికి అవసరమయ్యే వ్యయాన్నే ప్రమాణంగా తీసుకుని ఈ అంచనా రూపొందింది. గ్రామీణుల తలసరి తిండి వ్యయం నెలకు ఇరవై రుపాయలుగా, పట్టణాల్లో ఈ తలసరి తిండి వ్యయం ఇరవై ఐదు రుపాయలుగా అంచనా వేసింది. ఇందులో ప్రభుత్వం విధిగా బాధ్యత వహించాల్సిన ఆరోగ్యం, విద్య, నివాసం వంటి వాటి ప్రమేయం లేదు. ఇదే సంస్థ 1979 నాటికి గ్రామీణులకు అవసరమయ్యే 2,435 కేలరీల ఆహారలబ్ధికి 1973–74 నాటి ధరవరుల ప్రాతిపదికన నెలకు తలసరి ఆహార వ్యయం రు. 49 లుగా, పట్టణ వాసులకైతే, 2,095 కేలరీల ఆహారలబ్ధికి తలసరి వ్యయాన్ని రు. 56 లుగా నిర్ణయించింది. తదుపరి ఈ పేదరికం, వి.పి. సింగ్ ప్రధానిగా ఉన్న 1989 లో మళ్లీ వేదిక మీదకు వచ్చింది. ఆనాడు కూడా పేదరిక అంచనాల్లో గణాంకవేత్తలు నేషనల్ అకౌంట్స్ స్టాటిస్టిక్స్ (ఎన్ఏఎస్) వారి గణాంకాలను, నేషనల్ సాంపిల్ సర్వే (ఎన్ఎస్ఎస్) వారి గణాంక అంచనాలను కలగలిపి ప్రభుత్వ అనుకూల అంచనాలనే రూపొందించారు. పద్ధతిగా చేపట్టాల్సిన రీతిలో ఈ అంచనాలు రూపొందలేదు. రెండు విధానాల అంచనాలను తారతమ్యాలను గుర్తించి, మదించే ప్రయత్నం చేయలేదు. పైగా రాష్ట్రాల్లో ఉన్న భిన్న ధరల అంచనాలను పరిగణనలోకి తీసుకునే ప్రయత్నం కూడా చేయలేదు. ఈ నాటికి కూడా ఈ పేదరిక అంచనాల్లో నిర్దిష్ట శాస్త్రీయ విధానాలను ప్రభుత్వం చేపట్టడం లేదు. దేశవ్యాప్తంగా సగటు ధరలనే ప్రామాణికంగా తీసుకుని వివిధ రాష్ట్రాల్లో పేదరికాన్ని అంచనా వేస్తుంది. అందుకే ఈ అంచనాలు నికర పేదరిక అంచనాలను వెల్లడించలేవు. జాతీయ సగటు ధరల ప్రాతిపదికన నిర్ణయించిన ఆహార వినియోగ వ్యయం అంచనాలు తలసరి పేదల సంఖ్యకే పరిమితం కాగలవు తప్ప, పేదరిక గాఢతను వ్యక్తం చేయలేవు.

**లక్ష్యదిశ గానే అంచనాలు**

వాస్తవాన్ని మరుగుపర్చే యత్నంగా భిన్న విధానాలను అనుసరించడంలో పొంతన లేని అంచనాలు వెల్లడవుతున్నాయి. 1973–74 నుండి 1999–2000 వరకూ వివిధ సంస్థలు వెల్లడించిన అంచనాలను పరిశీలిస్తే ఈ విషయం అవగతమౌతుంది. ఎక్స్‌పర్ట్ గ్రూప్, ప్లానింగ్ కమిషన్ సంయుక్తంగా 1973–74లో రూపొందించిన అంచనాల్లో గ్రామీణ తలసరి ఆహార వినియోగ వ్యయం రు.48.41 గానూ పట్టణ ప్రాంతాల్లో తలసరి ఆహార వినియోగ వ్యయం రు.52.56 గానూ పేర్కొంది. ఇదే కాలంలో దత్ డీటన్ అండ్ డ్రీజ్ సోదరులు వేసిన అంచనాలు గ్రామీణ ప్రాంతాల్లో తలసరి ఆహార వినియోగ వ్యయం రు.51.02, పట్టణాల్లో తలసరి ఆహార వినియోగ వ్యయం రు.56.84 లు గానూ పేర్కొన్నారు. 1977–78, 1983–84, 1987–88, 1993–94, 1999–2000 లలో చేపట్టిన అంచనాలు, సైతం కనీస సారూప్యత లేకుండానే సాగాయి.

ఎక్స్‌పర్ట్ గ్రూప్ వారి అంచనాలను విశ్లేషిస్తే జాతీయ స్థాయి పేదరికం కంటే మన రాష్ట్రస్థాయి పేదరికం 20 శాతం తక్కువగా చూపబడింది. అంటే జాతీయ స్థాయిలో పేదరికం వంద శాతంగా ఉంటే మన రాష్ట్ర పేదరికం 80 శాతం అన్నమాట. అలా అయితే,

ధరలు జాతీయ స్థాయి కంటే మన రాష్ట్రంలో 20 శాతం తక్కువగా ఉండాలన్నమాట. మరలా ఉన్నాయా? ఈ గ్రూప్ ప్రామాణికంగా తీసుకున్న వ్యవసాయం కార్మికుల ధరల సూచిలో ఆహార పంటల ధరల మినహా ఆహారేతర సరుకుల ధరలు లభ్యంకావు. అలాగే దత్ డీటన్ అండ్ డ్రీజ్ వారి అంచనాల్లో తలసరి నిష్పత్తి పేదరిక అంతర సూచి (పావర్టీ గ్యాప్ ఇండెక్స్) వంటి విధానాలను చేపట్టారు. సారూప్యత లేని విధానాల ప్రాతిపదికన జరిగిన అంచనాలు అయినందువల్లనే పొంతనలేని ఫలితాలు చోటు చేసుకున్నాయి. తమ విధానాల ప్రగతిని ప్రకటించుకునే లక్ష్యంగా ఉన్న ప్రభుత్వాలు అనుకూలతను బట్టి వాటిని ఆమోదించడం పరిపాటయింది.

**శాస్త్రీయ అంచనాల ప్రాతిపదికలు ఎలా ఉండాలి?**

పేదరిక అంచనాల్లో మనిషికి అవసరమేయ్యు ఆహార వ్యయమే కాకుండా ఉనికికి అనివార్యమయ్యే విషయాలన్నింటినీ పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది.

1996-97 నాటి ధరల సూచీ మేరకు గ్రామీణ ప్రాంతంలో కనీస నెలసరి ఆదాయం రు.266.20 లుగా, పట్టణ ప్రాంతాల్లో ఈ కనీస ఆదాయం రు.353.44 లుగా పేర్కొన్నారు. ఇదే విషయాన్ని మనిషి మనుగడకు అవసరమయ్యే నివాసం, రక్షిత మంచినీరు, మరుగుదొడ్లు వంటి సౌకర్యాలను పరిగణలోకి తీసుకుని అంచనా వేస్తే, గ్రామీణ ప్రాంతాల్లో కనీస పరంగా రు.2,205 లు, పట్టణ ప్రాంతాల్లో రు.2,540 లుగా ఉండాలి.

కనీస నివాసయోగ్య స్థలం 60 చదరపు గజాల ఖరీదు గ్రామాల్లో రు.5,000 లుగా, పట్టణాల్లో అయితే రు.10,000 లుగా ఉంటుంది. ఈ కొనుగోలు వ్యయాన్ని పదేళ్ల దీర్ఘకాలంలో చెల్లింపు చేస్తే గ్రామాల్లో నెలకు రు.60 లు, పట్టణవాసులు నెలకు రు.120 లు చెల్లించాల్సి ఉంటుంది. ఈ స్థలంలో కనీస పరంగా 215 చదరపు అడుగుల విస్తీర్ణంలో నివాస నిర్మాణానికి గ్రామాల్లో రు.20,000, పట్టణాల్లో రు.22,000 అవసరం అవుతాయి. ఈ గృహ నిర్మాణ వ్యయాన్ని 15 ఏళ్ల దీర్ఘకాలంలో చెల్లింపులను అంచనా వేస్తే గ్రామీణులు, నెలకు రు.200, పట్టణవాసులు నెలకు రు.220 చెల్లించాల్సి ఉంటుంది. మరుగుదొడ్లు నిర్మాణానికి అవసరమయ్యే రెండు వేల రూపాయల మొత్తాన్ని ఐదేళ్ల కాల చెల్లింపుల్లో అంచనా వేస్తే గ్రామీణులు పట్టణవాసులు నెలకు రు.40 లు చెల్లించాలి. మంచినీటి వసతికి వ్యయం రు.1000 అనుకుంటే ఐదేళ్ల కాలంలో నెలసరి చెల్లిపు రు.20 లు అవుతుంది. ఇలాగే విద్యుత్తును పొందేందుకు వెయ్యి రూపాయలు అవసరమైతే చెల్లింపులు ఐదేళ్లలో నెలకు రు.20, పిల్లల చదువుకు గ్రామీణులకు సంవత్సరానికి రు.1000, పట్టణ వాసులకు సంవత్సరానికి రు.1200 అవసరమని ఓ అంచనా.

ఇక బట్టలకు గ్రామీణ కుటుంబాలకు సంవత్సరానికి రు.500లు అయితే, పట్టణవాసులకు సంవత్సరానికి రు.1200లు, వైద్యావసరాలకు సంవత్సరానికి ఒక్కో కుటుంబానికి కనీసం రు.600లు అవసరం అవుతాయి. వీటన్నింటినీ పరిగణలోకి తీసుకుని ఆహార వ్యయానికి జోడించి, కనీస ఆదాయ పరిధిని అంచనా వేయాల్సి ఉంటుంది. మరలా జరగని కారణంగానే కనీస ఆదాయ పరిధి నిర్ణయంలో ప్రభుత్వాలు శతభిషాలు లెక్కించాల్సి వస్తుంది. ప్రభుత్వమే కనీస వార్షికాదాయాన్ని గ్రామీణులకు నలభై వేలు, పట్టణవాసులకు యాభై ఐదు వేలుగా పరిగణిస్తుంది. అంటే, ఈ పరిధికి లోబడి ఉన్న ఆదాయ వర్గాలను పేదలు గానే గుర్తించాల్సి ఉంటుంది. ఇదే గీటురాయి అయితే పేదల శాతం అనూహ్యం.

**పేదరిక నిర్మూలన - లక్ష్యా లక్ష్యాలు**

స్వభావరీత్యా మనది వ్యవసాయ దేశం. ఇందులో మన రాష్ట్రం 'అన్నపూర్ణ' గా పేరొందింది. దేశంలో 70 శాతం ప్రజలు వ్యవసాయంపై ఆధార పడ్డవారే. పేదరిక నిర్మూలన పట్ల ప్రభుత్వాలకు ఏ మాత్రం చిత్తశుద్ధి ఉన్నా ఈ వ్యవసాయరంగాన్నే పటిష్ట పరచాల్సి ఉంటుంది. ఏటా మన రాష్ట్రంలో వరదల కారణంగా 11.2 శాతం సారవంతమైన భూమి నీట మునిగి పంటను నష్టపోతున్నాం. ఫలితంగా 28 శాతం ప్రజలు కరువు బారిన పడుతున్నారు. క్రమం తప్పని ఈ వరదల నివారణకు శాశ్వత పరిష్కారాన్ని తక్షణం శోధించాలి.

ప్రగతి పథకాలు రాజకీయ లబ్ధికై ప్రకటించడం జరుగుతుంది. కానీ ఆచరణలో ప్రజలకు చేరని పరిస్థితి ఓ అక్షర సత్యం. ప్రగతి పథకాల ఆర్భాట ప్రకటనల వ్యయాన్నే సక్రమంగా వెచ్చిస్తే సమస్య పరిష్కారం కొంత మేరకైనా సాధ్యమయ్యేది. గ్రామీణ ఉపాధి కల్పనా పథకాలనైనా కనీసపరంగా అమలు పర్చగలిగితే, కనీస వేతనాలైనా పెరిగే వీలుండేది. ఆచరణలో లేని పథకాలు ఎన్నో ఎన్నెన్నో? ఒక్కోసారి ఈ పథకాల అమలుకై కేటాయించిన కేటాయింపుల్నే సరిగ్గా వినియోగించుకోలేని పరిస్థితి ఉంది. డిపెప్ పథకానికై 1994-2000 మధ్య రు.3951 కోట్లు కేటాయించి, రు.2272 కోట్లు విడుదలైనా వినియోగించలేదు. అలాగే జవహర్ గ్రామ సమృద్ధి యోజన పథకానికి రు.2796 కోట్లు విడుదలైతే 73 శాతం మాత్రమే ఖర్చయ్యాయి.

మనకు అందుబాటులో ఉన్న సేద్యపు అనుకూల భూముల్ని సైతం పూర్తిగా వినియోగించుకోవడం లేదు. వాతావరణ సమతుల్యతా లోపం అకాల వర్షాలకు కారణమౌతుంది. రిజర్వాయర్లు, చెరువుల్లో పూడికతీతను క్రమబద్ధం చేయాల్సి ఉంది. దీంతో వరదలను కొంత మేరకు నివారించే వీలుంది. ఈ సమస్యలు ఏనాటి నుంచో చర్విత చరణంగా వల్లె వేస్తున్నవే. అయినా ఆచరణకు నోచుకోలే.

**రాష్ట్రంలో అభివృద్ధి ఏమేరకు?**

రాష్ట్రాభివృద్ధి ని ఒక్కసారి పునరావలోకనం చేస్తే, డెబ్భైవ దశకంలో భూ సంస్కరణలు వేదిక మీదకు రావడం, పంచవర్ష ప్రణాళికల అమలు ఓ గాడిన పడటంతో అటు పారిశ్రామికంగా, ఇటు వ్యవసాయపరంగా కాస్తా అభివృద్ధి కన్పించింది. 80వ దశకంలో ఎన్టిఆర్ అధికారంలోకి వచ్చి సాంఘిక సంక్షేమానికి కాస్త ప్రాధాన్యతనీయడంతో పేదరికం తగు మాత్రంగానైనా తగ్గు ముఖం పట్టింది. రెండు రుపాయల బియ్యం పథకం కడుపు నింపితే జనతా వస్త్రాలు వంటిని కప్పాయి. ప్రజా పంపిణీ వ్యవస్థ కాస్త మెరుగైంది. అంటే భూ సంస్కరణల అమలుతో పాటు సాంఘిక సంక్షేమ ప్రాధాన్యత కొంత మేరకు పేదరిక నిర్మూలనకు దోహదపడ్డాయని చెప్పుకోవచ్చు. జరిగిన పారిశ్రామికాభివృద్ధి, చదువుకున్న యువతకు కాస్త ఉపాధి చూపగలిగింది.

### సంస్కరణల ప్రమేయంతో పెరుగుతున్న పేదరికం

90వ దశకంలో సంస్కరణలు దేశంలో రంగప్రవేశం చేసినా, 1994-95 నాటికి మన రాష్ట్రానికి దాపురించాయి. దీంతో ముందుగా వ్యవసాయరంగ ప్రాధాన్యత తగ్గుముఖం పట్టి, సంక్షోభానికి నాంది పలికాయి. నిధుల కేటాయింపులు తగ్గడమే కాకుండా, కేటాయించిన మొత్తాలు సైతం పక్కదారి పట్టనారంభించాయి. సంక్షేమం ఉపేక్షింపబడింది. వ్యవసాయరంగంలో కార్పొరేట్ వ్యవస్థ వేళ్లూనుకో నారంభించింది. సేద్యపు ప్రాధాన్యతలు పండ్లు పూలతోటల పెంపకం దిశగా మళ్లడం మొదలైంది. ప్రపంచ బ్యాంకు రాష్ట్ర ప్రాధాన్యతలను నిర్ణయింపనారంభించింది. గ్రామీణాభివృద్ధి, సాగునీటి పథకాలు, వరద నీటి నిరోధక పథకాలు కుచించుకుపోయాయి. వ్యవసాయరంగ పరిశోధనలకు కేటాయింపులు సన్నగిల్లి, చివరకు వ్యవసాయ విశ్వవిద్యాలయాలకు చెందిన భూముల్నే అమ్మజూపే ప్రయత్నాలకు తెరలేచింది. విత్తన ఉత్పత్తి, ఎరువుల ఉత్పత్తి అంతా ప్రైవేట్ పరం. దీంతో సేద్యం బహు ఖరీదై, సన్నకారు రైతుకు దూరమయింది. విచ్చలవిడి రసాయన ఎరువుల వాడకంతో భూసారం క్రమానుగతంగా తగ్గిపోనారంభించింది. రైతుల పరపతి సౌకర్యం కుదించుకుపోయి, ప్రైవేట్ వడ్డీ వ్యాపారులను ఆశ్రయించే పరిస్థితికి రైతు నెట్టివేయబడ్డాడు. శక్తికి మించిన రుణభారం రైతుని ఆత్మహత్యకు ప్రకోపింపజేయడం మొదలై, నేడు సర్వ సాధారణమైపోయింది. నెలకొన్న ప్రాంతీయ అసమానతలు విజృంభించసాగాయి. ఆర్థిక వెసులుబాటు లేక పేద ప్రజానీకపు కొనుగోలు శక్తి సన్నగిల్లడంతో మిగిలిన ఆహారధాన్యాలను 'మిగులు'గా ప్రకటించి, పాలకులు ఎగుమతులకు ఎగబడుతున్నారు. దీన్నే అభివృద్ధిగా చూపిస్తున్నారు. మొత్తంగా వ్యవసాయరంగ భవిష్యత్‌ను మార్కెట్ శక్తులకు ధారదత్తం చేయడంతో సేద్యపు ప్రాధాన్యత వాణిజ్య పంటల దిశగా మళ్లుతోంది. అయితే ఇది పాలకుల పథకంలో భాగంగానే. ఫలితంగా ఆర్.ఎస్ రావు గారు పేర్కొన్నట్టు, మార్కెట్ ఎకానమీలో మనిషి, మనిషిగా తన ఉనికిని కోల్పోయి, తానే ఓ వినియోగ వస్తువైపోతాడు. అమర్త్యసేన్ మాటల్లో – 'వ్యవసాయరంగంలో టెక్నాలజీ, పెట్టుబడిదారి విధానం ప్రవేశం పేదరికాన్నే పెంచుతుంది.' అయినా దానిని తనేమాత్రం పట్టించుకోడని విశ్లేషించారు.

ప్రభుత్వ గణాంకాల్లో పేదరికం 54 శాతం నుంచి 29 శాతం వరకూ తగ్గిందంటున్నా, నిపుణుల కమిటీ నివేదిక పేదరికం దేశవ్యాప్తంగా 38 శాతమని ఓ అంచనా వేసింది. 1970వ దశకంలోనే 308 మిలియన్లుగా ఉన్న పేదలు 1988 నాటికి 361 మిలియన్ల స్థాయికి చేరుకున్నారు. మరీరోజు ఈ పేదరికపు అంచనా అందుబాటులో లేని అంశం.

మన రాష్ట్ర విషయానికొస్తే, గ్రామీణ ప్రాంతంలో 1957-58లోనే 151 లక్షల మంది పేదలని వ్యక్తమైంది. అంటే రాష్ట్ర జనాభాలో 53.5 శాతం. అదే 1964-65 నాటికి 159 లక్షలుగా నమోదయింది. 1973-74లో సుమారు 145 లక్షల మేరకు తగ్గి 39.8 శాతంగా నమోదయింది. (భూ సంస్కరణల అమలు ఈ దశకంలోనే) పట్టణ ప్రాంతాలని పరిశీలిస్తే, 1957-58 నుంచి 1973-74 వరకూ 50 శాతంగా పేదరికం రాజ్యమేలింది. 1973-74లో 55.66 శాతంగా నమోదయింది. తరువాత క్రమంలో పేదరికం తగ్గుదల నమోదవుతూ వచ్చింది. అయితే 2004 సంవత్సరంలో వెలుగు సంస్థ నిర్వహించిన సర్వే ప్రకారం నాటికి రాష్ట్రంలో ఒక కోటి 39 లక్షల 46 వేల 531 కుటుంబాలు ఉండగా, 76 లక్షల 58 వేల 60 కుటుంబాలు పేదరికంలో ఉన్నట్లు తేలింది. అంటే 54.9 శాతం పేదలు. ఈ అంచనాలు ప్రభుత్వ ప్రమాణాల మేరకు, ప్రభుత్వ అనుబంధ సంస్థ నిర్వహించిన సర్వే ఫలితమేనన్నది గమనార్హం. రాష్ట్రంలో ఆదిలాబాద్ జిల్లాలో అత్యధికంగా 77 శాతం మంది పేదరికంలో ఉండగా, 42 శాతం పేదరికంతో నిజామాబాద్ అత్యల్ప పేదరికం ఉన్న జిల్లాగా నమోదయింది. వాస్తవ పరిస్థితులకు ఈ అంచనాలు అద్దం పడుతున్నట్టనిపించినా, పేదరిక ప్రమాణాలకు ఆహార వ్యయంతో పాటు సామాజిక భద్రతాంశాలు (విద్య, వైద్య, ఆవాసం) వంటివి జోడిస్తే పేదరికం ఇంకా తన విశ్వరూపాన్ని మరింతగా చూపగలుగుతుంది.

రాజధాని పరిస్థితుల్నే ప్రమాణికంగా తీసుకుంటే రోజు రోజుకు పెరుగుతున్న వలసల ఉధృతి, అడ్డాలపై దినసరి కూలిల ఎదురుచూపులు, మరోవైపు రైతాంగం నుండి చిన్నా చితక బడుగువర్గాల ప్రజల ఆత్మహత్యలు సర్వ సాధారణమై పోతున్నాయి. మూడో దశ సంస్కరణల ప్రమేయానికే ఒకనాటి 'అన్నపూర్ణ' ఓ 'అప్పులకుప్ప' గా పరిణితి చెందితే, భవిష్యత్తులో ఆంధ్రప్రదేశ్ మరో ఆర్జెంటినా కాకుండా ఉంటుందా? అన్నది శేషప్రశ్నే. ◆

# అంబేద్కర్ సామాజిక ఉద్యమాన్ని ప్రభావితం చేసిన అంశాలు

- నాగరాజు వాడపల్లి, డా. జి.వీరన్న

**భా**రతదేశంలో జన్మించిన గొప్ప సామాజిక, రాజకీయ, ఆర్థికతత్వవేత్తలలో డా. భీమ్‌రావ్ రామ్‌జీ అంబేద్కర్ ఒకరు. అతడు అంటరాని కులంలో జన్మించి, అనేక అవమానాలను భరించి, ఎంతో కష్టపడి చదివి గొప్ప విద్యావేత్తగా పేరు పొందారు. నెహ్రూ నాయకత్వంలో ఏర్పడిన మొదటి జాతీయ ప్రభుత్వంలో న్యాయశాఖ మంత్రిగా పనిచేశాడు. అలాగే ప్రపంచంలోనే గొప్ప రాజ్యాంగాల్లో ఒకటైన భారతరాజ్యాంగ రూపశిల్పిగా ఖ్యాతిగడించాడు. అతడు శాసన సభ్యుడుగానే గాకుండా పాలనావేత్తగా, రాజ్యాంగవేత్తగాను, జాతి నిర్మాతగాను, నిమ్నజాతి ఉద్ధారకుడుగాను, అన్నింటికంటే గొప్ప సామాజిక విప్లవకారుడుగాను కొనియాడబడుతున్నాడు.

బెంగాల్ మాజి గవర్నర్ లార్డ్ కైసీ ఒక సందర్భంలో అంబేద్కర్‌ను 'విజ్ఞానానికి తలమానికం' వంటివాడుగా కొనియాడాడు. అలాగే అంబేద్కర్ ప్రపంచంలోని ఆరుగురు మేధావుల్లో ఒకరిగా గుర్తించబడ్డాడు. ఒకానొక సందర్భంలో జవహర్‌లాల్ నెహ్రూ అంబేద్కర్ గురించి ఈ విధంగా వ్యాఖ్యానించాడు. 'భారతదేశ హిందూ సమాజంలోని అణచివేత లక్షణాలకు వ్యతిరేకంగా విప్లవించినవాడిగా దేశప్రజల్లో గుర్తుండి పోతాడు'. భారతీయ హిందూసమాజంలోని చాతుర్వర్ణ వ్యవస్థ ఆధారంగా ఏర్పడిన అంటరాని కులంలో జన్మించి అంతటి మహోన్నత శిఖరాలను అధిరోహించిన డా. బాబా సాహెబ్ అంబేద్కర్ జీవితం పై అతని సామాజిక ఉద్యమం పై అనేక అంశాలు ప్రభావాన్ని చూపాయి. వాటిలో ముఖ్యమైన వాటిని వివరించటం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశ్యం.

**సామాజికాంశాలు :** భారతీయ హిందూ సమాజం మొత్తం కులవ్యవస్థపై ఆధారపడి ఉంది. హిందూ సమాజం ప్రారంభంలో చాతుర్వర్ణ వ్యవస్థగాను, కాలక్రమంలో పంచమవర్ణముల గల వ్యవస్థగాను, ఈ పంచమ వర్ణములు తిరిగి కులాలుగాను, ఉపకులాలుగాను, తెగలుగాను చీలిపోయింది. ఈ పంచమ వర్ణాల్లో ఆఖరిదాన్ని అంటరాని వర్గములుగా పరిగణించేవారు. హిందూ సమాజంలో ఈ వర్గంవారు చూడరానివారుగాను, మాట్లాడరానివారుగాను, అంటరానివారుగాను జీవించేవారు. వీరు ప్రభుత్వ బావుల నుండి నీటిని తోడుకునేందుకు అనర్హులు. అలాగే వీరి పిల్లలకు పాఠశాలల్లో ప్రవేశం లేదు. వారిని దేవాలయంలోకి అనుమతించేవారు కాదు. వీరి యెడల హిందువులు కనీసం దయకూడా చూపేవారు కాదు, చివరికి చాకలి, మంగలివారు కూడా వీరికి సేవలందించడానికి, ముట్టుకోవడానికి ఇష్టపడేవారు కాదు. మొత్తంగా చూసినట్లయితే ఈ వర్గంవారు హిందూసమాజంలో కనీసం మనుష్యులుగా గుర్తింపు పొందలేని స్థితిలో జీవించేవారు. మనిషిగా గుర్తింపు పొందలేని సమాజంలో మానవీయ హక్కులు పూర్తిగా మృగ్యమైన పరిస్థితులలో అంటరానివాడిగా జన్మించినవాడు, అంటరానివాడిగా జీవించి అంటరానివాడిగానే మరణించేవాడు.

బానినత్వంను ఆచరించినవారు కొందరు దానిని సమర్థించినవారు కొందరు, సహించిన వారు కొందరు, దాని ఫలాలను అనుభవించినవారు కొందరు. ప్రాచీన ప్రాశ్చాత్యంలో బానిసత్వం అమల్లో ఉన్న కాలంలో బానిసలను సాటి మనుష్యులుగా పరిగణించేవారు. కాని భారతీయ సమాజంలో అస్పృశ్యత బానిసత్వం కంటే అతి నీచమైనది, అమానుషమైనది, అత్యంత క్రూరమైనది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆద్యాంతం అధమాధమైనది ఈ అస్పృశ్యత. తోటి మనిషిని మనిషిగా చూడలేని ఇంతటి క్రూరమైన వివక్ష ప్రపంచం మొత్తం మీద మరే దేశంలోను కన్పించదు. ఈ కులరాక్షసి అందించిన చేదు ఫలాలను అనుభవించిన అంబేద్కర్ తనవలె తనవారెవరు కూడా ఆ అవమానాలను అనుభవించకూడదని నిర్ణయించుకొని అస్పృశ్యత నిర్మూలనకు, కుల నిర్మూలనకు తన జీవితాంతం కృషి చేశాడు. అందుకు తన సామాజిక ఉద్యమంను ఈ అస్పృశ్యతపైనే మొదటిగా ప్రారంభించాడు.

**తల్లిదండ్రులు :** అంబేద్కర్ తాత మాలోజీ సక్పాల్ సంప్రదాయ బద్ధమైన మహర్ కులానికి చెందినవాడు. హిందూ సమాజంలోని మహర్ కులంవారు సహనానికి, సాహసానికి, ధైర్యానికి, దృఢత్వానికి, మేధోపరత్వానికి, నాయకత్వ లక్షణాలకు ప్రతీకగా ఉండేవారు. అంబేద్కర్ తండ్రి రామ్‌జీ సక్పాల్, విద్యావంతుడు, మిలటరీ సుబేదారుగా పనిచేసేవాడు. తల్లి భీమాబాయి వివేచన, ఆత్మాభిమానం గల మహర్ స్త్రీ, అంబేద్కర్ తల్లిదండ్రులిద్దరూ సామాజిక స్పృహ కల్గినవారు. వారికి అంబేద్కర్ 14వ సంతానంగా జన్మించాడు. అంబేద్కర్ బాల్యంలో జగడగొండిగాను, సమోచిత బుద్ధిగలవాడుగాను, ధైర్యవంతునిగాను ఉండేవాడు. తన తల్లిదండ్రుల వలన అంబేద్కర్ బుద్ధిమంతుడుగాను, కష్టపడేతత్వంను, ఓర్పును నేర్చుకున్నాడు. ఈ సహనం, ధైర్యం తన సామాజిక ఉద్యమం నడుపుతున్నప్పుడు అంబేద్కర్‌కు ఎంతగానో ఉపయోగపడినవి. ఉద్యమకాలంలో హిందూ సమాజం నుండి అవమానాలను ఎదుర్కొనడంలోను, సమస్యలను సహనంతో భరించడంలోను వాటికై ధైర్యంగా పోరాడటంలోను తల్లిదండ్రుల భావాలు ఎంతగానో ఉపయోగపడినవి.

**బుద్ధుడు :** బుద్ధుని తత్వంతో ప్రభావితుడైన అంబేద్కర్ ఆత్మ మోక్షం, శ్లోకముల విలువ, యజ్ఞములు, బలులు అనేవి మోక్షంనకు మార్గములు అనే అంశాలపై వేదాలను ప్రశ్నించగల్గాడు. బుద్ధుడు చెప్పిన ప్రకారం మనిషి తన కష్టసుఖాలకు తనే బాధ్యుడనే విషయాన్ని విశ్వసించాడు. బుద్ధుని ప్రకారం మానవుడు తన జీవనవిధానాన్ని అనగా కష్టసుఖాలను, మంచి చెడులను తన చర్యల ద్వారానే రూపొందించుకుంటాడు. అంతేగానీ, అతని జీవనలక్ష్యాన్ని నిర్ణయించడంలో బాహ్యశక్తుల చేతిలో కీలుబొమ్మకాదు. ఒక మనిషి తాను చేసే మంచి పనుల ద్వారా దు:ఖాన్ని జయించి సంతోషాన్ని పొందవచ్చు. అంటే మొత్తంగా కోరికలే దు:ఖానికి కారణం అనే

నగ్నసత్యాన్ని తన ఆర్యసత్యాల ద్వారా లోకానికి చాటిచెప్పాడు. అదే విధంగా కర్మ, అదృష్టం అనే మాటలను పక్కనపెట్టి వ్యక్తి స్వశక్తి మీద పైకి రావాలని, చరిత్ర నిర్మాణంలోను, పరిసరాల నిర్మాణంలోను, వ్యక్తి ప్రధాన కారకమని, మనిషి ప్రథముడే కాని, ఆఖరివాడు కాదనే భావనను బుద్ధునిచే ప్రభావితుడైన అంబేద్కర్ భావించాడు. ఏ మనిషి పుట్టుక ద్వారా గొప్పవాడు కానేరడని, అతని చర్యల ద్వారా మాత్రమే గొప్పవాడుగా పరిగణితి చెందుతాడని గౌతముడు వేదాలను, బ్రాహ్మణాలను, ఉపనిషత్తులను వ్యతిరేకించాడు. అందుకు కారణం వాటిల్లో నైతిక విలువల్లో ఏకత్వం లేదు. బుద్ధుని స్వతంత్రభావాలు, బౌద్ధ సంఘాల నిర్మాణ మొదలగు అనేక విషయాలు అంబేద్కర్‌కు తన సామాజిక ఉద్యమ నిర్మాణం దాని విలువలపై ప్రభావాన్ని చూపాయి. తదనుగుణంగానే సామాజిక విలువల్లో ఏకత్వం అనేది తను ప్రతిపాదించిన 'ఒక ఓటు ఒక విలువ, ఒక మనిషి ఒక విలువ' అనే సూత్రం ద్వారా తెలుస్తుంది. 'బుద్ధుడు, అతని ధర్మం' అనే గ్రంథం ద్వారా అంబేద్కర్ తనపై బుద్ధుని ప్రభావం ఎంతో ఉందని వివరించాడు.

**కబీర్‌దాసు :** అంబేద్కర్ కుటుంబం కబీర్‌దాస్ భక్తి భావనకు అంకితమైన కుటుంబం. అతని భక్తి ఉద్యమం ద్వారా అంబేద్కర్ కుటుంబం మానవత్వంను గురించి తెలుసుకొని దైవత్వ భావనకు దూరమైనది. అంబేద్కర్ తన తండ్రి ప్రోత్సాహంతో చిన్నతనం నుండే కబీర్ పద్యాలను చదివేవాడు. అంబేద్కర్ తన గ్రంథమైన 'బుద్ధుడు, అతని ధర్మం'లో కబీర్‌ను తన రెండవ గురువుగా చెప్పుకున్నాడు. అంబేద్కర్ ప్రకారం కబీర్ పద్యాల్లో బుద్ధుని భావాలైన హేతుబద్ధత, లౌకికవాదం కనిపిస్తాయి. కబీర్ పద్యాల్లోని హేతుబద్ధత అంబేద్కర్‌ను మరింత ఆలోచింపజేసింది. హిందూ సమాజం నిర్మాణంను, దాని మూలాలను ప్రశ్నించడానికి అది ఉపయోగపడింది. భారతదేశంలో ఉన్న చాతుర్వర్ణ వ్యవస్థను తన రచనల ద్వారా ఖండించినాడు. సామాజిక సమానత్వంను ప్రబోధించినాడు. అలాగే హిందూ-ముస్లిం ఐక్యతకు కృషి చేసినాడు. భారతదేశంలో మతసామరస్యాన్ని ప్రబోధించినాడు. హిందువులు, మహ్మదీయులు ఒకే మట్టితో చేసిన వేర్వేరు కుండల్లాంటి వారని, పవిత్ర హృదయం ఉండాలి కాని, అపవిత్రమైన మనస్సుతో గంగలో మునిగినా, కాశీకి వెళ్లినా ప్రయోజనం శూన్యమని కబీర్ తన పద్యాల్లో వివరించాడు. అలాగే 'జాతి నా పూఛో సాధుకీ పూఛో లీజియో జ్ఞాన్ మోల్‌కరో తల్వార్‌కి పడారహందో మ్యాన్'. కబీర్ పద్యాల్లోని అనగా, గురువు జ్ఞానాన్ని తెలుసుకోవాలి, కాని గురువు కులాన్ని కాదు, ఎందుకంటే కత్తి పనితనాన్ని చూసుకోవాలి కాని కత్తికి ధరించిన ఒరని చూసి కాదు అని వివరించాడు. ఇలాంటి సామాజిక సమానత్వ భావన, లౌకిక భావనలు అంబేద్కర్‌ను ఎంతగానో ఆలోచింపజేసినవి. తద్వారా అంబేద్కర్ తన సామాజిక ఉద్యమానికి కబీర్ భావాలను ఉపయోగించుకున్నాడు.

**పూలే :** 19వ శతాబ్దం భారతదేశానికి అందించిన జాతి రత్నంల్లో జ్యోతిరావ్‌పూలే ఒకరు. ఇతడు సామాజికంగా వెనుకబడిన కులంలో జన్మించి హిందూ సమాజంలో ఉన్న నిచ్చెన మెట్ల కులవ్యవస్థ చేదు ఫలాలను చవిచూసినాడు. అయినప్పటికీ అతడు ఎప్పుడు దానికి భయపడలేదు. మనష్యులందరు పుట్టుకతో సమానమని, సామాజిక వ్యవస్థలోని వర్ణవ్యవస్థ అనే భూతం ప్రజలను వేరుచేసి కొందరిని ఉన్నత వర్గంగాను, మరి కొందరిని నీచపు జనులుగాను చిత్రీకరించింది. ఈ సామాజిక రుగ్మతలను రూపుమాపి, మానవులందరు సమానమని, పురుషులతో పాటు స్త్రీలకు కూడా హక్కులుండాలని, వారికి కూడా జ్ఞానం కావాలని, దళిత, స్త్రీ జనోద్ధరణకు జీవితాంతం కృషి చేశాడు. స్త్రీలు, దళితుల కోసం ప్రత్యేక పాఠశాలలను ఏర్పాటుచేసి తన భార్య సావిత్రిబాయిని ఉపాధ్యాయురాలుగా నియమించాడు. పూలే తన సామాజిక ఉద్యమంను నిర్వహించుటకు 'సత్యశోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించాడు. ఆధునిక భారతీయ సమాజంలోని అణగారిన వర్గాలను చైతన్యవంతులను చేయడం కోసం జీవితాంతం కృషి చేసిన పూలేను అంబేద్కర్ తన మొదటి గురువుగా చెప్పుకున్నాడు. అలాగే దానికి గుర్తుగా తన రచనా గ్రంథమైన 'శూద్రులు ఎవరు?' ను పూలేకు అంకితమిచ్చాడు. దళితులకు, స్త్రీలకు పూలే చేసిన సేవలతో ప్రేరణ పొందిన అంబేద్కర్ తన జీవితాంతం దళితుల అభ్యున్నతికి, స్త్రీ జాతి ఉద్ధరణకు కృషి చేశాడు. దళితుల కొరకు విద్యాలయాలను స్థాపించాడు. అలాగే రాజ్యాంగపరంగా ప్రత్యేక సౌకర్యాలను కల్పించాడు. స్త్రీలకు పురుషులతో సమానంగా హక్కులను ప్రతిపాదిస్తూ 'హిందూ కోడ్ బిల్లు' ను కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టాడు.

**జాన్‌డివే :** ఇతడు కొలంబియా యూనివర్సిటీలో అంబేద్కర్‌కు గురువు. సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను తనదైన శైలిలో విశ్లేషించేవాడు. ప్రాచీన సిద్ధాంతాలను విమర్శిస్తూ వాస్తవాదంను, సమకాలీన సమస్యలను గొప్పగా విశ్లేషించేవాడు. అతని విశ్లేషణకు ప్రభావితుడైన అంబేద్కర్ భారతదేశంలో ప్రాచీనకాలంలో రూపొందించబడిన సిద్ధాంతాలను, అవి భారతీయులకు ఏ విధంగా విభజించినది విమర్శిస్తూ తన జాతి ప్రజలు అంటరానివారిగా ఉండటానికి కారణమైన ప్రాచీన సిద్ధాంతాలను తొలగించి దళిత జాతి అభ్యున్నతికి సామాజిక ఉద్యమాన్ని నిర్మించడానికి అనుగుణంగా తన భావాలను మలచుకోవడం జరిగింది.

**బుక్కర్ టి. వాషింగ్టన్ :** అంబేద్కర్ తన చదువుల కొరకు అమెరికాను సందర్శించడం జరిగింది. అక్కడ అంబేద్కర్‌ను రెండు విషయాలు అమితంగా ఆకట్టుకున్నాయి. అందులో మొదటిది అమెరికా రాజ్యాంగంలోని 14వ రాజ్యాంగ సవరణ. అది నీగ్రోలకు స్వాతంత్ర్యంను ప్రసాదించింది. రెండవ విషయం బుక్కర్ టి. వాషింగ్టన్. ఇతడు అమెరికాలోని నీగ్రోల అభ్యున్నతికి, విద్యాభివృద్ధికి కృషి చేశాడు. అందుకు 'టస్కజీ' అనే సంస్థను స్థాపించి తరతరాలుగా నీగ్రోలు అనుభవిస్తున్న బానిసత్వ సంకెళ్ల నుండి విముక్తి చేశాడు. ఈ రెండు విషయాల నుండి ప్రేరణ పొందిన అంబేద్కర్ భారతదేశంలోని దళితులను విద్యావంతులను చేయడం, వారిని కులవ్యవస్థ సంకెళ్ల నుండి విముక్తి చేయుటకు నిశ్చయించుకొని తన సామాజిక ఉద్యమంలో భాగంగా విద్యాసంస్థలను స్థాపించడం, తద్వారా వారిని చైతన్యవంతులను చేయడం జరిగింది. అలాగే కులం సంకెళ్ల నుండి విముక్తి చేయుటకు 'కుల నిర్మూలన' అనే గ్రంథంను రాయడం, దాని ద్వారా తన సామాజిక ఉద్యమానికి రూపకల్పన చేయడమే గాక రాజ్యాంగ ముసాయిదా కమిటీకి అధ్యక్షత వహించి దళిత జాతులకు రాజ్యాంగపరమైన రక్షణతో కూడిన అభివృద్ధికై కృషి చేశాడు.

**కార్ల్ హెన్రిచ్ మార్క్స్ :** 19వ శతాబ్దం నాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయాలను గమనించిన మార్క్స్ ప్రపంచాన్ని గతి తార్కిక చారిత్రక సిద్ధాంతం ద్వారా నిర్వచించాడు. అతని ప్రకారం ప్రపంచ చరిత్ర మొత్తం వర్గపోరాటాల చరిత్ర. నాగరిక సమాజం ఏర్పడినప్పటి నుండి పేదవారు ధనవంతుల చేతిలో దోపిడికి గురవుతున్నారు. అయితే మార్క్స్ వర్గపోరాటాన్ని భారతదేశంలోని సామాజిక వ్యవస్థకు అన్వయించి విశ్లేషించినాడు అంబేద్కర్. భారతదేశంలో ధనవంతులు పేదవారినే గాకుండా సామాజికంగా వెనుకబడిన వర్గాలను, దళితులను సామాజికంగా, ఆర్థికంగా దోపిడి చేసేవారు. అందుకే దళితులను, సామాజికంగా వెనుకబడిన ఇతర వర్గాలను ఆ దోపిడి నుండి విముక్తి చేయుటకు అంబేద్కర్ మార్క్స్ భవజాలంతో తన ఆలోచనా దృక్పథాన్ని జోడించాడు. కార్ల్‌మార్క్స్ దోపిడీకి మూలం ఆర్థిక విషయాలనే ప్రముఖంగా చెప్పినప్పటికీ దానిని భారతీయ సమాజంలో ఆర్థిక విషయాలతో పాటు సామాజిక విషయాలను కూడా వర్తింపజేస్తూ, ముఖ్యంగా కులవ్యవస్థ నిర్మూలనతోనే సామాజిక న్యాయం జరుగుతుందని తద్వారా ఆర్థిక న్యాయం అందుతుందని అంబేద్కర్ తన సామాజిక ఉద్యమాన్ని రూపొందించి కొనసాగించాడు.

**రనాడే :** రనాడే భారతదేశంలో ప్రముఖ మేధావిగా పేరుగాంచాడు. అతడు తన రాజనీతి తత్వంలో న్యాయసిద్ధాంతం గురించి గొప్పగా చెప్పాడు. రాజకీయాల్లో ఊహజనితమైన విషయాలకు గాక, ఆచరణాత్మక విషయాలకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వాలని, ప్రజల మనోభావాలకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వాలని, అలా గాకుండా సిద్ధాంతాలకు ప్రాధాన్యత ఇచ్చినట్లయితే అవి మన్నన పొందజాలవని చెప్పాడు. ఈ విషయాలు అంబేద్కర్‌పై ఎంతో ప్రభావాన్ని చూపాయి. 'పూనా ఒడంబడిక' సందర్భంగా అంబేద్కర్ ప్రజల మనోభావాలను పరిగణనలోకి తీసుకొని గాంధీ ప్రాణాలను కాపాడడం కోసం దళితులకు రావాల్సిన మరికొన్ని ప్రయోజనాలను త్యాగం చేయడం జరిగింది.

**జెర్మిబెంథామ్ :** బెంథామ్ తన 'ఉపయోగితావాదం' సిద్ధాంతంలో 'అత్యధిక సంఖ్యాకుల అత్యధిక సంతోషమే' ఉపయోగితావాదమని అదే రాజ్యం యొక్క ప్రాథమిక లక్ష్యమని చెప్పడం జరిగింది. రాజ్యం కొద్దిమందికి అత్యధిక సంతోషం కోసం కాకుండా అత్యధికులకు అత్యధిక సంతోషం పొందడమని అర్థం. భారతదేశం ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానాన్ని అనుసరిస్తుంది. ప్రజాస్వామ్యమంటే పాలనలో 'ప్రజలందరి భాగస్వామ్యం' అని అర్థం. అలాగే ప్రజలందరి భాగస్వామ్యం పాలనలోనే గాకుండా రాజ్యప్రయోజనాలను పొందడంలో కూడా ఉండాలని, అందుకు అత్యధికులైన బలహీన వర్గాలకు తగిన ప్రాతినిథ్యం కల్పించుటకు అంబేద్కర్ తన సామాజిక ఉద్యంను నిర్మించడం జరిగింది.

**జాన్ స్టూవర్ట్‌మిల్ :** బెంథామ్ శిష్యుడైన జాన్ స్టూవర్ట్ మిల్ చెప్పిన రాజనీతితత్వం అంబేద్కర్‌ను గొప్పగా ప్రభావితం చేసింది. మిల్ తన వ్యక్తి శ్రేయోవాదం సిద్ధాంతంను చేప్తూ వ్యక్తికి తనపై పూర్తి స్వేచ్ఛ ఉండాలని, తన ఇష్టానుసారం బ్రతకడానికి తనకు హక్కుందని అంటాడు. దీని ఆధారంగా అంబేద్కర్ ప్రతి వ్యక్తికి తనమీద తనకు పూర్తిగా అధికారాలుండాలని, ప్రతి వ్యక్తికి స్వేచ్ఛగా జీవించే హక్కుందని చెబుతూ, ఆ హక్కులను పొందుటకు అందరికి అవకాశముండాలని అందుకు భారతదేశంలో సామాజికంగా, ఆర్థికంగా, వెనుకబడిన దళితులకు ఆ హక్కులను కల్పించుటకు తన జీవితాంతం కృషిచేశాడు.

**బెంజిమిన్ ఫ్రాంక్లిన్ :** అంబేద్కర్ లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు బెంజిమిన్ ఫ్రాంక్లిన్ జీవితచరిత్రతో ప్రభావితుడైనాడు. ఫ్రాంక్లిన్ పేదరికం నుండి స్వశక్తితో ఎదిగి బహుముఖ ప్రజ్ఞావంతుడై ప్రపంచ ప్రజల మన్ననలు అందుకున్నాడు. ఫ్రాంక్లిన్‌ను తన ఆదర్శపురుషుడుగా తీసుకున్న అంబేద్కర్ తాను కూడా కృషిచేసి మంచి పేరు ప్రఖ్యాతులను గడించాలని, ఆశించి, తన ఆశయాలను నిర్ణయించుకొని వాటి సాధనకొరకు నిరంతరం కృషి చేసి భారతదేశంలోనే గాకుండా ప్రపంచ మేధావుల్లో ఒకడిగా పేరుపొంది, భారతీయ సమాజంలో వెనుకబడిన దళితుల అభ్యున్నతికి ఎనలేని కృషిచేశాడు.

భారతీయ సమాజంలోని అంటరాని కులంగా పరిగణించే 'మహర్' కులంలో జన్మించిన అంబేద్కర్ కులసమాజంలోని ఆటుపోట్లకు గురై, తట్టుకొని తన జాతి వారెవరు అలాంటి పరిస్థితులను అనుభవించకూడదని తన జీవితాంతం ఒక ఉద్యమంలా పనిచేశాడు. తన జాతి వారిని ఉద్ధరించుటకు విద్యాలయాలను స్థాపించి, రాజ్యాంగ పరిరక్షణలను కల్పించడం జరిగింది. అలాగే 1942లో వైస్రాయ్ కౌన్సిల్ సభ్యుడిగా ఉంటూ కార్మికుల ఉద్ధరణ కోసం అనేక చట్టాలను ప్రతిపాదించాడు. స్వాతంత్ర్యానంతరం నెహ్రూ నాయకత్వంలోని జాతీయ ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రిగా ఉంటూ స్త్రీల హక్కుల కొరకు 'హిందుకోడ్ బిల్లు'ను ప్రతిపాదించాడు. ఆ విధంగా అంబేద్కర్ సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, సంస్కృతిపరంగా తరతరాలుగా అణచివేతకు గురైన వారి కోసం తన సామాజిక ఉద్యమంను నడిపాడు. ఆ క్రమంలో బుద్ధుడు, కబీర్, ఫూలే, రనాడే, మార్క్స్, బెంథామ్, వాషింగ్టన్ టి. బుక్కర్, ఫ్రాంక్లిన్ మొదలగువారి భావాలను ఆదర్శంగా తీసుకొని తన సామాజిక ఉద్యమానికి పునాదులుగా ఉపయోగించుకున్నాడు. అలాగే సమకాలీన సమాజంలో దళితుల హక్కుల రక్షణ కోసం, వారి ఆత్మగౌరవం కోసం చేస్తున్న పోరాటాలకు ఒక సిద్ధాంత స్ఫూర్తిని అందించిన గొప్ప సామాజికవేత్తగా డా. బి.ఆర్. అంబేద్కర్ చిరస్మరణీయుడు.

◆

# గ్రంథాలయాలు దినపత్రికల కోసమేనా?

- చల్లమల్ల వెంకటేశ్వర్లు

లైబ్రరీలు దినపత్రికలు చదివే కేంద్రాలుగా మారుతున్నాయా? అవుననే చెప్పొచ్చు. ప్రతిరోజు ఉదయం నుంచి సాయంత్రం వరకు జిల్లా కేంద్ర గ్రంథాలయాలను పరిశీలించితే ఇది నిజం అని తేలింది. కొంతమంది ఇతర కాంపిటిటీవ్ పరీక్షలకు గ్రంథాలయాలను ఉపయోగించుకుంటున్నారు. కాని మెజారిటీగా మాత్రం దినపత్రికలను చదివే కేంద్రాలుగానే అభివర్ణించవచ్చు. ఈ విషయం వరంగల్, నల్గొండ కేంద్ర గ్రంథాలయాలను పరిశీలించితే బయటపడింది. ఇదే విషయాన్ని అక్కడికి వచ్చే పాఠకులు చెప్పారు.

పట్టణాలలోని మెజారిటి పుస్తక పాఠకులు దళిత బహుజన ఆదివాసీల పిల్లలే, కొంతమంది వృద్ధులు (రిటైర్డ్). ఎందుకా అని అలోచించితే పట్టణాలలోని ఉన్నత కుటుంబాల పిల్లలు, అగ్రకులాల పిల్లలు సైన్స్, కంప్యూటర్, సాంకేతిక పరిజ్ఞానం కోర్సులు తీసుకొని, వారు ఉన్నత చదువులకు పరుగులు తీస్తున్నారు. వారికి లైబ్రరీకి వచ్చి చదివి, ఈ సమాజాన్ని అధ్యయనం చేయాలన్న ఆలోచన ఏ కోణాన లేదు. ఇంటర్నెట్, హబ్‌లు, స్నూకర్ గేమ్స్, సినిమా షికార్లతో కాలక్షేపం మరీ ఐతే ఏదో ఉద్యోగం. కాని దళిత బహుజన పిల్లలు అంత పెట్టుబడి పెట్టి చదువును కొనలేక సామాజిక శాస్త్రాలను అధ్యయనం చేస్తున్నారు. వీరు కూడా ఏ బి.ఇ.డి.లో లేక పి.జి. కోర్సులకో పరిమితమై ఆయా లైబ్రరీలను కొంత ఉపయోగించుకుంటున్నారు. వీరు ఎక్కువగా గ్రామ స్థాయినుండి వచ్చిన విద్యార్థులే. వీరు కూడా తమ సిలబస్‌ను తప్ప గ్రంథాలయాల్లో ఉండే పుస్తకాలను చరిత్ర, సంస్కృతి, నాగరికత, జాతీయత, నాయకుల చరిత్ర పుస్తకాలను ఏరోజు తీసి చూడను కూడా చూడలేదని వారు చెప్పారు. అసలు ఆ పుస్తకాలు మా జీవితానికి సంబంధించి ఏ దారి చూపిస్తాయని ఎదురు ప్రశ్న వేశారు.

నిజమే ఆయా లైబ్రరీలలో దళిత బహుజన ఆదివాసీల చరిత్ర పుస్తకాలు చాలా తక్కువ. వరంగల్ జిల్లా కేంద్ర లైబ్రరీలో ఈ దేశ చరిత్రలో మొదటి, ఆధునిక సామాజిక ఉద్యమకారుడు, బ్రిటిష్ ప్రభుత్వంచే మహాత్మా అని పిలువబడిన 'మహాత్మా జ్యోతిరావు ఫులే' చరిత్ర పుస్తకం లేదంటే, అసలు చరిత్రంటే ఏందో తెలవని పరిస్థితి. అలాగే తెలంగాణాలోని ఆదిలాబాద్ జిల్లానుండి ఎదిగివచ్చి అటు నిజాం ప్రభువును, ఇటు బ్రిటిషర్స్‌ను గడగడలాడించిన 'ఆదివాసి వారసుడు' కొమురం భీం చరిత్ర పుస్తకం లైబ్రరీ అంతా వెతికినా దొరకలేదు. వీరిద్దరి చరిత్రే కాదు భారత రాజ్యాంగ నిర్మాత, భారతరత్న డా. బాబాసాహెబ్ అంబేద్కర్ చరిత్ర, ఉద్యమం పుస్తకాలు లేనే లేవు. ఇలా చెప్పుకుంటూ పోతే అసలు దళిత బహుజన జాతీయ నాయకుల రాష్ట్ర నాయకుల చరిత్ర పుస్తకాలు లేనే లేవు.

**చిత్ర పటాలు**

చిత్రపటాలు మనిషిని ఆలోచింపజేస్తాయంటారు. నేడు మనం రాష్ట్రంలోని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోని చిత్రపటాలను పరిశీలించితే మొత్తం అగ్రకులాల నాయకుల చిత్రపటాలే కనిపిస్తాయి. చిత్రపటాన్ని చూసి ఆదర్శంగా మనం చేసుకొనే అవకాశం ఉంది. ఆ కోవలో చూసినపుడు ఏ జిల్లా కేంద్ర లైబ్రరీకి వెళ్ళినా మొదట గాంధీ, నెహ్రూ, ఇందిరాగాంధీ మొదలగు వారివి దర్శనమిస్తాయి. వరంగల్ కేంద్ర గ్రంథాలయంలోని చిత్రపటాలు శ్రీనివాస్ రామానుజన్, పి.వి.నరసింహారావు, లాలా లజపతిరాయ్, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, ఇందిరాగాంధీ, నేతాజీ, రవీంద్రనాథ్ ఠాగూర్, రాధాకృష్ణన్, వల్లభాయ్‌పటేల్, వి.వి. గిరి, మొదలగు పటాలు పత్రికల విభాగంలో దర్శనమిచ్చాయి. మచ్చుకు ఒకటి అంబేద్కర్ చిత్రపటం ఉంది.

12 చిత్ర పటాలల్లో 11 చిత్రపటాలు అగ్రకుల నాయకులవే ఉంటే, మనం ఎవరిని ఆదర్శంగా తీసుకోవాలి అనే ప్రశ్న దళిత బహుజన పాఠకులకు కలగదా? ఆలోచించాలి. ఒక్క వరంగల్ లైబ్రరీలోనే కాదు రాష్ట్రం, దేశం మొత్తం మీద కూడా ఇదే పరిస్థితి. ఈ విధానం ఇలాగే కొనసాగితే దళిత బహుజనులు ఎదిరించే పరిస్థితి వస్తుంది.

ప్రపంచ వ్యాప్తంగా జరుగుతోన్న విజ్ఞాన విస్ఫోటాల్ని ఇప్పటి తరానికి భవిష్యత్ తరాలవారికి అందించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. ఈ బాధ్యతను జిల్లా కేంద్రంలోనే కాదు సమర్థంగా నిర్వహించాలంటే పల్లెల్లోని గ్రంథాలయాల పట్ల కూడా శ్రద్ధ చూపడం ప్రభుత్వ నైతిక కర్తవ్యం. ప్రభుత్వం చెపుతున్న సామాజిక న్యాయానికో మెట్టు. దళిత బహుజనమేధావులు బుద్ధుడు, ఫూలే, పెరియార్, నారాయణగురు, అంబేద్కర్, సావిత్రి బాయిఫూలే, రమాబాయి, ఫూలన్‌దేవీలు జాతీయ నాయకులు. వీరి చిత్రపటాలను ప్రతి జిల్లా కేంద్ర గ్రంథాలయాల్లో ఉంచితే వారిని ఆదర్శంగా తీసుకొని వారి చరిత్రలను అధ్యయనం చేసేందుకు అవకాశం వుంటుంది.

ఇక రాష్ట్రంలో చూసినపుడు చాలామంది నాయకులు ఎదిగివచ్చారు. వారి జీవిత చరిత్ర పుస్తకాలను, పటాలను పెడితే బాగుంటుంది. ఈవిషయంలో 'దళిత ఉద్యమం' కొంత చేసినా ఇంకా చేయాల్సిన అవసరం ఉంది. దళిత ఉద్యమం కూడా 'అంబేద్కర్ విగ్రహాలను' గ్రామ గ్రామానికి పెట్టించేందుకు స్ఫూర్తినిచ్చింది. అదే విధంగా దళిత బహుజన సాహిత్యాన్ని కూడా గ్రామ గ్రామానికి తరలించే ప్రయత్నం ప్రారంభించాలి. బోధి అదే పనిలో ఉంటుంది.

గ్రామంలో నిర్మించే ప్రతి కమ్యూనిటి హాల్ (దళిత కాలనీ)తో దళిత సాహిత్యం, 'అంబేద్కర్' రచనలు పెట్టాలనే జి.ఓ. కూడా ఉంది. కాని నేడు ఎక్కడా అమలు జరగడం లేదు. కమ్యునిటిహాల్‌లో కూర్చుని సమస్యలను చర్చించుకునేటపుడు, ఏ సమస్యకు ఎలాంటి పరిష్కారాన్ని అంబేద్కర్ సూచించాడో తెలుసుకునే అవకాశం ఉంటుంది. అయా కమ్యునిటిహాల్స్‌నే గ్రంథాలయాలుగా ప్రభుత్వం ఉపయోగించు కోవచ్చును. వాటి నిర్వహణ ఖర్చు కూడా తక్కువే ఉంటుంది. కొంత స్వచ్ఛందంగా నిర్వహించుకుంటారు. ఇది గ్రామాల పరిస్థితి.

# సమ్మతి సృష్టి - అసమ్మతి సృష్టి

- కొందుభట్ల రామచంద్రమూర్తి

**ఒ**క పత్రిక లేదా ఒక టీవీ న్యూస్‌చానెల్ విశ్వసనీయతను ఎట్లా నిర్ణయించాలి? ఇందుకు కొలమానం ఏమిటి? ప్రసార, ప్రచార మాధ్యమాలకు విశ్వసనీయత ప్రాణం. ఒక పత్రిక విక్రయించే ప్రతుల సంఖ్యకూ ఆ పత్రిక విశ్వసనీయతకూ సంబంధం ఉంటుందా? ఒక టీవీ న్యూస్ ఛానెల్ వీక్షకుల సంఖ్యను బట్టి ఆ ఛానెల్ విశ్వసనీయతను నిర్ణయించవచ్చునా? ఫలానా పత్రిక విశ్వసనీయమైనదనీ, ఫలానా పత్రిక విశ్వసనీయమైనది కాదనీ ఎవరు, ఎట్లా చెప్పాలి? ఏ పత్రిక చదువదగినదో, ఏ ఛానెల్ చూడదగినదో ఎవరి అనుభవాన్ని బట్టి వారు నిర్ణయించుకోవాలి. సమష్టి అనుభవాన్ని తెలుసుకునేందుకు వేరు మార్గం లేదు కనుక అమ్ముడుపోయే ప్రతుల సంఖ్య లేదా వీక్షకుల సంఖ్య విశ్వసనీయత నిర్ధారణకు ప్రాతిపదికలు కాక తప్పదు. మరో విధమైన తూనికరాళ్లతో విశ్వసనీయతను అంచనా వేయడం సాధ్యం కాదు. వ్యాపార ప్రకటనలు ఇచ్చేవారు ఏ పత్రికలో ప్రకటనలు ఇస్తే తమకు స్పందన ఎక్కువగా వస్తుందో చూసుకుంటారు. ఛానెల్ విషయంలోనూ అదే నిర్ణాయకాంశం అవుతుంది. కానీ వార్తలనూ, వ్యాఖ్యలనూ పాఠకులు లేదా వీక్షకులు నమ్ముతున్నారో లేదో పత్రికల, ఛానెల్ల నిర్వాహకులకే ఎక్కువగా, కచ్చితంగా తెలుస్తుంది. ఒక పత్రిక ప్రచురించే వార్తలనూ, వ్యాఖ్యలనూ విశ్వసించని పాఠకుడు ఆ పత్రికను కొనడం, చదవడం మానేస్తాడు. అంగడిలోని ఇతర పత్రికలలో తనకు ఇష్టమైన మరో పత్రికను కొనుక్కుంటాడు. ఏ పత్రికా నచ్చకపోతే అసలు పత్రికలను కొనడం, చదవడం మానుకుంటాడు. ఆ స్వేచ్ఛ పాఠకుడికి ఉంది. ఒక టీవీ న్యూస్ ఛానెల్‌ను విశ్వసించలేకపోతే వెంటనే రిమోట్ సహాయంతో మరో ఛానెల్‌కు మారవచ్చు. ఏ ఛానెల్ వార్తలనూ, వ్యాఖ్యలనూ నమ్మకంగా ఇస్తున్నదని భావిస్తే ఆ ఛానెల్‌కు అదనంగా పైసా ఖర్చు లేకుండా మారిపోవచ్చు. అన్ని న్యూస్ ఛానెళ్లూ నమ్మదగినవిగా లేవని అనిపిస్తే సీరియళ్లో, సినిమాలో చూసుకోవచ్చు. అదీ ఇష్టం లేకపోతే టీవీని కట్టెయ్యవచ్చు. నిర్బంధం లేదు. పాఠకుడైనా, వీక్షకుడైనా నమ్మకం తగ్గిపోతే తిరస్కరిస్తాడనే భయమే పత్రికల యాజమాన్యాలనూ, టీవీ న్యూస్ ఛానెల్ యాజమాన్యాలనూ లక్ష్మణరేఖ దాటకుండా నియంత్రిస్తుంది. ప్రసార, ప్రచార మాధ్యమాలలో వారపత్రికలూ, పక్షపత్రికలూ, మాసపత్రికలూ, వినోద ప్రధానమైన ఛానెళ్లూ, విజ్ఞానం అందించే ఛానెళ్లూ ఉంటాయి. వాటికంటే వార్తాపత్రికలూ, న్యూస్ ఛానెల్ల ప్రభావమే సమాజంపైన అధికం కనుక వాటి విశ్వసనీయతే ఎక్కువగా చర్చనీయాంశం అవుతున్నది.

తిరస్కారభయం పత్రికలనూ, టీవీ ఛానెళ్లనూ అదుపులో ఉంచగలిగితే వాటి విశ్వసనీయత ఎందుకు ప్రశ్నార్థకం అవుతున్నది? పత్రికలూ, ఛానెళ్లూ కేవలం సమాచార వితరణకే, వినోద ప్రాదానానికే పరిమితం కానప్పుడు, ఇతర వ్యాపార ప్రయోజనాలూ, రాజకీయ ప్రయోజనాలూ ప్రధానమైనప్పుడు విశ్వసనీయత హరించుకుపోవడం అనివార్యం. ప్రాంతీయ భాషలలో వెలువడుతున్న పత్రికలూ, టీవీ ఛానెళ్లూ స్థానిక రాజకీయ, సామాజిక వ్యవహారాలలో తలమునకలవటం వల్ల సత్యనిష్ఠ విషయంలో పట్టింపులేకపోవడం, రాజీపడటం మూలంగా ప్రమాణాలు తగ్గిపోయే ప్రమాదం ఎక్కువ. ఆంగ్ల పత్రికలకూ, ఛానెళ్లకూ ఇటువంటి జాడ్యాలు బొత్తిగా లేవని కాదు. సమాజంపై వాటి ప్రభావం తక్కువ. ప్రసార, ప్రచార సంస్థల యాజమాన్యాలకు సమాచార సేవ కంటే లాభాలు దండుకోవడం, పదవులు సంపాదించడం ముఖ్యమైనప్పుడు మొట్టమొదట బలి అయ్యేది విశ్వసనీయతే. కొన్ని పత్రికలూ, న్యూస్ ఛానెళ్లూ ప్రారంభంలో కొన్ని ప్రమాణాలు పాటించి, వ్యాపార పద్ధతులను సమర్థంగా అమలు చేసి పాఠకుల లేదా వీక్షకుల సంఖ్యను (బ్రాండ్ ఇమేజ్‌నూ) పెంచుకున్న తర్వాత సంకుచితమైన వ్యాపార, రాజకీయ, సామాజిక ప్రయోజనాలకోసం పత్రికలనూ, న్యూస్ ఛానెళ్లనూ దుర్వినియోగం చేస్తున్న సందర్భాలు అనేకం. అందుకే సర్క్యులేషన్ ఎక్కువ ఉన్న పత్రికలకు లేదా టీఆర్‌పీ (టెలివిజన్ రేటింగ్ పాయింట్స్) ఎక్కువ ఉన్న న్యూస్ ఛానెళ్లకు అదే స్థాయిలో విశ్వసనీయత ఉండకపోవచ్చు. ఒక పత్రిక సర్క్యులేషన్ పెరగడానికి ఆ పత్రిక ముద్రణ ప్రమాణాలు ఉన్నతంగా ఉండటం, సకాలంలో పత్రికను అందజేయడం, ఆసక్తికరంగా, వైవిధ్యభరితంగా పత్రికను తయారుచేయడం, మంచి భాష రాయడం వంటి అనేక కారణాలు ఉండవచ్చు. పత్రిక విధానం అన్నది సత్యం, ధర్మం వంటి నైతికవిలువలపై కాకుండా స్వప్రయోజనాలపై ఆధారపడి సమయానుకూలంగా మారుతూ ఉండవచ్చు. రాజకీయ పార్టీలూ, కులసంఘాలూ, వ్యాపార బంధాలూ, స్వార్థచింతనా పత్రికల లేదా టివీ న్యూస్ ఛానెల్ల విధానాలను ప్రభావితం చేయవచ్చు. ఈ ధోరణి హిందీ, తమిళ పత్రికలలో, ఛానెల్లలో చాలాకాలంగా కొనసాగుతోంది. రాజకీయ నాయకులకు ప్రతికూలంగా వార్తలూ, వ్యాఖ్యలూ ప్రచురించిన, ప్రదర్శించిన సందర్భాలలో వారు మీడియా ప్రతినిధులను దుర్భాషలాడటం, యాజమాన్యాలకు దురుద్దేశాలు అంటగట్టడం మామూలే. ములాయంసింగ్ 'హల్లాబోల్' అంటే లాలూప్రసాద్ 'మార్నాచాహియే సాలోంకో' అన్నారు. కాన్షీరాం తరిమి కొట్టారు.

---

జిల్లా కేంద్ర గ్రంథాలయాలను పర్యవేక్షించే అధికార యంత్రాంగం వీటిపై దృష్టి సారించి గ్రంథాలయమే మనిషిని ఉన్నతుడిని చేసేందుకు మార్గం అని తెలియచెప్పేటట్లు పనిచేయాలి. ఇంకొక విషయం కొన్ని పత్రికలలో సామాజిక, ఆర్థిక అంశాలపై సుదీర్ఘమైన వార్తలు-వ్యాసాలు దళిత బహుజనులను ఉత్సాహపరుస్తూ, వారి చరిత్ర, సామాజిక పరిస్థితులను తెలియచేస్తున్నాయి. వాటిని 'ఫైలింగ్' చేసే కార్యక్రమానికి కూడా జిల్లా కేంద్ర గ్రంథాలయాలు పూనుకునేటట్లు చేయాలి. ఆయా వార్తలను ఎప్పుడైనా చదువుకునేందుకు వీలుంటుంది. ఇవేమీ చేయలేనపుడు జిల్లా గ్రంథాలయాలు సంక్షోభంలో పడే అవకాశం వుంది. తక్షణమే సంస్కరించాలి. ◆

అయిదు దశాబ్దాల కిందట ఆంధ్ర అసెంబ్లీకి ఎన్నికలు జరిగిన నాటికే తెలుగు పత్రికా రంగంలో అవాంఛనీయ ధోరణులు పెచ్చరిల్లాయి. కమ్యూనిస్టు పార్టీ తరఫున ప్రచారం చేసిన శ్రీశ్రీ వంటి కవులనూ, రచయితలనూ అవహేళన చేస్తూ, కమ్యూనిస్టు పార్టీపై దాడి చేస్తూ, సోవియట్ యూనియన్ గురించి అర్ధసత్యాలూ, అసత్యాలూ చెబుతూ ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభలలో పండితారాధ్యుల నాగేశ్వరరావూ, నార్ల వెంకటేశ్వరరావూ ఉద్యమ సదృశంగా వ్యాసాలు రాసి, రాయించి ప్రచురించారు(విశ్వేశ్వరరావు ప్రచురించిన 'దొంగదాడి కథ'–సాహితీ మిత్రులు, విజయవాడ – చదవండి). నాటి ఎన్నికలలో విజయఢంకా మోగిస్తుందనుకున్న కమ్యూనిస్టు పార్టీ ఘోరంగా ఓడిపోవడంలో కమ్యూనిస్టు నాయకుల స్వయంకృతంతో పాటు (బూర్జువా) పత్రికల పాత్ర కూడా గణనీయమైంది. ఆ ఘట్టం తర్వాత కూడా కాంగ్రెస్ పార్టీలో సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి ముఠాలను బలపరిచే పాత్రికేయులు ఉండేవారు. ఒక పత్రిక సంజీవరెడ్డికి మద్దతు ఇస్తే మరో పత్రిక బ్రహ్మానందరెడ్డిని వెనకేసుకొచ్చేది. కాంగ్రెస్ నాయకులు రుణం ఉంచుకోలేదు. ఆంధ్రపత్రిక సంపాదకుడు శివలెంక శంభుప్రసాద్‌నూ, ఆంధ్రప్రభ నుంచి నిష్క్రమించి 'ఆంధ్రజ్యోతి' సంస్థాపక సంపాదకుడైన నార్లనూ రాజ్యసభ సభ్యత్వాలతో సత్కరించారు. ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలలో తెలుగు పత్రికలు వాస్తవాలతో నిమిత్తం లేకుండా యాజమాన్యాల, సంపాదకులు అభిప్రాయాలకు అనుగుణంగా వ్యవహరించాయి. లోగడ పత్రికల ఇష్టాయిష్టాలు సాధారణంగా ఎన్నికల సమయంలోనో, ఉద్యమాల సందర్భంలోనో వెల్లడయ్యేవి. ప్రభుత్వాలను మార్చడం లేదా రక్షించడం వంటి బాధ్యతలను నాటి పత్రికలు నిర్వహించేవి కావు. ఈనాడు స్థాపన, తెలుగుదేశం పార్టీ ఆవిర్భావం తర్వాత సరికొత్త పోకడలు వచ్చాయి. ఎన్‌టి రామారావు రాజకీయ రంగ ప్రవేశం చేయడంలోనూ, తొమ్మిది మాసాల ప్రచారం తర్వాత అసెంబ్లీ ఎన్నికలలో ఘనవిజయం సాధించడంలోనూ, నాదెండ్ల తిరుగుబాటు ఫలితంగా పదవీచ్యుతుడైన ఎన్‌టిఆర్‌ను మళ్లీ గద్దెమీద కూర్చోబెట్టేందుకు నిర్వహించిన ప్రజాస్వామ్య పునరుద్ధరణ ఉద్యమంలోనూ, చివరికి ఎన్‌టిఆర్ చేతుల నుంచి చంద్రబాబునాయుడు చేతుల్లోకి అధికారం మారడంలోనూ ముఖ్యమైన పాత్ర పోషించిన 'ఈనాడు' అంతవరకూ పత్రికారంగాన్ని శాసిస్తున్న నియమాలను మార్చివేసింది. 'ఉదయం', 'వార్త'లు భిన్నమైన పాత్ర పోషించాయి. కానీ అన్నిరకాలా తెలుగు పత్రికారంగాన్ని మలుపు తిప్పిన ఖ్యాతి ఈనాడుదే. ఒక పార్టీని అధికారంలోకి తేవడం, అధికారంలో కొనసాగేందుకు దోహదం చేయడం లేదా ఒక పార్టీని అధికారంలోకి రాకుండా నిరోధించడం ధ్యేయంగా కనిపించని ఎజెండాను నిర్ణయించుకోవడం స్పష్టాస్పష్టంగా కనిపిస్తుంది. ఈ క్రమంలో ఎవరిని రక్షించాలో, ఎవరిని శిక్షించాలో కూడా మీడియా ఎజెండాలో భాగం అవుతుంది. కొన్ని మీడియా సంస్థలు ఈ పనిని బాహాటంగా చేయవచ్చు. కొన్ని కనిపించకుండా చేయవచ్చు. మరికొన్ని పాఠకుల ఆదరణే పరమావధిగా వాస్తవాల ప్రచురణకే కట్టుబడి ఉండవచ్చు. న్యూస్ ఛానెళ్లు పెరిగాయి. పత్రికల విస్తృతి, ప్రాబల్యం పెరిగాయి. ప్రజలలో రాజకీయ అవగాహన పెరిగింది. చదవడం, రాయడం రానివారు కూడా టీవీ న్యూస్ ఛానెళ్లను చూసి పరిస్థితులను అర్థం చేసుకుంటున్నారు. టీవీ విలేఖరులు అడిగిన ప్రశ్నలకు స్పష్టంగా, నిస్సంకోచంగా సమాధానాలు చెబుతున్నారు. మొత్తంమీద ప్రజలపైన మీడియా ప్రభావం చాలా ఉంది.

చామ్‌స్కీ చెప్పిన 'సమ్మతి సృష్టి' (మాన్యుఫ్యాక్చర్ ఆఫ్ కన్సెంట్) మాత్రమే కాకుండా 'అసమ్మతి సృష్టి' (మానుఫ్యాక్చర్ ఆఫ్ డిసెంట్)కు కూడా కొన్ని ప్రసార, ప్రచార సాధనాలు ఏదో ఒక స్థాయిలో ఎంతో కొంత ప్రభుత్వానికీ, నాయకుడికీ అనుకూలంగా వార్తలనూ, వ్యాఖ్యలనూ వండటం, వడ్డించడం ఈ ప్రక్రియలో భాగం. ఒక నాయకుడి ప్రకటనలో తమకు అవసరమైనంత, అనుకూలమైనంత మేరకే స్వీకరించడం, ప్రతికూలమైన భాగాలను పరిహరించడం ఎడిటింగ్‌గా చెలామణి అవుతోంది. నాయకుల ప్రసంగాలనూ, పార్టీల ప్రకటనలనూ సమగ్రంగా, పూర్తి న్యాయం జరిగే విధంగా ప్రచురించాలనీ లేదా ప్రసారం చేయాలనే పట్టింపు లేకుండా పోతోంది. ఇటువంటి ధోరణి గతంలో బొత్తిగా లేదని కాదు. పనికట్టుకొని అవాస్తవాలను వాస్తవాలుగా చిత్రించడం, గోరంతను కొండంతగా చూపించడం లేదా కొండంతను గోరంతగా చేయడం ఇటీవల ప్రబలుతున్న ప్రమాదకరమైన ధోరణి.

అటు రాజకీయవాదులూ, ఇటు మీడియా నిర్వాహకులూ గమనించవలసింది ఏమిటంటే సమాజాన్ని ప్రభావితం చేసే శక్తిని వారికి ప్రసాదించిన ప్రజలు అన్ని విషయాలనూ గమనిస్తూనే ఉంటారు. స్వానుభవంలో వాస్తవాలను తెలుసుకుంటారు. తమకు వాస్తవాలను అందించడం కాకుండా మీడియా నిర్వాహకులకు సొంత ఎజెండా ఉన్నదనీ, వారి ప్రయోజనాలకోసం మీడియాను వినియోగించు కుంటున్నారనీ గ్రహించినప్పుడు పాఠకులు లేదా వీక్షకులు ఆగ్రహిస్తారు. తాము వంచనకూ, అవమానానికీ గురి అవుతున్నట్టు భావిస్తారు. క్రమంగా ఆమోదాన్నీ, ఆదరణనూ ఉపసంహరించుకుంటారు. విశ్వస నీయతతో చెలగాటం కొంతకాలం సాగుతుందేమో కానీ ఎల్లకాలం సాగదు. ఈ విషయం తెలిసిన మీడియా నిర్వాహకులు ఎప్పటికప్పుడు సమతౌల్యం పాటిస్తున్నదీ లేనిదీ పరీక్షించుకుంటారు. తేడాపాడాలు ఉంటే సవరించుకుంటారు. మార్కెట్‌నుంచి వస్తున్న సమాచారాన్నీ, పాఠకుల లేదా వీక్షకుల అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకొని విశ్వసనీయతను పరిరక్షించుకోవడానికి అవసరమని భావించిన చర్యలు తీసుకుంటారు. ఇది సర్వసాధారణంగా జరగవలసిన పని. సమాచార వితరణే లక్ష్యంగా భావించిన మీడియా సంస్థలు చేస్తున్నపని. ఇందుకు భిన్నంగా వ్యవ హరిస్తున్న వారికి మీడియా సంస్థను నిలబెట్టుకోవడం ప్రధానం కాదనీ, అంతకు మించిన ప్రయోజనాలు ఉన్నాయనీ భావించవలసి ఉంటుంది. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

# పెట్టుబడి స్వభావమే మీడియా దృక్పథాన్ని నిర్మిస్తుంది !

– రవిప్రకాష్

సమకాలీన రాజకీయాల్లో సమీకరణలు మారుతున్న కొద్దీ మీడియా విశ్వసనీయత కూడా చర్చకొస్తోంది. మీడియా విశ్వసనీయత ఉందా లేదా ఉంటే ఎంత, ఎలా అనే దానికంటే అసలు మీడియా విశ్వసనీయతను నిర్వచించడమే కష్టమైన పని. మీడియా యజమానులు రెండు రకాలుగా ఆలోచిస్తారు. ఒకటి లాభం, రెండోది రాజకీయ ప్రయోజనం. ఆ పాటికే వినోదాత్మక ఛానళ్లను నడిపేవారు తమ లాభాల్లో కొంత భాగం వార్తా ప్రసారాల మీద పెడతారు. దానిమీద లాభాలు రావాలని పెద్దగా ఆశించరు. ప్రధాని కార్యాలయంలోకి ఎలాంటి ఆటంకం లేకుండా వెళ్లడం, మంత్రివర్యుల చేత నాలుగు పనులు చేయించుకోవడం ఇదే వారి ప్రయోజనం. ఇంతకు మించి వార్తలకు చక్కటి వ్యూయర్‌షిప్ రావాలి, వాటితో ప్రజలను ఆకర్షించాలనే ధ్యేయం గానీ, ఆశయంగానీ వారికి లేదని కొందరు మీడియా అధినేతల మాటల్లోనే తెలిసిపోతుంది. అయితే, ఇది ఇరవైనాలుగు గంటల న్యూస్ ఛానళ్లు లేనప్పటి సంగతి. వార్తల కోసం ప్రత్యేకంగా వ్యూయర్‌షిప్ ఉంటుందని నమ్మేవారు లేని నాటి సంగతి.

సరిగ్గా ఇటువంటి సమయంలోనే వార్తల కోసమే అంకితమైన ఛానల్స్ ముందుకొచ్చాయి. వార్తల ద్వారానే ప్రజల్ని ఆకర్షించవచ్చని, వార్తలకు వీక్షకుల సంఖ్యను గణనీయంగా పెంచవచ్చనీ అవి విశ్వసించాయి. ఎన్‌డిటివీ, సిఎన్ఎన్ - ఐబిఎన్, దక్షిణాదిన టివీనైన్, మళయాళంలో మనోరమ వంటి మరికొన్ని ఛానళ్లు ఈ విశ్వాసంతోనూ, పట్టుదలతోనూ ముందుకొచ్చాయి. ఎంటర్‌టైన్ ఛానళ్ల యజమాన్యాల నుంచి కాక కేవలం న్యూస్ ప్రొఫెషనల్స్ నేతృత్వంలో మార్కెట్‌లో అడుగుపెట్టాయి. కేవలం వార్తలను మాత్రమే ప్రధాన ఆదాయవనరుగా ఎంచుకోవడమే వీరి ప్రత్యేకత. ఇక్కడ వార్తలు వినోదానికి తోకలు కావు.

నిజానికి ఇదొక సాహసం. ఎందుకంటే భారతదేశంలో 98 శాతం మంది కేవలం వినోదభరిత ఛానల్స్ మాత్రమే చూస్తున్నారు. వార్తా ఛానళ్లు వ్యూయర్‌షిప్ ఇప్పటికీ 2 శాతానికి అటూఇటుగానే ఉంది. అయితే ఆంధ్రప్రదేశ్‌లో మార్పు సాధ్యమేనని రుజువైంది. టీవీనైన్ వచ్చాక జాతీయ సగటుతో పోల్చుకుంటే ఆంధ్రప్రదేశ్‌లో వార్తలను చూసే వారి సగటు పెరిగింది. తెలుగు న్యూస్ ఛానళ్లు 6 శాతం వ్యూయర్‌షిప్‌ను కూడా అందుకున్నాయి. కాని దీన్ని మరో రకంగా చూస్తే ఇంకా మన రాష్ట్రంలో నూటికి 94 మంది కేవలం వినోదాత్మక ఛానల్సే చూస్తున్నారు.

ఎలక్ట్రానిక్ మీడియా కోట్ల పెట్టుబడితో కూడిన వ్యాపారం. ఈ రంగంలోకి వచ్చేవారు కనీసం నష్టాలు లేకుండానైనా నడపాలని ఆశిస్తారు. వారికి ఎంటర్‌టైన్‌మెంట్ ఛానల్స్‌లో ఉన్న ఆకర్షణ వార్తా ఛానల్స్‌లో కనిపించడం లేదు. వార్తా ఛానళ్లకు వచ్చే పెట్టుబడే తక్కువ, వాటిలో కూడా ఎడ్వర్టయిజింగ్ తక్కువ. వార్తా ఛానళ్ల ఆదాయాలు కూడా అంత ఆకర్షణీయంగా లేనప్పుడు, క్వాలిటి ఏ విధంగా ఉంటుందో మనం ఊహించవచ్చు. ఆర్థిక వనరులను బట్టే మానవ వనరుల స్థాయి, పని వాతావరణం ఆధారపడి ఉంటాయి. కనుక వార్తా ఛానల్ నడపడంలో కష్టనష్టాలు అర్థం చేసుకోవచ్చు.

మరోవైపు, ఎంటర్‌టైన్‌మెంట్ ఛానల్స్ మన దేశంలో పెరగడానికి, మనగలడానికి మన దగ్గర సినిమాలూ సీరియళ్ల రూపంలో చాలా చవకబారు కంటెంట్ అందుబాటులో ఉంది. వారమంతా సీరియళ్లు, వారాంతంలో సినిమాలు. మెజారిటీ జనం ఈ సీరియల్సే చూస్తున్నారు. బ్లాక్‌బస్టర్ మూవీ ఏ ఛానల్‌లో ఉంటే ఆ ఛానల్‌కు విపరీతమైన ప్రేక్షకులు! అందుకే వార్తా ఛానళ్లు ప్రజల్ని ఆకర్షించే విషయంలో ఇంకా కసరత్తు చేయాల్సి ఉంది.

ఎంటర్‌టైన్‌మెంట్ ఛానళ్లకున్నంత మంది ప్రేక్షకులు–వార్తలూ, సమకాలీన సామాజిక అంశాలూ, ప్రజాజీవితాన్ని ప్రత్యక్షంగా ప్రభావితం చేసే పరిణామాలనూ అందించే, వివరించే ఛానళ్లకు లేకపోడాన్ని మరో రకంగా కూడా విశ్లేషించవచ్చు. దానికి మూలం మన ఆర్థిక వ్యవస్థలో కూడా ఉంది. సమాజంలో సగభాగంగా ఉన్న స్త్రీలు, ముఖ్యంగా మధ్యతరగతి మహిళలు అచేతనావస్థలో ఉన్నారు. వంట చేయడం, బట్టలుతకడం, ఇల్లు చక్కబెట్టుకోవడం తప్పితే సమాజానికి సంబంధించి ఏ చైతన్యవంతమైన ప్రక్రియలోనూ వారు పెద్దగా పాలుపంచుకునే అవకాశం లేకుండా పోయింది. ఆఖరికి రాజకీయాల్లో ఉన్న మహిళలకూ కుటుంబమే సర్వస్వం. 24 గంటలూ వారు అత్తగారి మొహం, తోడికోడలి మొహం, మొగుడి మొహం చూస్తుంటారు, ఇంట్లో చుట్టాల మొహం సరేసరి. కుటుంబమే సర్వస్వం అనే సంస్కృతిని సీరియల్స్ చాలా చక్కగా వాడుకుంటున్నాయి, పెంచి పోషిస్తున్నాయి. తీరిగ్గా 2–3 గంటలు పేరంటాలకు వెచ్చించేంత సమయం మన ఆడవాళ్ల దగ్గరున్నంత కాలం భారతదేశంలో టీవీ సీరియళ్లకి ఎటువంటి ఢోకా లేదని సాక్షాత్తూ ఓ మీడియా అధినేతే వ్యాఖ్యానించారు.

నిజానికి ఈ సీరియళ్ల జాడ్యం మనకు యూరోప్ అమెరికాల నుంచే దిగుమతైంది. యూరోప్‌లో మహిళలు, ఆర్థికంగా, సాంస్కృతికంగా వెనుకబడిన రోజుల్లో, కేవలం ఇంటిపనికే పరిమితమైన రోజుల్లో మధ్యాహ్నాలు ఖాళీగా ఉండే వనితల కోసం అక్కడి ఛానెళ్లు కుటుంబ వ్యవహారలే కథాంశాలుగా సీరియల్స్ తయారు చేసి మధ్యాహ్నం వేళల్లో ప్రసారం చేశాయి. బట్టలుతకడం, అంట్లుతోమడం వీరి బాధ్యత కాబట్టి డిటర్జెంట్లూ, బాత్‌సోపులూ తయారు చేసే కంపెనీలు ఈ సీరియల్స్‌ను ఎక్కువగా స్పాన్సర్ చేసేవి. అందుకే వాటిని సోప్స్ అని పిలిచేవాళ్లు. కానీ ఇప్పుడక్కడ పరిస్థితి మారింది. మహిళలు బయటకు వెళ్లడం మొదలుపెట్టారు. అక్కడి ఆర్థిక, సామాజిక వ్యవస్థలో వారి భాగస్వామ్యం పెరిగింది. వారు కూడా ఎనిమిదింటికి లేచి ఆఫీస్‌కు వెళ్లడం మొదలుపెట్టారు. దాంతో ఇక వారికి ఈ సోప్స్ చూసేంత తీరికలేదు. సోప్స్ చూడటమంటే ఒక రకంగా వెనుకబాటుతనం. అత్తాకోడళ్ల రోటీన్ శత్రుత్వం, కుట్రలూ హత్యాప్రయత్నాల సన్నివేశాల సంస్కృతిని దాటి ఉద్యోగం గురించి ఆర్థిక పరిస్థితి గురించి, భవిష్యత్తు గురించి, ఆఖరికి వ్యాపారం గురించి కూడా ఆలోచిస్తున్నారు. దాంతో యూరప్‌లో సోప్స్ సీజన్ వెనకబడింది. కాబట్టి ఆర్థిక వ్యవస్థకి, మన

టెలివిజన్ కార్యక్రమాలకి డైరెక్ట్ లింక్ ఉందని చెప్పవచ్చు. అయితే, మన మధ్యతరగతి మహిళలు హఠాత్తుగా వినోదం నుంచి సీరియస్ అంశాలవైపు మళ్లడమంటే కష్టమవుతుంది. అందుకే న్యూస్ వ్యూయింగ్ కల్చర్‌ను సాగుచేయడం శ్రమతో కూడిన పని.

ఇక్కడే మరో కీలకమైన సంగతి ఉంది. ఛానల్‌ను ఏ తరహా మేనేజ్‌మెంట్ కంట్రోల్ చేస్తుందో దాన్ని బట్టి దాని కంటెంట్ ఉంటుంది. ఛానెల్ పెట్టుబడి మూడు కీలకమైన నియంత్రణల్లో ఉంటోంది. ఒకటి కుటుంబ యాజమాన్యం, రెండవది మీడియా ప్రొఫెషనల్స్ యాజమాన్యం, మూడో తరహా యాజమాన్యం త్వరలో ప్రవేశించనుంది. అదే విదేశీ యాజమాన్యం. మీడియా విశ్వసనీయతకు మూలం ఈ మూడు తరహా యాజమాన్యాలను బట్టి ఉంటుంది. విదేశీ యాజమాన్యం వచ్చిన తర్వాత ఈ విశ్వసనీయత గురించి, సామాజిక బాధ్యత గురించి మాట్లాడుకోవడానికేమీ మిగలదు.

ఈ రోజు అప్‌కంట్రీ ఛానల్స్‌లో రేటింగ్స్ యుద్ధం జరుగుతోంది. ఈ పోటికి విదేశీ ఛానల్స్ ఆజ్యం పోస్తున్నాయి. మల్టీనేషనల్ మీడియా జైంట్-స్టార్ మన దేశంలో స్టార్ న్యూస్ పేరిట వార్తా ఛానల్ పెట్టింది. మన దేశంలో మీడియాలో విదేశీ పెట్టుబడుల్ని 26 శాతం కంటే ఎక్కువ అనుమతించరు. కనుక స్టార్ వంటి విదేశీన్యూస్ ఛానల్స్ ఇక్కడి సంస్థల్ని పట్టుకుని పరోక్షంగా వాటిల్లో పెట్టుబడి పెడుతున్నాయి. ఆపై వాటి ఉమ్మడి వాటాని 74 శాతంగా చూపించి మరో 26 శాతం పెట్టుబడితో విదేశీ సంస్థలు న్యూస్ ఛానల్ నడుపుతున్నాయి. స్టార్‌న్యూస్ ఈ రోజు ఆజ్‌తక్‌తో పోటీగా వ్యూయర్‌షిప్‌ను తెచ్చుకుంటోంది. అందుకోసం ఆ ఛానల్ ఫిలింన్యూస్, క్రైమ్‌న్యూస్ మీద ఎక్కువగా ఆధారపడుతోంది. ఎంత భయంకరమైన అంశాలు చూపితే అంత వ్యూయర్‌షిప్ పైకి వెళ్తుంది. ఈ తరహా పోటీని విదేశీ మీడియా మన ఛానెళ్ల నెత్తిన రుద్దింది. మన మీడియా, కుటుంబ యాజమాన్యంలో ఉన్నా, ప్రొఫెషనల్స్ నియంత్రణలో ఉన్నా ఎంతో కొంత సామాజిక నిబద్ధత చూపిస్తోంది. సమాజంలో మార్పు కోసం, ప్రజాసమస్యల పరిష్కారం కోసం కొన్ని విలువలతో మన ఛానల్స్ పనిచేస్తున్నాయి. కానీ విదేశీ మీడియాకు లాభాలు సంపాదించడం తప్ప వేరే ప్రాధాన్యం, బాధ్యత ఉండదు. ఎక్కువ జనం చూసేలా చేయడం అందుకోసం సినిమాలూ, నేరాలూ, క్యాట్‌వాక్‌ల చుట్టూ వార్తలను తిప్పడం వారి లక్ష్యాలు. ఇటువంటి సంస్కృతే మిగిలిన వార్తా సంస్థల్లోనూ పెరిగే అవకాశం కన్పిస్తోంది. ఆఖరికి కేవలం వార్తల్నే ఆధారం చేసుకున్న ఆజ్‌తక్ లాంటి ఛానల్ కూడా ఈ దారిలో నడవాల్సి రావడమే అందుకు చిహ్నం. రేటింగ్స్ తగ్గితే తద్వారా యాడ్ రెవెన్యూ తగ్గితే అన్ని రకాలుగా వెనకబడాల్సి వస్తుందనే భయమే ఆ ఛానల్‌ను ఆ దిశగా మార్చింది. ఇది టిఆర్‌పి గేమ్.

ఇలా అన్ని కోణాల నుంచి చూస్తే ఛానెళ్ల కంటెంట్, అందులోని ప్రామాణికత, విశ్వనీయత ప్రధానం. వీటన్నింటికీ పెట్టుబడి ఎక్కడ నుంచి వస్తుంది, పోటిని ఎలా ఎదుర్కుంటాం అనే అంశాలమీదే విజయం ఆధారపడి ఉంటుంది. పెట్టుబడి లాభాలు కోరుకుంటుంది. లాభాలు రావాలంటే ప్రేక్షకులను ఆకర్షించాలి. ఉదాహరణకు వనభోజనాలు కులభోజనాలుగా మారుతున్న వైనానికి వ్యతిరేకంగా ఓ మేసేజ్ ఇస్తాం. కానీ అది ఒక ఛానెల్‌కు ఎంత రెవెన్యూ తీసుకువస్తుందనేది యాజమాన్యం వేసుకునే ప్రశ్న! కాబట్టి వార్తా ఛానళ్ల విశ్వసనీయత పెట్టుబడి స్వభావం మీద ఆధారపడి ఉంటుంది. పెట్టుబడి ఎక్కడి నుంచి వస్తుందో జాగ్రత్తగా గమనించాలి. విదేశీ పెట్టుబడి 26 శాతం మించి ఉండకూడదని నియంత్రించినా, స్టార్ న్యూస్ తన మార్గంలోనే మనదేశంలో నెం.1 న్యూస్ ఛానల్ అనిపించుకునేందుకు పోటీపడుతోంది. అలాంటప్పుడు పెట్టుబడిని నియంత్రించడం, దానికి నిబద్ధత జోడించడం ఎంతవరకు సాధ్యం? ప్రస్తుత మీడియా ఎంత వరకూ ఈ రెంటినీ సాధించగలిగిందనేది మనం జవాబు చెప్పుకోవాల్సిన ప్రశ్న. విదేశీ ఈక్విటీ పెరిగితే వాళ్లు పావలాకే పత్రిక అమ్ముతారు. అపారమైన పెట్టుబడి ఉంది గనుక అయిదేళ్ల పాటూ నష్టాలొచ్చినా ఆపై నెంబర్ వన్‌గా నిలబడగలుగుతారు. ఒక్కసారి నిలదొక్కుకున్నాక ఆ యాజమాన్యం ఇక తన ప్రయోజనాలకు అనుగుణమైన అంశాలనే ప్రచారం చేసుకుంటుంది. తను అమ్మదలుచుకున్న వస్తువులను అమ్ముతుంది. తనకు అనుకూలమైన ఫీలాసఫీని రుద్దే అవకాశం కూడా చాలా స్పష్టం.

'పెట్టుబడి' వనరుకూ, మీడియా విశ్వసనీయతకూ ఉన్న బలమైన సంబంధాన్ని స్పష్టంగా విశ్లేషించేందుకే ఈ వివారాలన్నీ పేర్కొనాల్సి వచ్చింది. పెట్టుబడి సమాజంలోని ఆర్థిక స్థితిగతులూ ఇవన్నీ కూడా వార్తలని, వార్తల విశ్వసనీయతని ఏ విధంగా ప్రభావితం చేస్తున్నాయనేది ప్రతి ఒక్కరూ పరిశీలించాల్సిన అంశం.

అయితే మనదేశంలో న్యూస్ ఛానల్స్ పరిస్థితి ఆశాజనకంగానే ఉంది. కొన్ని ఆఫ్రికన్ దేశాలలోనూ, వర్ధమాన దేశాల్లోనూ, లేని స్వేచ్ఛ మన దేశంలో ఉంది. ఇక్కడ పాత్రికేయులు సాక్షాత్తూ ముఖ్యమంత్రినీ, ప్రతిపక్షనేతనూ విమర్శించవచ్చు. వారిపై అవినీతి అరోపణలు చేయవచ్చు. దానివల్ల జర్నలిస్టుల ప్రాణాలకు ముప్పులేదు. చాలా దేశాల్లో ఆ పరిస్థితి లేదు. కనుక కుటుంబాలో, విదేశీ సంస్థలో కాకుండా పాత్రికేయ వృత్తిలో నుంచే సిఇవోలుగా, ప్రమోటర్లుగా ఎదిగిన వారు ఈ స్వేచ్ఛను ఉపయోగించుకుని విజయం సాధించాలి.

24 గంటల న్యూస్ ఛానళ్లు జర్నలిజంలో కొత్త చైతన్యం నింపాయి. అప్పటిదాకా నిస్సారంగా నిస్తేజంగా ఉన్న వార్తా పత్రికల ధోరణి మారింది. ఇది ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాల మధ్య అంతకు ముందు వరకూ లేని పోటీని కూడా తెచ్చింది. వార్తా పత్రికలు మర్నాడు ఏం ఆలోచిస్తాయో దాన్ని ఇరవైనాలుగు గంటల వార్తా ఛానళ్లు ఏ రోజు చరిత్ర ఆ రోజే నిక్షిప్తం చేస్తాయి. ఆ నిమిషం జరుగుతున్న సంఘటనను ఆ నిమిషమే చెప్తాయి. పరిణామాల దిశను నిర్దేశించగలగడం, మార్చగలగడం వార్తా ఛానల్స్‌కున్న అడ్వాంటేజ్. అనుదిన పరిణామాలపై ఎలక్ట్రానిక్ మీడియా ఎంతో కొంత కంట్రోల్ సాధించగలుగుతోంది. అయితే, ఇక్కడే ఓ కీలకమైన పాయింట్ ఉంది. ఆ విశ్లేషణ, ఆ పరిణామాలను ముందుకు తీసుకెళ్లడం అనేది సరైన ఉద్దేశంతో సరైన లక్ష్యాల కోసం సాగితేనే సమాజం ఏర్పడుతుంది. సరైన దిశలో ఏర్పడుతుంది.

అందుకని, విశ్వసనీయత మనం మన జర్నలిజంలో పెంచే ప్రొఫెషనలిజం మీదే ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. జర్నలిస్టులు ఎంటర్‌ప్రెన్యూర్లయిన రోజున, వార్తను మాత్రమే ఉపాధిగా మలుచుకున్న రోజున మీడియా విశ్వసనీయత మరింత పెరుగుతుంది. ◆

# తెలుగు ప్రచారమాధ్యమాలను నడిపేదీ, నడిపించేదీ...?

– కాశ్యప్

'పత్రికొక్కటున్న పదివేల సైన్యం' అన్న నార్లమాటలో అర్థం, అంతరార్థం తెలుగు మీడియా యాజమాన్యాలు మరోకోణంలో అణువణువునా వంటబట్టించుకున్నాయి. పాఠకుల మెదళ్లు కదిలించి, ఆలోచనా తరంగాలను సృష్టించి, చైతన్యబీజాలను నాటే కోణంలోనే నార్ల ప్రస్తావించారు. మన తెలుగు మీడియా యాజమాన్యాలు మాత్రం నిజంగానే సైనిక బలగంగా భావించి పత్రికలు, టీవీలు ఇతర ప్రసార మాధ్యమాలను నడుపుతున్నాయి. వ్యాపారంలో, రాజకీయ పార్టీలతో వియ్యాల్లో, స్వార్థంలో, పగ ప్రతీకారంలో, ఆశ్రిత పక్షపాతంలో ఎక్కువ తక్కువలే తప్ప ఇప్పుడున్న తెలుగు మీడియాలో తులసీదళాలను వేరు చేయడం అంత సులభమైన పనికాదు.

సమాజానికి మూడు మూలస్తంభాలైన శాసన, పరిపాలన, న్యాయవ్యవస్థలకంటే ఫోర్త్ ఎస్టేట్‌గా మీడియాకున్న విలువ మామూలుది కాదు. కానీ మీడియా యాజమాన్యాల ధోరణితో ఆ విలువలను కొలిచే తూనిక రాళ్లు ఇప్పుడు పాఠకులు, ప్రేక్షకులు ఎవరికి వారు తయారు చేసుకోగలుగుతున్నారు. సమాజం కులాల కార్చిచ్చుతో రగిలిపోతుందని బాధపడే బుద్ధిజీవులకు మీడియా కులపోరాటం కూడా కళ్లు మూసుకున్నా కనిపిస్తూనే వుంది. దశాబ్దాల తరబడి ఎటువంటి మైల అంటని తెలుగు అక్షరానికి – పత్రికను పచ్చడిని ఒకేరకంగా అమ్మాలనే కొత్త మార్కెట్ సూత్రాన్ని అన్వయించేసరికి జర్నలిజం విలువల వలువలు వాటంతటవే ఊడిపోయాయి.

**బాబిజం**

సినీ ఎన్టీఆర్ వేగానికి తోడుగా పత్రిక సర్క్యులేషన్ పెరగడం ఒక చారిత్రక సందర్భమే కావచ్చు కానీ, వ్యాపార, కుల మత ప్రాంతీయాభిమానులు మాత్రం లేనే లేవని ఎవరైనా అంటే అంతకంటే మూర్ఖత్వం మరొకటి వుండదు. అదే ఎన్టీఆర్ రెండో భార్య మోజులో, అజ్ఞానంలో మీడియా మొగల్‌ను తోసి రాజనే సరికి తార్కిక సూత్రాలతో నిమిత్తం లేకుండా హైదరాబాద్ వైస్రాయ్ హోటల్లో చంద్రబాబుకు విధేయత ప్రకటించే సంఖ్యాబలం నిమిష నిమిషానికి అనూహ్యంగా పెరగసాగింది. ప్రజాభిప్రాయానికి వేదికగా ఉండాల్సిన అక్షరం అభిప్రాయాన్ని ప్రజలమీద రుద్ది, అదే నిజమని నమ్మించే అభిప్రాయ తయారీ ఫ్యాక్టరీగా మారిపోయింది. తిరుగులేని ఎన్టీఆర్ ప్రజాదరణ సోపానాల మీద ఎదిగిన ఒక అక్షరం, అదే ఎన్టీఆర్ మీద చెప్పులు పడే దాకా నిద్రపోలేదు. అంతదాకా అభిప్రాయాల తయారీ ఫ్యాక్టరీగా వున్న అక్షరానికి ఒక్కసారిగా ప్రభుత్వాలను మార్చగలిగే వ్యవస్థగా తనను తాను చూసుకోవాల్సిన రాజగురుతరమైన బాధ్యత మీదపడింది. ఇక ఆడింది ఆట. పాడింది పాట.

లేస్తే శ్రమదానం, కూర్చుంటే జన్మభూమి. గాలి పీలిస్తే ప్రజల వద్దకు పాలన. గాలి వదిలితే పచ్చదనం–పరిశుభ్రత. చేతులు కడిగితే నీరు–మీరు. గోటితో గీకితే ఇంకుడు గుంతలు. ఊ అంటే వీడియో కాన్ఫరెన్సులు. ఊహు అంటే లైవ్ టెలీకాస్టులు.

ఫైబర్ ఆప్టిక్ గొట్టాల్లో స్వర్ణాంధ్ర కలల తీరాల వెంబడి దర్శకేంద్రుడి కాన్సెప్ట్‌లు తెరలు తెరలుగా బుల్లితెరలను చీల్చి చెండాడాయి. తెలుగు సినీ మీగడ తరగ మొత్తం పచ్చదనం పులుముకోవడంలో పరవశించిపోయింది. దేశ దేశాల్లో బాబు ఖ్యాతి ఉషోదయ కిరణాల్లా వెలుగుతూనే వుండడానికి తెలుగు మీడియా అక్షరం పడ్డ పాట్లను రాస్తే మహా భారతానికంటే పెద్ద గ్రంథమే అవుతుంది. 18 అధ్యాయాలు ముందు మాటకు కూడా చాలవు. తాజాగా రాజశేఖర్ రెడ్డి కాలాన్ని ఫోటో తీయించడానికి బాబు చెబితే తెలుగుదేశం ఎం.పి. బెంగుళూరు నుంచి హెలీకాప్టర్ పంపితే, ఆ ఫోటో తెలుగు అక్షరానికి జత కావడం దాకా రాయాలంటే ఎన్ని వేల అధ్యాయాలవుతాయో? ఎన్ని లక్షల పేజీలవుతాయో ఊహించడం కష్టం.

ఇంకుడు గుంతలతో నరసాపురం నడివీధిలో నీళ్లు ఎగజిమ్ముకుని వచ్చే రంగు రంగుల దృశ్యాలు, ఒకేరోజు అనేక శ్రమదానాలు ఉక్కిరిబిక్కిరి అయ్యేసరికి శ్రీవారు కళ్లు తిరిగి తూలిపడబోయే, పడే, పడిన, అనంతర దృశ్యాలు, అమెరికాలో నవయువ్వనితో సరససల్లాపాలాడి, సాక్ష్యాధారాలతో దొరికి, తప్పు ఒప్పుకుని లెంపలేసుకున్న బిల్‌క్లింటన్ మన మహావీర్ ఆసుపత్రి గదిలో బాబు వారితో ఏకాంతంగా మాట్లాడినప్పుడు మరో ప్రపంచ నిర్మాణానికి ఎలా ఇటుకలు పేర్చాలోనని జరిగిన చర్చ, ఎసీ సౌండ్ వారి ఏకాంత మరో ప్రపంచ నిర్మాణ చర్చకు భంగం కల్గిస్తుండగా స్వయంగా క్లింటనే ఏసీ స్విచాఫ్ చేసినప్పుడు బాబుకు కలిగిన ఆశ్చర్య, అద్భుత, పరవశ, అమితానంద, అలౌకిక పారమార్థిక స్థితిని బాక్సులు, బాక్సులుగా తెలుగు అక్షరం ముద్రించి చరితార్థమైంది.

**సారాయిజం**

తెలుగు అక్షరం తనకు తానుగా భుజాన వేసుకున్న సామాజిక ఉద్యమాల్లో సారా లేక మద్యనిషేధం ఒకటి. సమాజాన్ని పట్టి పీడిస్తున్న దుర్వ్యసనంగా మద్యపానాన్ని తిరస్కరించాల్సిందే. నిషేధించాల్సిందే. ఇందులో ఎవరికీ అభ్యంతరాలుండాల్సిన అవసరం లేదు. అయితే తెలుగు అక్షరం సారా ఉద్యమాన్ని నిర్వహించిన తీరు, దూబగుంట రోశమ్మలను, వావిలాలలను హైజాక్ చేసిన పద్ధతి, ఉన్నాలేకున్నా ఉద్యమాన్ని చిలవలుపలువలు చేసి జనం కాంగ్రెస్‌ను కాలరాసి, ఎన్టీఆర్‌కు బ్రహ్మరథం పట్టడానికి వీలుగా అక్షరం పలికిన 'అశ్వత్థామ హతః కుంజర'లు లెక్కలేనన్ని. పోనీ ఒక సామాజిక పరివర్తనకు, సన్మార్గానికి నాలుగు అబద్ధాలు బొంకినా నష్టం లేదనుకుని నోరుమూసుకోవచ్చు. మద్యనిషేధానికి నారావారు మంగళం పాడిన వెనువెంటనే 'సరైన సమయంలో సరైన నిర్ణయం' శీర్షికతో సంపాదకీయమే తాటికాయంత అక్షరాలతో వస్తే ఏమనుకోవాలి? సాధారణ పరిపాలన శాఖ జి.ఎ.డి. నుండీ ఎప్పటికప్పుడు ప్రభుత్వ ఉత్తర్వులు ఫిలింసిటీకి క్రమం తప్పకుండా వెళ్లడం ప్రత్యర్థి వార్తాపత్రిక పతాక శీర్షికలో వేసే దాకా అమాయక పాఠక జనానికి తెలీనే తెలీదు.

**శాడిజం**

1999 ఎన్నికల్లో సోనియాగాంధీ పౌరసత్వ వివాదం మీద అంతకంటే పచ్చిగా రాయడానికి వీల్లేనంతగా అక్షరం దిగజారినా, 1999, 2000 ఎన్నికలకు ముందు పి.జె.ఆర్., వై.ఎస్.ఆర్.లను వీథి రౌడీల్లా చిత్రీకరించడానికి పడరాని పాట్లు పడినా, కమ్యూనిస్టు గతితార్కిక భౌతిక వాదాలకు నీళ్లొదిలి కార్గిల్ సైనికుల ఆత్మబలిదానాల మీద సానుభూతి ఓటు బ్యాంకు సృష్టికి ప్రయత్నించినా, ఇంకా సాధారణ సభ్యతా సంస్కారాల వల్ల చెప్పడానికి, రాయడానికి వీల్లేని అనేక అనైతిక వార్తా, వ్యాసాల సృష్టి జరిగినా అంతా బాబుకోసం లేదా బాబు లేని తనకోసం.

అలిపిరి దాడిలో చేతికి కట్టు ఉన్నా మొదటి రెండ్రోజులు జనం తండోపతండాలుగా వచ్చి సానుభూతిని కుండల్లో కుమ్మరించలేక పోవడంతో దిగులు పడ్డ తెలుగు తేజం చానెల్ చేసిన విన్యాసాలు మామూలు వారికి తెలియక పోవచ్చుకానీ, మెదడు పనిచేసే వారికి వెంటనే అర్థమయ్యాయి. ప్రతిపక్షనాయకుడు వై.ఎస్.తో ఒకరోజంతా తిరిగి వి.ఐ.పి.తో ఒకరోజని టెలికాస్ట్ చేస్తామని చెప్పి, అలాంటి కార్యక్రమం షూట్ చేయడానికి చంద్రబాబుకు టైం లేకపోవడంతో వై.ఎస్.తో ఒకరోజు ప్రొగ్రామ్ క్యాసెట్‌ను చుట్టచుట్టి అవతల పడేసి స్వామిభక్తితో పరవశించిన తెలుగు తేజం ఆనందతాండవంలో ఇలాంటివి ఎన్నో మైలు రాళ్లు.

మొన్నటికి మొన్న స్థానిక సంస్థల ఎన్నికల్లో పార్టీల బలాబలాలపై సర్వే ఫలితాలు చూడండంటూ నాలుగు రోజుల పాటు ప్రకటనలు ప్రసారం చేసి, కాంగ్రెస్‌కు స్పష్టమైన ఆధిక్యం అంటూ వార్తల్లో హెడ్‌లైన్ కూడా వచ్చినా, ఆ బులిటిన్‌లో ఆ వార్త మాత్రం లేకపోవడానికి కారణాలేమిటో ఆ ఛానెల్‌వారే చెప్పాలి.

నామమాత్రంగా మినహాయింపున్నా తెలుగుమీడియాను నడిపేదీ, నడిపించేది ఎవరో ఇన్నాళ్లూ మీడియా వారికి మాత్రమే తెలుసు. ఇప్పుడు అందరికీ తెలుసు.

**చీకటి అక్షరాల మార్గదర్శనం**

ఆఫ్టరాల్ ఒక ఎం.పి. ఉండవల్లి అరుణ్‌కుమార్ అక్షరాలా దురుద్దేశంతోనే మార్గదర్శిపై అభాండాలు వేశారు. ఉండవల్లి ఆరోపించిన మరుక్షణం నుండీ మార్గదర్శి కౌంటర్లలో కట్టలకు కట్టల నోట్లతో డిపాజిట్లు కడుతుంటే నమ్మకం కోట క్షణక్షణానికి బలపడుతుండడం చూసి తెలుగు సమాజం పులకించిపోయింది. తెరలుతెరలుగా ఆ దృశ్యం మన సొంత టీవీలో చూస్తుంటే ఉండవల్లికి దేహశుద్ధి చేయాలన్నంత కసి పెరిగింది ప్రేక్షకులకు. లోకోత్తర ఆదర్శాల లోక్‌సత్తా జయప్రకాశ్ నారాయణ్, వెంకయ్య నాయుడు, చంద్రబాబు నాయుడు, ఎర్రంనాయుడు, బి.వి.రాఘవులు, నారాయణ, ఫిలింసిటీని నాగళ్లతో దున్నిస్తానన్న కె.సి.ఆర్. ఇలా ఊరూపేరూ ఉన్నవారు లేనివారు మార్గదర్శిని వేనకేసుకు రావడంలో పోటీలు పడ్డారు. ఆర్.బి.ఐ. నోటీసులతో డీలా పడ్డారు. నాలుక కరుచుకున్నారు. జయప్రకాశ్ ప్రశ్చాత్తాపపడ్డారు.

ఇంతా చేస్తే నమ్మకం కోటలుకోటలుగా దుర్భేధ్యంగా ఉందని ప్రకటించుకున్న మార్గదర్శి కాస్తా మీరేమిటి చెప్పేది. మాకు మేమే సెప్టెంబరు 16కు ముందే డిపాజిట్లు తీసుకోవడం మానేశాం అంటూ పాతివ్రత్యానికి అక్షరాల రంగు పులిమి కథలుకథలుగా చెప్పుకొచ్చారు. నోట్లకట్టల డిపాజిట్లు మార్గదర్శి కౌంటర్లలో కనపడింది ఏరోజున? డిపాజిట్లు ఆపేసినట్లు చెబుతున్న తేదీ ఏదీ? ఏది ముందు- ఏది వెనక అని కనీస జ్ఞానంతోనైనా తెలుగు సమాజం ఆలోచించే పరిస్థితిలో లేదని తెలుగు అక్షరం అనుకుంటూ వుందేమో పాపం!

తప్పులు-ఒప్పులు; నీతి-నిజాయితీ; రాగ-ద్వేషాలు; పగ-ప్రతీకారాలు ఇలా అనేకానేక అంశాలపై తాత్విక పునాదుల లోతుల నుండీ చర్చించే తెలుగు అక్షరానికి రాకూడని జబ్బు వచ్చింది. కొన్ని వ్యవస్థలను అనడానికి ఎవరైనా కొంత సందేహిస్తారు. సొంత ఆస్తులు, సొంత భూముల దాకా వచ్చేసరికి తెలుగు మీడియా అక్షరాన్ని కులం, మతం, ప్రాంతం, పార్టీ, రాగద్వేషాల కళ్లతో చూస్తేనే తత్వం బోధపడుతుంది. చెప్పేవి... చేసేది... శకునం చెప్పే బల్లి... తెలుగు అక్షరానికి పచ్చకామెర్ల వ్యాధి నయమయ్యే దాకా ఓపిక పట్టాల్సిందే. ◆

# మీడియా వ్యాపారం- విశ్వసనీయత-కొన్ని విషయాలు

– సందేశ్

భారత దేశంలో మీడియా భారీ వ్యాపార రంగంగా విస్తరించడం, దాని విశ్వసనీయతపై చర్చ ముమ్మరం కావడం పరస్పరం సంబంధం లేని విషయాలు కావు. దేశాభివృద్ధిలో మీడియాది కీలకపాత్ర(గ్రోత్ ఇంజిన్) అని పాలకులు అభివర్ణిస్తున్న సమయంలోనే మరోపక్క విశ్వసనీయత సన్నగిల్లుతున్నది అనే వాదనలు కూడా వినిపిస్తున్నాయి. ఈ గ్రోత్ ఇంజిన్ గ్రోత్‌లో కొట్టొచ్చినట్టు కనిపించే అంశం టీవీ. కనుక టీవీనే ప్రధాన లక్ష్యంగా ఉంటున్నది. పదాల కన్నా దృశ్యాల ప్రభావం అందులోనూ కదిలే దృశ్యాల ప్రభావం ఎక్కువ. శక్తిని బట్టి బాధ్యత పెరుగుతుంది. కాబట్టి అది మరింత బాధ్యతాయుతంగా ఉండాలనే వాదన వినిపిస్తున్నది– సహజంగానే. ట్రయల్ బై మీడియా, ఇంటర్ ప్రిటేటివ్ జర్నలిజం, ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం, మీడియా ఎథిక్స్, వగైరా పదాలు ఎక్కడ బడితే అక్కడ ఎలా పడితే అలా వినిపిస్తున్నాయి. ఈ చర్చ ఈ స్థాయిలో జరగడానికి కారణం సివిల్ సొసైటీలో మీడియాపై ఉన్న ముందస్తు భావనలు, లేదా అంచనాలు. అది కాపలా దారు పాత్రలో ఉండడం లేదా కాపలాదారు పాత్రని తనకి తాను ఆపాదించుకుని ఉండడం వల్ల ఈ అంచనాలు రూపొందాయి. సహజంగానే కాపలాదారు మీద దృష్టి ఎక్కువగా ఉంటుంది. కంచే చేను మేస్తే ఎలా అన్నట్లున్నమాట! రాజకీయనాయకత్వం లాంటి, అధికార యంత్రాంగం లాంటి వ్యవస్థీకృత రంగాలు చాలావరకు విలువలను కోల్పోయాయి. ఇప్పుడు దృష్టి మీడియా మీద, జ్యుడీషియరీ మీద ఉంది. ఈ రెండు రంగాల్లోనూ వాటి ఫలితాలు తప్ప వాటి వెనుక సాగే పరిణామాలు(ప్రాసెస్) సువిశాల ప్రజానీకానికి చిరపరిచితమైన వ్యవహారం కాదు. కాబట్టి కొంత మాయ మిగిలే ఉంటుంది. ఇపుడీ మాయ కదలబారుతోంది. వ్యవస్థ గౌరవాన్ని కాపాడాలని కోరుకునే వారు 'యూటూ బ్రూటస్' అంటూ ఆశ్చర్యాగ్రహాన్ని వ్యక్తపరుస్తున్నారు.

మీడియా సత్యమునే ప్రవచిస్తుందని, కొన్ని విలువలకు కట్టుబడి ఉంటుందని కొన్ని అంచనాలైతే స్థిరపడి ఉన్నాయి. 'పేపర్లో కూడా పడింది' అనేమాట ఒకనాడు తరచుగా వినిపించేది. అచ్చులో కనిపించేదేదైనా సత్యమనుకునే సత్తెకాలపు భావన అది. భారతదేశంలో పత్రికల ప్రస్థానం కూడా ఈ గౌరవాన్ని ఎంతో కొంత కాపాడుకుంటూ వచ్చింది. తొలి పత్రిక బెంగాల్ గెజిట్‌ను స్థాపించిన చార్లెస్ హిక్కీ 'ఓపెన్ టు ఆల్, ఇన్‌ఫ్లుయెన్స్‌డ్ బై నన్' అని గట్టిగా అచ్చువేసి చెప్పుకున్నారు. అనేక ఇబ్బందుల పాలైనా తానెన్నుకున్న దారి నుంచి పక్కకు తప్పుకోలేదు. ఆంధ్రదేశంలో కూడా తొలి పత్రికల ప్రస్థానం అదే విధంగా ఉంది. స్వాతంత్ర్యోద్యమ కరదీపికలుగా ఉపయోగపడిన చరిత్ర ఉంది. 'తెల్లవారిని తుపాకులతో కాల్చుట' వంటి రాడికల్ రాతలు రాసి ముట్నూరి కృష్ణారావు వంటి వారు జైలు కెళ్లిన చరిత్ర ఉంది. అలాగే నాటి సుజనరంజని, భారతి, గోలకొండ దగ్గర్నుంచి ఇవ్వాల్టి అనేకానేక సాహిత్య పత్రికలు భాషాభివృద్ధికి, సాహిత్యకృషికి అంకితమయ్యాయి. అంటే పత్రికల ప్రయాణం వ్యాపారమే లక్ష్యంగా మొదలవలేదు. తర్వాత వ్యాపారమయమైనా నడిచివచ్చిన దారిలో నెలకొన్న కొన్ని విలువలు ఎంతో కొంత మిగిలిఉండడానికి ఆస్కారముంది. ఈ తంతు పూర్తిగా మారి మొత్తంగానే మీడియా ఒక షిఫ్ట్ తీసుకున్నది, పూర్తి వ్యాపారయుగంలోకి అడుగుపెట్టింది 1990ల తర్వాతే. దేశ ఆధునిక చరిత్రలో అత్యంత కీలకమైన ఘట్టాలనేకం ఇదే కాలంలో మొదలయ్యాయి. సరళీకరణ విధానాలు, ఆర్థిక ప్రపంచీకరణ ప్రక్రియ, ప్రైవేట్ శాటిలైట్ ఛానళ్ల విస్ఫోటం అన్నీ ఇక్కడే ఆరంభమయ్యాయి. దేశ చరిత్రలో మరో కీలక ఘట్టం బాబ్రీమసీదు విధ్వంసం కూడా. ఏ రంగం గురించి మాట్లాడుకున్నా 90లకు ముందు ఆ తర్వాత అని చర్చించుకోవాల్సినంత కీలకమైన పరిణామాలనేకం ఉన్నాయి.

మీడియా విశ్వసనీయతపై అంతకు ముందు అసలు చర్చే లేదా అంటే ఉంది. కానీ దాని దశ దిశ వేరు. అంతకు ముందు కూడా 'పెట్టుబడికి, కట్టుకథలకు పుట్టిన విషపుత్రికలు పత్రికలు' అని రాడికల్‌గా శ్రీశ్రీ లాంటి వారు నిందించిన చరిత్ర ఉంది. జాతీయ స్థాయిలో కూడా కొన్ని వివాదాలు ఉన్నాయి. కానీ అవి ఎక్కువగా భావజాల పరమైనవి. 1955 ఎన్నికల సందర్భంగా నార్లవేంకటేశ్వరరావు నేతృత్వాన ఆంధ్రప్రభ, పండితారాధ్యుల నాగేశ్వరరావు నేతృత్వాన ఆంధ్రపత్రిక సాగించిన పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం, 70ల్లో గోయెంకా పత్రిక ఎక్స్‌ప్రెస్ ఇందిరా కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా సాగించిన ప్రచారం వంటి అంశాలున్నాయి. వాటి లోటుపాట్లున్నాయి. నార్ల వేంకటేశ్వరరావు గారి భావజాల ప్రదర్శనను పక్కనబెడితే ఇతరత్రా ఆయన పాత్రికేయ వృత్తిపరమైన నిబద్ధతను ఎవరూ వేలెత్తి చూపిన దాఖలాలు లేవు.

రెండో పార్శ్వం యజమానికి ఇతరత్రా వ్యాపారాలు ఉండడం, వాటి అభివృద్ధికి పత్రికను వాహికగా వాడుకోవడం. అమృతాంజనం–ఆంధ్రపత్రిక జోడీ తెలుగువారికి సుపరిచితమే. ఆ జోడీ మీద ఉన్న జోకులు కూడా సుపరిచితమే. కానీ ఈ వ్యవహారం స్థాయి కూడా వేరు. తర్వాత ఇది రకరకాల రూపాలు తీసుకుని ఇతరత్రా వ్యాపారాల్లో లొసుగులను కప్పిపుచ్చుకోవడానికి పత్రికను వాడుకోవడం, బెదిరింపు రాజకీయాలకు పాల్పడడంగా రూపాంతరం చెందింది. టైమ్స్ ఆఫ్ ఇండియా–దువా ఉదంతాన్ని గాని, నేడు మనరాష్ట్రంలో జరుగుతున్న పరిణామాలను గానీ ఇదే నేపథ్యంలో చూడాల్సి ఉంటుంది.

మూడోది తన చేతుల్లో ఉన్న మీడియాను యజమానులు అధికారసాధనంగా వాడుకోవడం దాని ద్వారా ఇతరత్రా ప్రయోజనాలు సాధించుకోవడం. రాజకీయ పదవులు, ప్రత్యేక ఆర్థిక మండళ్లు దగ్గర్నుంచి పాలకులను గుప్పెట్లో పెట్టుకుని ఆడించాలనుకోవడం దాకా. అయితే ఈ మూడు ధోరణుల పాత్ర ఇవాళ జరుగుతున్న విశ్వసనీయతా చర్చలో స్వల్పమే. మన రాష్ట్రంలో సాగుతున్న పరిణామాలను

చూసినపుడు ఇవే ఎక్కువ ప్రాధాన్యం అనిపించొచ్చు. అది ఒకరకంగా 'మా కానిస్టేబుల్‌ను మారుస్తారా లేదా' అని కన్యాశుల్కంలో బండివాడు అడిగే ప్రశ్నలాగా ప్రాధాన్యం కలిగిందే. కానీ ఇవాళ దేశవ్యాప్తంగా జరుగుతున్న చర్చ దీనికంటే విస్తృతమైనది. దాని కోణం వేరు. జర్నలిజంలోని అన్ని విలువలను సంప్రదాయాలను వ్యాపారం(కార్పోరేట్ మీడియా) మింగేస్తున్నందున వినిపిస్తున్న ఆక్రందనలవి.

ఏ రంగాన్నైనా అందులోని లక్షణాలను పూర్తిగా తీసివేసి అభాస చేయగలిగిన శక్తి మార్కెట్‌కు ఉన్నట్టుగా మరి దేనికి లేదు. అది క్రీడలు కావచ్చు. సంస్కృతి కావచ్చు. భాష కావచ్చు. పండుగలు కావచ్చు. మీడియా కూడా కావచ్చు. 90'ల తర్వాత సామాజిక జీవనం రూపు రేఖలు మార్చుకుంది. మనిషి స్థానాన్ని కొనుగోలు దారు ఆక్రమించుకుంది. 'ఐ థింక్ దేర్‌ఫోర్ అయామ్' కాస్తా 'ఐ కన్జ్యూమ్ దేర్‌ఫోర్ ఐయామ్'గా మారిపోయింది. ఈ కుదుపు అన్నింటికన్నా పెద్దది. మీడియా వరకే వస్తే ప్రైవేట్ శాటిలైట్ ఛానళ్ల పాత్ర ఇందులో కీలకం. రేడియో సంగతి కాసేపు పక్కన బెడదాం. అదింకా ప్రభుత్వ రంగంలోనే ఉంది(వార్తల వరకూ) కాబట్టి దాని తాలూకు వృత్తినైపుణ్య రాహిత్యం, తప్పనిసరి తద్దినాలతో పాటు దానితో పాటే వచ్చే బాధ్యత కూడా ఉంటుంది. అది మరీ వృత్తినైపుణ్యాన్ని పెంచుకోలేదు. అలాఅని మరీ విశృంఖలంగానూ ఉండదు. కొంతవరకూ నయమే. నెహ్రూ మిశ్రమ ఆర్థిక విధానం లాగా అన్న మాట!

దేశంలో ప్రైవేట్ శాటిలైట్ ఛానళ్లు అడుగుపెట్టిందే వ్యాపారయుగంలో. పత్రికల్లో ఎక్కడో లోపలిపేజీల్లో ఉండే వ్యాపార వార్తలు మొదటి పేజీలను ఆక్రమించడం, ఫిక్కీ తదితర సంస్థలు, సెన్సెక్స్ సంబంధిత వార్తలు పతాక శీర్షికలకు ఎక్కడం మొదలైన దశలోనే మన దేశంలో శాటిలైట్ ఛానళ్లు అడుగుపెట్టాయి. టైమ్స్ ఆఫ్ ఇండియా టాబ్లాయిడ్ ఆఫ్ ఇండియా(టిఓఐ)గా రూపాంతరం చెంది మిగిలిన పత్రికలకు మార్గదర్శకం చేస్తూ ఉండిన దశ అది. ఒక విధంగా ఛానళ్ల ఏర్పాటుకు ముందే ఇలాంటి పునాది ఒకటి సిద్ధమై ఉండింది. టెలివిజన్ 'ప్రకటనకర్తలకు ప్రేక్షకులను సమకూర్చి పెట్టు సాంకేతిక సాధనం' అనే స్పష్టత చక్కగా ఉంది. ఇది ఫక్తు వ్యాపారం అనే స్పష్టత ఎంచక్కా ఉంది. వారసత్వంగా వచ్చిన విలువలు, సంప్రదాయాలు వంటి భారమేమీ లేదు. దానికి తోడు ప్రెస్ కౌన్సిల్‌లాగా నియంత్రణ, మార్గదర్శనం చేసే సంస్థాగత ఏర్పాట్లు వంటివేమీ లేవు. పూర్తి స్వేచ్ఛ. బాధ్యత విషయానికి వస్తే ఒకటే బాధ్యత. సాధ్యమైనంత త్వరితగతిన సాధ్యమైనంత ఎక్కువగా లాభాలు ఆర్జించుట. వ్యాపారం అంటే నేరుగా అది సంపాదించే డబ్బు మాత్రమే కాకపోవచ్చు. దీని ద్వారా సంపాదించుకోగలిగిన అధికారం కూడా కావచ్చు. అలా అని వ్యాపారంలో అసలు విలువలే ఉండవని చెప్పబోవని చెప్పబోవట్లేదు. కాకపోతే ఆ విలువలను వ్యాపారమే నిర్ణయిస్తుంది. అలాగే మార్గదర్శన సంస్థల వంటివి లేకపోవడం వల్ల సంస్థాగతమైన విలువలు, సెన్సిబిలిటీస్ స్థానంలో ఛానళ్లను నిర్వహించే వ్యక్తుల విలువలు, సెన్సిబిలిటీస్ మాత్రమే ప్రధాన పాత్ర పోషించే పరిస్థితి ఏర్పడింది.

సూటిగా చెప్పుకుంటే ఇవాళ టీవీ మీడియా విశ్వసనీయతా చర్చకు ప్రధానంగా మూడు కారణాలు కనిపిస్తున్నాయి. ఒకటి అడ్డదారులు. రెండు అవినీతి. మూడు అజ్ఞానం. మీడియా అనేది ఫక్తు వ్యాపారం అని ముందుగానే చెప్పేసుకున్నాం కాబట్టి ఇక వ్యాపారంలో లాభాలు ఆర్జించడం ఎట్లా అనేది తదుపరి అంకమవుతుంది.. పైగా వార్తా వ్యాపారం! కేవలం డ్రైన్యూస్‌తో ఉన్నదున్నట్టు చెప్పడం లాంటి "పాతకాలపు" వ్యవహారాలతో టెలివిజన్ రేటింగ్ పాయింట్స్(టిఆర్‌పి) సాధించడం కష్టమైన విషయం. కాబట్టి రేటింగ్స్ పెంచుకోవడానికి వార్తలను ఎంటర్‌టైన్‌మెంట్ స్థాయికి చేర్చాలి. ఒక సారి ఆ నిర్ణయానికి వచ్చాక దారి సులువే. మన బాలీవుడ్, టాలీవుడ్ దానికి దారులు స్పష్టంగా చూపే ఉన్నాయి. ఇది ఫార్ములా వన్. మానవ సహజాతాలతో సంబంధమున్న అంశాలను ఎత్తి చూపిస్తే సరి! సెక్స్ అండ్ క్రైమ్. మొదటి దాని వినియోగం ఎలా ఉంటుందో చూద్దాం. ఏదో ఒక పట్టణంలో ఇంటర్‌నెట్‌లో అశ్లీల చిత్రాలను చూస్తున్నారు. అసలు ఇంటర్‌నెట్ వ్యాపారమే ప్రధానంగా పోర్నోసైట్స్ ఆధారంగా జరుగుతున్నది. అది ప్రపంచానికంతకూ తెలిసిందే. కానీ మనమేం చేస్తాం. దీన్ని తవ్వి వెలికితీస్తాం. హైదరాబాద్‌లోని ఫలానా ఇంటర్‌నెట్ కేఫ్‌లో అశ్లీలచిత్రాలు–చెడిపోతున్న యువత...తొలిరోజు స్టోరీ. ఆరోజలా నడిచిపోతుంది. రెండో రోజు–హైదరాబాద్‌లోనే కాదు, వైజాగ్‌లోనూ అదే తంతు. అవే దృశ్యాలు రిపీట్. మూడోరోజు...రాష్ట్రమంతటా అదే స్థితి–మహిళా సంఘాల ఆందోళన. అవసరమైతే మహిళా నాయకురాళ్లతో చర్చ. (స్ప్లిట్ స్క్రీన్‌తో తెరను రెండుచేసి మళ్లీ అవే దృశ్యాలు. నాలుగో రోజు... రాష్ట్రవ్యాప్తంగా అధికారుల దాడులు. ఐదోరోజు–చెడిపోతున్న యువతపై స్పెషల్ స్టోరీ (అవే మసాలా దృశ్యాలు అని ప్రత్యేకంగా చెప్పుకోనక్కర్లేదు). వారం రోజుల పాటు రేటింగ్స్‌ను కాపాడుకోవచ్చు. ఇది క్లుప్తంగా ఫార్ములా. ఈ ఫార్ములాతో ఇలాంటి మసాలా వార్తలను ఎన్నైనా సృష్టించుకోవచ్చు. ఏ యూనివర్శిటీ హాస్టల్‌లో నైనా ఎంఎంఎస్‌ల ద్వారా బూతు చిత్రాలు పంపుకునే విద్యార్థులు పుష్కలంగా కనిపిస్తారు. మొదటి రోజు...ఫలానా వర్శిటీ–చెడిపోతున్న విద్యార్థులు, రెండో రోజు...ఫలానా యూనివర్శిటీలో కూడా, మూడోరోజు, నాలుగోరోజు, ఐదోరోజు–పై ఫార్ములాను మీరే అన్వయించుకోగలరు. రికార్డింగ్ డ్యాన్సుల్లో బూతు, దేవాలయాల సత్రాల్లో వ్యభిచారం...ఇలా రెడీమేడ్‌గా ఎప్పటికప్పుడు సృష్టించుకోగలిగిన వార్తలు అనేకం. సాధ్యమైనంత వరకూ దృశ్యాన్ని చూపే ప్రయత్నం చేయడం చూపించడానికి మరీ మొహమాటంగా ఉన్న చోట అనంతర ప్రక్రియను కూడా ప్రేక్షకుడు ఊహించుకునే విధంగా చూపించగలగడం ఇందులో ప్రధానం. బొమ్మను పూర్తిగా కప్పివేసే మొజాయిక్ లాంటివి పైన వేయకుండా బొమ్మ బాగా కనిపించే విధంగా గ్లాస్ వేస్తే ఎఫెక్ట్ వస్తుందన్న మాట! ఇదంతా పక్కా ప్రొఫెషనలిజంతోనే సాగుతుంది. ఉదాహరణకు విద్యార్థుల ర్యాగింగ్‌లో రేప్ ఉదంతం తీసుకుందాం. మగవాడిమీద మగవాడి అత్యాచారానికి సంబంధించి బయలాజికల్ ఆసక్తి చాలా ఉంటుంది. మగవాడిమీద మగవాడు ఎలా.... అనే ఆసక్తిని తీర్చే విధంగా సచిత్రంగా వివరిస్తూ మనం ప్రేక్షకుల జ్ఞానాన్ని పెంచుతామన్నమాట. జ్ఞానమనేది మరీ ఒక్కరోజులోనే వచ్చేయదు కాబట్టి నాలుగు రోజుల పాటు అదే విషయాన్ని వివిధపద్ధతుల్లో చూపుతాం. ఓ తల్లి ఆత్మహత్య చేసుకుని చస్తుందా! ప్చ్, వి కాంట్

హెల్ప్ మ్యాన్..యునో..వికాంట్ హెల్ప్. మా పని మేం చేయాలి కదా!

ఈ ఫార్ములాలోని మరో అంశం క్రైమ్. ఇది కూడా తెలుగు చలన చిత్ర నిర్మాతలు 75 ఏళ్ల సుదీర్ఘ కృషితో వారసత్వంగా అందించినది. నేరాలను, ఘోరాలను డ్రమెటైజ్ చేసి మళ్లీ చిత్రీకరించి మరింత సుబోధకంగా వివరించుట. ఇక్కడ కూడా ఎఫెక్ట్ కోసం ఉత్కంఠ రేపే గొంతును అరువుకు తీసుకోవచ్చు. పాత సినిమాలో విలన్ లాంటి ఎర్రెర్రని కళ్ల యాంకర్‌ను ఏర్పాటు చేసుకోవచ్చు. నేరాల గురించి ఇంత కన్నా వివరణ అనవసరం. కరీంనగర్‌లో ఒక మనిషి బిల్డింగ్‌పై నుంచి దూకి ఆత్మహత్యచేసుకోవడాన్ని మన చానళ్లు స్టెప్ బై స్టెప్ పదే పదే చూపిస్తూ పండుగచేసుకుంటున్న రోజు జాతీయ చానళ్లు అనబడే ఇంగ్లీష్ చానళ్లు మీడియా విలువల గురించి మాట్లాడాయి. ఏమిటీ పోకడలు అని తెలుగు చానళ్ల తీరుపై అసంతృప్తి వెలిబుచ్చాయి. కానీ అవిచేస్తున్నదేమిటి? ఇంగ్లీష్ ప్రేక్షకుల సెన్సిబిలిటీస్ కొంచెం వేరేగా ఉంటాయి కాబట్టి పైపెచ్చు వారికి బిబిసి, సిఎన్ఎన్ వంటి విదేశీ ప్రొఫెషనల్ చానళ్లతో పరిచయముండి వాటితో పోల్చుకునే అవకాశముంది కాబట్టి అవి మరీ ఈ ఫార్ములాలను అవలంబించకపోవచ్చు. ప్రేక్షకులను బట్టి ఫార్ములాలు మారుతుంటాయి. వారు వేరేగా ఫ్యాషన్ పేరెడ్లను అందులో డ్రెస్ మాల్ ఫంక్షన్‌లను (క్యాట్‌వాక్‌లో బట్టలూడి అంగాలు బహిర్గతం కావడానికి ముద్దుపేరు) సచిత్రంగా చూపిస్తూనే ఉంటారు. నైట్ పార్టీలకు ప్రత్యేక పేర్లు పెట్టి మరీ మందారగిస్తుంటారు. అంతేనా! ఖైర్లాంజీలో దళితులపై జరిగిన ఘోరమైన అమానవీయమైన అత్యాచారాలు,హత్యలకు అవి ఇచ్చిన ప్రాధాన్యమెంత? జెస్సికాలాల్ కేసుకు ఇచ్చిన ప్రాధాన్యమెంత? రిజర్వేషన్ల వ్యవహారంలో వారి ధోరణి ఏమిటి? ఇలా అనేకానేక ప్రశ్నలు వేసుకోవచ్చు. ఇక్కడ వెంటనే అగ్రకుల స్వభావం, దళిత-బహుజన వ్యతిరేకత లాంటి నిర్ణయాలకు వచ్చే ప్రమాదముంది. కానీ అది ప్రధాన కారణం కాదు. ఇంగ్లీష్ న్యూస్ ఛానళ్లను చూసే వారిలో ఎక్కువలో ఎక్కువ అగ్రకులాల వారే ఉంటారు కాబట్టి, మార్కెట్ సూత్రాల ప్రకారం వారికి ఇబ్బంది లేని వైఖరి తీసుకోవాల్సిన ఒత్తిడి ఉంటుంది. టార్గెట్ ఆడియెన్స్ సెన్సిబిలిటీస్ ముఖ్యం. వ్యక్తుల కంటే మార్కెట్ బలమైనది. కాబట్టి వాటి వ్యాపార ఫార్ములాలు వాటికి ఉంటాయి. ఢిల్లీ విద్యార్థులు పరీక్షల్లో పాస్ కావడానికి హిందీ అడ్డంకిగా తయారైందని వివరిస్తూ దాన్ని నేర్చుకోవడానికి పాపం వారెన్ని తిప్పలు పడుతున్నారో సిఎన్ఎన్-ఐబిఎన్ ఈ సెప్టెంబర్ 2న ఆవేదనగా వివరించింది. అదే నెల 19వ తేదీన కర్నాటక విద్యార్థులపై మరో స్టోరీ ఇచ్చింది. కన్నడ తప్పనిసరి చేయడం వల్ల దాన్ని నేర్చుకోవడం ఎంత దుర్భరంగా ఉంటుంది అంటూ! ఢిల్లీలో హిందీ కష్టమైపోయేవారు, కర్నాటకలో కన్నడ కష్టమైపోయేవారు ఎంత శాతం ఉండొచ్చు? మాతృభాష నేర్చుకోవడం కష్టమైపోయేంతగా మరీ ఇంగ్లిష్‌ను తిని ఇంగ్లిష్‌ను తాగి ఇంగ్లిష్‌నే విసర్జించే కుటుంబాలు మన దేశంలో ఎక్కడైనా కొంచెం అటూ ఇటుగా ఐదు శాతం కంటే మించే అవకాశం లేదు. అయినా వారు ఢిల్లీ, కర్నాటక విద్యార్థులయ్యారు. వారి కష్టం ఢిల్లీ, కర్నాటక విద్యార్థుల కష్టం అయిపోయింది. 95 శాతం విద్యార్థుల కంటే 5 శాతం విద్యార్థులే మనకు 'విద్యార్థులు' అయిపోయారు. ఇందులో వేరే మతలబు ఏమీ లేదు. మార్కెట్ ప్రకారం వారికి ఇంగ్లీష్ ప్రేక్షకులు మాత్రమే ప్రజలు. వారి కష్టములే కష్టములు. కష్టములే కాదు, కస్టములు కూడా. చివరగా తేలుతున్నదేమిటంటే దేహములు వేరు కావచ్చును కానీ వ్యాపారపు ఆత్మ ఒక్కటే. ఈ ఆత్మ టిఆర్‌పి. ఈ ఆత్మ టార్గెట్ ఆడియెన్స్. ఈ టిఆర్‌పి అనేది ఒక బ్రహ్మపదార్థమని ఈ మధ్య హైదరాబాద్ ప్రెస్‌క్లబ్‌లో మీడియా విశ్వసనీయతపై జరిగిన చర్చలో సిఎంఎస్ భాస్కరరావు గారు అన్నారు. దాని గురించి ఎవరికీ తెలీదని, చివరకు వేదిక మీద ఉన్న రవిప్రకాశ్‌ను అడిగినా తెలీదనే చెప్పారని పేర్కొంటూ దాన్ని టెలివిజన్ రేటింగ్ పాయింట్స్ అంటారని విశదీకరించారాయన! ఇందులో పీపుల్ మీటర్స్ వాడతారని టామ్ అనే సంస్థ అధ్వర్యంలో ఈ ప్రక్రియ జరుగుతుందని మరి రెండు విషయాలను సైతం చెప్పకొచ్చారు. అది ఆయన పెద్దమనసుగా మనం అర్థం చేసుకోవాలి తప్పితే అంత అమాయకంగా ఛానళ్ల నిర్వాహకులు ఉండరు. ఛానళ్ల భవితవ్యమే టిఆర్‌పిల చుట్టూ తిరుగుతున్నప్పుడు ఇక్కడెవరికీ తెలీదంటూ వాటి నిర్వచనాలను కనిపెట్టడాన్ని పెద్దమనసుగా కాక మరెలా అనుకోగలం! ప్రత్యర్థి ఛానల్ ఖర్చులో మూడోభాగం కూడా పెట్టకుండానే దానికి సమానమైన రేటింగ్స్ సాధిస్తూ తనకు తాను ఓ విజయగాథగా మారిన ఓ ఛానల్ నిర్వాహకుడికి కూడా టిఆర్‌పి అంటే తెలీదని చెప్పడంలోనే ఆయన పెద్దమనసు అర్థమవుతుంది. ప్రతి ఛానల్ నిర్వాహకులు ప్రతివారం టిఆర్‌పిలను సమీక్షించుకుంటారు. చాలా సందర్భాల్లో మార్కెటింగ్, అడ్వర్‌టైజ్‌మెంట్ శాఖలను భాగస్వాములు చేస్తారు. టామ్ (టెలివిజన్ ఆడియెన్స్ మెజర్‌మెంట్) ఏర్పాటుచేసిన మీటర్లు ఏఏ పట్టణాల్లో ఉన్నాయో ఆయా పట్టణాల వార్తలు మిస్సవ్వకుండా జాగ్రత్తలు తీసుకుంటారు. (టెలివిజన్ వారి ప్రజల్లో గ్రామీణులు భాగస్వాములు కారు. టిఆర్‌పి పరిధి పట్టణ ప్రేక్షకులకే పరిమితం) వారి అభిరుచుల కనుగుణంగా కార్యక్రమాలను రూపొందించుకుంటారు. టామ్ పద్ధతి సక్రమమా అక్రమమా అనే చర్చకు ఇక్కడ తావు లేదు. పత్రికలను ఎబిసి రిపోర్ట్ మాదిరి టెలివిజన్‌కు టామ్ రిపోర్టులే కీలకం. వాటిని బట్టే కార్పొరేట్ యాడ్స్ వస్తాయి. శాటిలైట్ ఛానల్ మనుగడకు ఇదే కీలకం.

ఇవి కాకుండా వృత్తిపరమైన అంశాలు కొన్ని ఉన్నాయి. ముందు మేమే చంపాం, మేమే చంపాం అని బ్రేకింగ్ న్యూస్ క్రెడిట్ సంపాదించుకోవడానికి మనమే యమధర్మరాజు పాత్ర పోషించి తొందరపడి ఫలానా వారి ప్రాణములు పోయినవి (అరాఫత్, పివి నరసింహారావు, పోప్ జాన్‌పాల్) అని అంతిమ తీర్పులిచ్చేయడం లాంటివి. అదే బాటలో కొంతమంది ఉత్సాహవంతులైన, నిబద్ధులైన కార్యకర్తలు అందంగా అద్దాలు పగులగొడుతున్నప్పుడు, రసరమ్యంగా ఫర్నీచర్ తగులబెడుతున్నప్పుడు మన కెమెరామెన్ అక్కడికి చేరుకోకపోతే ఏమి చేయుదుము? మేం రావడం కొంచెం లేటయ్యింది. మరొక్కసారి ప్లీజ్! అంతే! యాక్షన్ రివైండ్! లేదంటే మనమే అటువంటి నిబద్ధత గలిగిన యాక్టర్లకు ముందుగానే సమాచారం అందించి "మేం ఫలానా టైముకు అక్కడికి చేరుకోగలం, మీరు రెడీగా ఉండుడీ", అని చెప్పి చక్కని సమన్వయంతో ఆపరేషన్ నిర్వహించగలం. ఎందుకంటే ఛానళ్లకు దృశ్యాలు ప్రధానం కదా! ఎస్వీయు యూనివర్శిటీల్లో పూర్ స్టూడెంట్స్ ఛానళ్లకు ముందుగా చెప్పి క్యాంపస్ హాస్టల్‌లో బ్లూఫిల్మ్‌లు చూసివుంటే

వారికథ వేరేగా ఉండేది. ఇవి కాకుండా వేరే చిన్నచిన్న తుంటరి పనులు కూడా ఉండును. నెట్‌వర్క్ పరిమితి వల్ల మనకు వివిధ ప్రదేశాల నుంచి సదృశ్యవార్తలు వచ్చే అవకాశం లేనప్పుడు ఇతర ఛానళ్లనుంచి యదేచ్ఛగా దొంగిలించడం, వారిలోగోలు కన్పించకుండా తెరలో సగందాకా ఏవేవో రాతలతో నింపేయడం వంటివన్న మాట!. ఎక్కడో ఏదో ఘటన జరిగితే మనం మన ఛానల్ బిల్డింగ్ మీదనుంచే పిటుసిలు( స్థూలంగా ఘటనా స్థలంనుంచి నేరుగా రిపోర్టర్ మైకుచ్చుకుని విషయాన్ని వివరించడమన్నమాట–పీస్‌టుకెమెరా) ఇవ్వడం వగైరా కొంటె పనులు మరికొన్ని. రిపోర్టర్లు మన డెస్క్ లోనే కూర్చుని ఏ సింగపూర్ నుంచో దుబాయ్ నుంచో ఫోన్–ఇన్‌లు ఇవ్వడం వంటి బిల్డప్పులు ఇంకొన్ని. వీటి వల్ల తక్షణ ప్రమాదం లేకపోవచ్చు గానీ ప్రేక్షకుల్లో కూడా స్పృహ పెరుగుతున్నది కాబట్టి మున్ముందు ప్రమాదమే. ఏ అలహాబాద్ వార్తో మన మైక్ లేకుండా పదేపదే ప్రసారమవుతూ ఉన్నదనుకోండి. పైపెచ్చు అటువంటి వార్తలు వచ్చినపుడల్లా తెర సగానికి పైగా రాతలతో కప్పేసి ఉంటున్నదనుకోండి! అనుమానం వచ్చేస్తుంది కదా! భాస్కరరావుగారు ఛానళ్ల నిర్వాహకులను పెద్దమనుసుతో అర్థం చేసుకున్నట్టు ప్రేక్షకులు కూడా పెద్దమనసుతో అర్థం చేసుకుంటారనుకుంటే మొదటికే మోసం!

అదేంటి? అన్ని ఛానళ్లు తాము సమాజం మెరుగుకోసం ఉద్యమాలు చేస్తున్నామని చెప్పుకుంటాయి కదా! మీరేటి ఫక్తు వ్యాపారమంటారు! అనే సందేహం తలెత్త వచ్చు. అలా చెప్పుకోవడం కూడా వ్యాపారమేనని ముందుగా మనం అర్థం చేసుకోవాలి. ఇప్పుడూ! మనం రోజూ టీవీల్లో చూసే దివ్యరత్నం వ్యాపార ప్రకటననే చూద్దామండి!. వాళ్లు మేం రత్నాలు అమ్ముకునే వాళ్లం అని సింపుల్‌గా చెప్పేసుకుంటున్నారా! లేదే! భారతదేశంలో నకిలీ రత్నాలనేవే లేకుండా చేయడానికి చేపట్టిన మహోద్యమం అని చెప్పుకుంటున్నారు. అదన్నమాట! మరొక్కమాట కూడా అనేసుకుందాం. ఒకప్పుడు కాల్గేట్ యాడ్ ఎలా ఉండేది. "వస్తాద్‌గారూ, ఉప్పుతో పళ్లు తోముతున్నారా, పుల్లతో తోముతున్నారా, అని ఆశ్చర్యం వ్యక్తం చేసి అవి ఆరోగ్యానికెంత హాని చేస్తాయో వివరించి ఆ తదుపరి అందరి ఆరోగ్యం కోసం పుట్టుకొచ్చిన టూత్‌పేస్ట్‌ని చేతుల్లో పెట్టేవాళ్లు. ఇవాళ అదే కాల్గేట్ "మీ టూత్ పేస్ట్‌లో ఉప్పులేదా, అయితే మీ పళ్లు ఆరోగ్యంగా లేనట్టే "అంటూ ఉప్పు ఉన్న పేస్ట్‌ని పరిచయం చేస్తున్నాయి. సౌందర్య సాధనాలదీ అదే ఫార్ములా. ఒకప్పుడు పసుపు రాసుకుంటున్నారా, వేప పూత రాసుకుంటున్నారా, యాక్ ....ఇదిగిదిగో ఫారిన్ ఫార్ములాతో రూపొందిన ఫలానా ఫలానా అనేవి. ఇవాలేం చేస్తునాయి. అలీవోరా, పసుపు, చందనం....అంటూ ఊదరగొడుతున్నాయి. అవసరాన్ని బట్టి నినాదాలు రూపొందించుకోకపోతే అది యాపారమే కాదు. మీడియా కూడా అంతే. ప్రజల కోసం సమాజం అభ్యున్నతి కోసం పనిచేయడమనేది ఎప్పటికీ చెరిగిపోని వ్యాపార కార్డు. కాబట్టి సహజంగానే ప్రతి ఛానల్ ఉద్యమంతోనే మొదలవుతుంది. అందులో కొన్ని మంచిపనులు కూడా చేయొచ్చు. ముందే చెప్పుకున్నట్టు వ్యాపారానికి మంచి అవసరమైనప్పుడు మంచి, చెడు అవసరమైనప్పుడు చెడు. లోడెడ్ వాల్యూగా కాకుండా మామూలు మాటల్లో ఇది వ్యాపారం అని చెప్పుకుంటే సమస్య ఉండదు. వ్యాపారం కాకుండా ఏ బిజినెస్ పర్సన్ అయినా ఎందుకు ఛానళ్లు స్థాపిస్తారు! వ్యాపారమే కాకపోతే ఇంతమంది పాత్రికేయులకు ఉపాధి అవకాశాలు ఎలా లభించేవి? వ్యాపారంలో కూడా వారివారి ప్రమాణాలు వారికుంటాయి. ఎవరి స్థాయి వారికుంటుంది. టాటాలకు అంబానీలకు తేడా ఉన్నట్టే! సోమాలియాలో జనాలు ఆకలితో పిట్టల్లా రాలిపోతున్న వేళ, భారత్‌లో గోదాముల్లో ధాన్యం పందికొక్కుల పాలవుతూ ఒరిస్సా ఆంధ్రప్రదేశ్‌లలో ఆకలిచావులు సంభవిస్తున్న వేళ, వాటిని కళ్ళకు కట్టినట్టు చూపింది, ప్రభుత్వాలను అంకుశంతో పొడిచి ముందుకు నడిపించింది ప్రధానంగా ఛానళ్లే. ఈ పాజిటివ్ శక్తిని తక్కువ అంచనా వేయడానికి వీల్లేదు.

ఛానళ్లకు సంబంధించి చర్చ జరుగుతున్న మరో పార్శ్వం అవినీతి. పెద్దస్థాయిలో అవినీతి వల్ల ఛానళ్ల విశ్వసనీయతకు ఇప్పటికిప్పుడు ముంచుకొచ్చిన ప్రమాదమేమీ ఉండకపోవచ్చును. అది అంత సులభంగా కనిపించదు కాబట్టి. కానీ రిపోర్టర్ వార్తకింత అని ఫిక్స్ చేసి "నో బార్‌గైన్–ఫిక్స్‌డ్ రేట్" అని బోర్డు పెట్టేసుకున్నాడనుకోండి! పెద్ద చిక్కే చాలా ప్రచారమైపోతుంది. పైగా చిన్నస్థాయిలో ఉండేవారికి అతి తెలివితేటల్ని కూడా ఊహించుకోలేం. బంగారు లక్ష్మణ్ లాగే వీళ్లు తేలిగ్గా బయటపడతారు. పైపెచ్చు మీడియాలో పావలా అవినీతి ఉంటే రూపాయిన్నర చేసి ప్రచారం కల్పించడానికి మన ప్రత్యర్థులు కాచుకుని కూర్చుని ఉంటారు. ఏ గేట్ కీపింగ్‌లోనైనా ఉండే ప్రమాదమే అది. పత్రికల్లో కొన్ని సంప్రదాయక అవినీతి విధానాలు ఇంతకు క్రితమే రూపొంది ఉన్నప్పటికీ ఈ ప్రమాదం ఇటీవల ఇంత హఠాత్తుగా ఉగ్రరూపం దాల్చి ప్రచారం పొందడానికి కారణం ప్రధానంగా హిడెన్ కెమెరాలు. మొత్తంగా అవినీతిమయమైన సమాజంలో ఇటువంటి సాధనాలు వ్యవస్థను భ్రష్టు పట్టించడానికే ఎక్కువ ఉపయోగపడతాయి. ట్రాఫిక్ కానిస్టేబుల్ అవినీతిని మనం కొత్తగా జనానికి వివరించాల్సిన అవసరమేమీ లేదు. కొందరు పాత్రికేయులకు డబ్బు సంపాదించుకోవడానికి ఉపయోగపడే అవకాశాన్ని అందించడం, తద్వారా మొత్తం పాత్రికేయులనే సమాజం అనుమానాస్పదంగా చూసి మొదటికి మోసం తెచ్చుకునే ప్రమాదం తప్ప. ఏదో సామూహిక ప్రజా ప్రయోజనం ఇమిడివున్న మహత్తరమైన అంశంలో ఒక బృహత్తర ఆపరేషన్ ద్వారా కొత్త అంశాన్ని వెలికి తీసుకు రావడం వేరు. తలా ఒక బుల్లి కెమెరా ఇచ్చి 'మీ ఇష్టం రామక్రిష్టాపురం' అనడం వేరు. ఎందుకంటే ఇది ఎంత త్వరగా మనం అనుకున్న ఫలితాలను సాధించగలదో అంత త్వరగా మన గౌరవాన్ని నాశనం చేయగలదు. నిన్నటికి నిన్న రాజమండ్రిలో ఒక మల్టీ లెవెల్ మార్కెటింగ్ వ్యాపారి తనను డబ్బుకోసం బెదిరిస్తున్న ఇద్దరు జర్నలిస్టుల సంభాషణను రికార్డు చేసి అన్ని ఛానళ్లకు పంపాడు. ఎవరూ వేయలేదనుకోండి– సహజంగానే! తెలివి ఒక్కరి సొత్తు మాత్రమే కాదుకదా! ఇది ఇలానే సాగితే అసలు ఆ జర్నలిస్టులు ఆ మాత్రం దండుకోవడానికైనా గౌరవం మిగలదు. మీడియా మీద ఇంకా భయం ఉండబట్టే వారికి కాసులు రాలుతున్నాయి. అదీ పోయాక ఇంకేం రాలుతుంది బూడిద!

అలా అని పాత్రికేయులు మొత్తం అలానే ఉన్నారని అనేసుకుంటే పొరబాటే. మెజారిటీ పాత్రికేయులు ఇప్పటికీ నోరులేని బడుగుజీవులే. ప్రెస్‌మీట్‌కి సొంత వాటర్‌బాటిల్ సైతం మోసుకెళ్లే పాత్రికేయులు సైతం

ఉన్నారు. కానీ గుప్పెడు మంది చాలు- మొత్తం వ్యవస్థ ప్రతిష్ఠ మసకబార్చడానికి. వర్తమానానికే వస్తే ఒక సాంకేతిక విధానంలో అవినీతికి పెద్ద ఎత్తున అవకాశం ఉన్నపుడు దాన్ని నియంత్రించగలిగిన అవకాశం తక్కువగా ఉన్నపుడు అసలు ఆ విధానాన్ని అమలు చేయడం మీదే సమీక్ష జరగాలి. అవినీతి కంపు కొడుతున్న మన వ్యవస్థలో విచ్చలవిడి హిడెన్ కెమెరా ఆపరేషన్లు భస్మాసుర హస్తం లాంటివి.

ఇక మూడో అంశం అజ్ఞానం. అజ్ఞానం పేరెత్తగానే మరి విజ్ఞానం అనగానేమి? జర్నలిస్టులు సర్వజ్ఞులైవుండవలెనా అనియొక సందేహం రావడం సహజం. దీని అర్థం అది కాదు. పాత్రికేయులు తాము చెప్తున్న వార్తకు సంబంధించి స్థూలమైన సమాచారమునైనా తెలుసుకుని ఉండవలెను. తమకే తెలియని విషయాన్ని ప్రజలకు విశ్లేషించి వివరించబూనుట దుస్సాహసమగును. అవతల రిపోర్టర్ ఇక్కడ గాల్లోకి కాల్పులు జరుపుతున్నారు అనగానే ఇక్కడ యాంకర్ 'చీకటిపడింది కదా! గురిచూసి కాల్చగలుగుతున్నారా' అంటే పోయేది ఎవరి పరువు! అతని పరువు మాత్రమే కాదు కదా! అలాగే 'సోనియా డిస్కస్డ్ డిఫెన్స్ అండ్ అదర్ ఏరియాస్' అంటే మనం 'రక్షణ, ఇతర ప్రాంతాల్లో చర్చించారు" అని అనువాదం చేస్తే ఏమనుకోవాలి? మనుశర్మను కోర్టు కన్విక్ట్ చేసిన రోజు "మనుశర్మను ముద్దాయిగా కోర్టు నిర్ధారించింది" అని వార్తచెప్తే ఏమని ప్రేక్షకుడు అనుకోవాలి? గాజాలోని పాలస్తీనా ప్రాంతాల్లోకి ఇజ్రాయెల్ బుల్‌డోజర్లు వెళ్లి అల్లకల్లోలం చేస్తుంటే, పాలస్తీనా ఉగ్రవాదుల ఆగడాలను అడ్డుకోవడానికి ఇజ్రాయెల్ భద్రతా దళాలు రంగప్రవేశం చేశాయి అని రాస్తే ఏమనుకోవాలి? మిలట్రీ డ్రస్సులో ఉండి ట్యాంకుల్లో ప్రయాణించువారు సైనికులు, వడిసెల రాళ్లు విసురువారు ఉగ్రవాదులు అని మన జ్ఞానం మనకు ఉండవచ్చును. కానీ దాన్ని అందరికీ అలానే పంచుతామంటే ఎలా? తప్పులు, పొరబాట్లు ఉండవని కాదు. మహామహులు సైతం తప్పులు చేస్తారు. కానీ మనం పొరబడ్డామన్న స్పృహ, నేర్చుకోవాలన్న తపన ఉన్నాయా, అటువంటి ప్రయత్నాలు జరుగుతున్నాయా అనేదే ఇక్కడ కీలకం. ఇటీవల అలవోకగా దొర్లిపోతున్న దారుణాలను చూసినపుడు ఈ అనుమానం రావడం సహజం. ఇది కూడా మీడియాను సమాజం దృష్టిలో పలుచనబరిచే అంశమే. ఇది తక్షణం తీవ్రస్థాయిలో కనిపించకపోవచ్చును గానీ ఇది స్లోపాయిజన్ లాంటి ప్రమాదకారి అని గుర్తించక తప్పదు. జర్నలిజాన్ని వృత్తిగా కాకుండా ఉత్తి ఉద్యోగంగా స్వీకరించే ధోరణి పెరిగిపోవడం కూడా దీనికొక కారణం. ఉడుకునెత్తుటి యవ్వనాన్ని ఉపయోగించుకోవాలనే తపనలో వారికి తగినంత శిక్షణ అవసరమనే అంశాన్ని మీడియా విస్మరించడం మరొక కారణం.

సామాజిక జీవనంలో ప్రధాన పాత్రపోషించే ఒక కీలక వ్యాపారాన్ని పూర్తిగా మార్కెట్ ఇష్టానికే వదిలివేయడం వల్ల తలెత్తుతున్న ఇబ్బందులు ఇందులో అనేకం ఉన్నాయి. అయితే ఇప్పుడిప్పుడే నియంత్రణ సంస్థను నెలకొల్పే యత్నాలు జరుగుతున్నాయి. ఇది హర్షించాల్సిన విషయమే. స్వయం నియంత్రణ వంటి పాతకాలపు నినాదాల వల్ల ఫలితం లేదు. మార్కెట్ పోటీ ఇంత క్రూరంగా ఉన్నప్పుడు వాటిని నిర్వహించే స్థానంలో ఎవరున్నా కొంచెం అటుఇటుగా అడ్డదారులు తొక్కక తప్పని పరిస్థితి తలెత్తుతుంది. నేరం ఆ వ్యక్తులది కాదు. అటువంటి అవకాశం ఉండే స్థితి కొనసాగడానికి సంబంధించినది. వ్యక్తుల సెన్సిబిలిటీస్‌కు, ఇష్టాలకు వదిలేయకుండా సంస్థాగతపరమైన నియంత్రణ ఉండాలి. ఇటువంటి అడ్డదారుల్లో టిఆర్‌పిలు పెంచుకోవడానికి సమాజంలో ఉన్న అవకాశమే దీనికి ప్రధానకారణంగా గుర్తించాలి తప్ప ఊరకే వ్యక్తులను నిందించడం వల్ల ప్రయోజనముండదు. ఆ అవకాశాన్ని నియంత్రించాలి తప్ప ఆ వ్యక్తులను కాదు. ఉన్నంతలో బిబిసి వారి ఆఫ్కామ్ నమూనాయే దీనికి సరైన విరుగుడవుతుంది. మీడియా గురించి ఇలాంటి చేదు వాస్తవాలు అనేకం ఉన్నా సినికల్‌గా ఉండాల్సిన అవసరమైతే లేదు. వీటిని పక్కనబెడితే ఇతరత్రా ప్రొఫెషనల్ ప్రమాణాలు బాగా పెరిగాయి. క్షణాల్లో సమాచారం అందించడంలో పోటీ పెరిగింది. చాలా సందర్భాల్లో పోటీ ప్రజాస్వామిక లక్షణాలవైపు దారితీస్తుంది. సమాజం పశ్చిమదేశాల తరహా ప్రజాస్వామ్యం వైపు అడుగులేస్తున్నది కాబట్టి బహుశా మీడియా కూడా బిబిసి తరహా ప్రొఫెషనలిజం ప్రమాణాలు (అవే పరమ ప్రమాణాలా అంటే అది పూర్తిగ వేరే కథ. ఇప్పటికైతే ఉన్నంతలో సాపేక్షకంగా అవి ప్రమాణాలే) అన్ని విధాలా సాధించగలదని భావించడం దురాశ కాదేమో! ◆

# ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికల పాత్ర-ఒక పరిశీలన

– డా. ఆర్. ఆదిరెడ్డి

'ప్రెస్ ఈజ్ ద ఫోర్త్ ఎస్టేట్', భారతదేశంలోని పత్రికా చట్టాలలో ది ప్రెస్ అండ్ రిజర్వేషన్ ఆఫ్ బుక్స్ (పిఆర్‌బి) యాక్ట్ 1867 ఒకటి స్వాతంత్రోద్యమ సమయంలో అప్పటి అవసరాలకు అనుగుణంగా ఈ చట్టానికి కొన్ని సవరణలు చేశారు.

అయితే చట్టాన్ని పూర్తిగా సమీక్షించి భారత్ వంటి ప్రజాస్వామ్య దేశానికి సరిపోయేలా దీనిని మార్చడానికి ఎలాంటి ప్రయత్నాలు జరుగలేదు. ఈ చట్టం కేవలం క్రమబద్ధీకరణ (రెగ్యులేటరీ) కోసం ఉద్దేశించినది కావడంతో పత్రికా రంగం కూడా ఈ చట్టానికి చేసిన సవరణలు మరింత సంక్లిష్టతకు దారితీశాయి. దీనితో పాటు ఒరిజినల్ యాక్ట్‌లో కూడా ఎన్నో లోపాలున్నాయి. ఆధునిక ప్రపంచంలో మానవ సంబంధాలను విస్తృతంగా ప్రభావితం చేస్తున్న ప్రసార మాధ్యమాల్లో పత్రికలు కీలక పాత్ర వహిస్తాయి. కేవలం సమాచారాన్ని చేరవేసే సాధనాలుగా మాత్రమే కాక పత్రకలు ఈ రోజు ప్రజాబాహుళ్యపు బాగోగులు చూసే బాధ్యతను కూడా స్వీకరించాయి. ప్రజల కష్ట నష్టాల్ని కడతేర్చేందుకు పాలకులకు, ప్రజలకు మధ్యన పత్రికలు వారధిగా నిలబడుతున్నాయి. సమాజంలో పాత్రికేయ వృత్తి ఎంతో ఉన్నతమైనది. శతాబ్దాల చరిత్ర వున్న పత్రికా రంగం పరిశ్రమగా, పాత్రికేయత ఒక వృత్తిగా ఎదుగలేకపోయింది. పత్రికా రంగంలో చేరుతున్నవాళ్లు, కొనసాగుతున్న వాళ్లు చాలా తక్కువ వేతనంతో పనిచేస్తున్నారు.

నిజానికి తెలుగు పత్రికలు సమాజ వికాసానికి ఎనలేని సేవ చేశాయి. స్వాతంత్ర్య సమరంలోనైతేనేమి, సంస్కరణ దశలో నైతేనేమి తెలుగు పత్రికలు క్రియాశీలత  చిరస్మరణీయం. ఇటీవలి కాలంలో రాజ్యాంగ వ్యవస్థల్లో ప్రధానమైన శాసన కార్యనిర్వాహక వ్యవస్థలు విఫలమై విమర్శల పాలవుతున్న దశలో పత్రికలే ప్రజాస్వామ్యానికి వెన్నుదన్నుగా నిలుస్తున్నాయి. అంతేకాకుండా ప్రజల అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఎజండా రూపొందించి పోరాడుతున్నాయి. అందుకే ఇటీవలి కాలంలో పాత్రికేయ వృత్తి పట్ల గౌరవం, ఆకర్షణ పెరుగుతున్నాయి.

అలాగే తెలుగు పత్రికలు, వికేంద్రీకరణ, ప్రాంతీయ జిల్లా ఎడిషన్ల మూలంగా పాత్రికేయుల అవసరం, అవకాశాలు పెరిగాయి. ప్రస్తుతం పత్రికలు సమాజంలో భావ ప్రసారానికి సంబంధించినంత వరకు ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి.

విశ్వం నలుమూలల నుంచి అనేక విషయాలు సేకరించి ప్రజలకు చేరవేయడంలో పత్రికలు అత్యంత కీలక పాత్రను నిర్వహిస్తున్నాయి. అలాగే ప్రజల మనోభావాలను పాలకులకు తెలియజేయడంలో కూడా పత్రికలే ప్రధాన భూమిక పోషిస్తున్నాయి. ఒకరకంగా పాలకులకు ప్రజలకు మధ్య పత్రికలు ఒక వారధిగా పనిచేస్తున్నాయి.

అలాగే ప్రజలను వివిధ సమస్యలపట్ల, విషయాలపట్ల చైతన్య వంతులను చేయడంలో కూడా పత్రికలు ఎంతో కృషి చేస్తున్నాయి. మారుతున్న ప్రస్తుత పరిస్థితులలో పత్రికల పాత్ర విస్తృతమైంది. ఈ నేపథ్యంలో పాత్రికేయులు, పాత్రికేయ విద్యార్థులు అనేక మౌలిక విషయాలు తెలుసుకోవలసి ఉంటుంది. పత్రికా రచనకు సంబంధించిన వివిధ అంశాలను ఆరు భాగాలలో చెప్పవచ్చును. అవి పత్రికా రచన – ప్రాథమిక సూత్రాలు వార్త సేకరణ – పద్ధతులు, ఆధారాలు వార్తా రచన – విలువలు, విలేఖనం రిపోర్టింగ్ వార్తల ఎడిటింగ్, కార్టూన్లు, ఫోటోలు, ఫోటో ఫీచర్లు. పత్రికా రచన అనేది ఆధునిక ప్రక్రియ పాశ్చాత్య దేశాల పరిస్థితి ఎలా వున్నా మన దేశంలో ముఖ్యంగా ప్రాంతీయ భాషల్లో పత్రికా రచన ప్రారంభమైనది మాత్రం 19వ శతాబ్దంలోనే పత్రికల ప్రారంభానికి ముందు వివిధ సాహిత్య, భావ ప్రసార ప్రక్రియలు ఉన్నా పత్రికలకు ఉన్నంత ప్రాధాన్యత, విస్తృతి వాటికి ఉండేది కాదు. సమాజంలో సమాచార వినిమయం, పఠనా శక్తి, అక్షరాస్యత పెరిగిన కొద్ది పత్రికల అవసరం పెరుగుతున్నది. నానాటికి మారుతూ క్లిష్టమవుతూ ఉన్న మానవ సంబంధాల నేపథ్యంలో పత్రికలు సమాచార వ్యాప్తిలో క్రియాశీల పాత్ర నిర్వహిస్తున్నాయి. కేవలం వినోదం కోసం మాత్రమే కాకుండా పత్రికలు విజ్ఞాన వికాసాలకు కూడా ప్రాధాన్యత ఇస్తున్నాయి. ఇప్పుడు పత్రికలు ప్రజాజీవనం నుంచి విడదీయలేని రీతిలో అల్లుకుపోయాయి.

**పత్రికా రచన అర్థ వివరణ**

పత్రికా రచన అంటే పత్రికకు రాయడం. దీనినే మనం 'జర్నలిజం' అంటున్నాం. ఒక వ్యక్తి తనకు తెలిసిన విషయాన్ని లేదా తోచిన విషయాన్ని అచ్చువేసి ఇతరులకు తెలియజేస్తే దాన్ని పత్రికా రచన అనవచ్చు. ఇది నిరంతర ప్రక్రియ అంటే ఒక క్రమ పద్ధతిలో, ఒక నిర్ణీత కాలంలో వెలువడితేనే దానిని పత్రిక అంటాం. పత్రికలు దిన, వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక సంచికలుగా వెలువడుతున్నాయి. కొన్ని పత్రికలు సంవత్సరానికి ఒకటి రెండు సార్లు మాత్రమే వెలువడుతున్నాయి. కాల వ్యవధి ఏమైనా క్రమ పద్ధతిలో వెలువడే సమాచార సంపుటియే పత్రిక.

**పత్రికా రచన – చరిత్ర**

ప్రపంచంలోని వివిధ భాషల పత్రికా రంగంతో పోలిస్తే తెలుగులో పత్రికా రచన చాలా ఆలస్యంగానే ప్రారంభమైనదనవచ్చు. 'లిపి' రూపొందించిన చాలా ఏళ్లకు పత్రికా రచన మొదలయినది. అది కూడా క్రైస్తవ మిషనరీల ప్రచారం కోసం కొందరు హిందూ సనాతన సంప్రదాయాలు, దురాచారాలకు వ్యతిరేకంగా, మరికొందరు సాంస్కృతిక సాహిత్య వికాసానికి పత్రికా రచన ప్రారంభించారు.

అప్పటి పత్రికలకు స్పష్టమైన కాలనిర్ణయం ఉండేది కాదు. వారానికో, పక్షం రోజులకో ఒకసారి పత్రికను ప్రచురించేవారు. కాబట్టి సమాచారం కూడా ఆలస్యంగా వెలుగు చూసేది. కొన్నిసార్లు వార్తలకంటె సంపాదకుడి వ్యాఖ్యలు, విశ్లేషణలు, సందేశాలే ఎక్కువ చోటు చేసుకునేవి.

తెలుగు తొలి పత్రికలైన మద్రాస్ క్రానికల్ (1833), వృత్తాంతి (1838), వర్తమాన తరంగిణి (1842), గోదావరి మండల విద్యా ప్రబోధిని (1869), ఆంధ్రభాషా సంజీవని (1871), వివేక వర్ధిని (1875), శశికళ (1894) వంటివి సంక్షేమం సంస్కరణాభిలాషతో ప్రారంభించబడినాయి. ఆ తర్వాత చాలా కాలానికి తెలుగులో దినపత్రికలు మొదలయినాయి. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు బొంబాయిలో 1908లో వార్తాపత్రికగా ప్రారంభించిన ఆంధ్రపత్రికను 1914లో మద్రాసుకు తెచ్చి దినపత్రిక చేశారు. తరువాత కృష్ణ పత్రిక, ఆంధ్రప్రభ వచ్చాయి. వీటికి తోడు అప్పటి హైదరాబాద్ స్టేట్‌లో ఉన్న మహబూబ్‌నగర్ నుంచి 'హితబోధిని' (1913) ఇనుగుర్తి అనే గ్రామం నుంచి తెలుగు పత్రిక నల్గొండ నుంచి నీలగిరి సురవరం ప్రతాప్‌రెడ్డి గారి గోల్కొండ (1920) వెలువడినప్పటికి వీటిలో చాలా పత్రికలు నిజాం పాలకుల దమననీతికి మూతపడిపోయాయి. ఒక్క గోల్కొండ మాత్రం చాలాకాలం దినపత్రికగా కూడా ప్రచురించబడింది. ఆంధ్రప్రభ (1938) అనంతరం ప్రారంభమైన చాలాకాలం వరకు నిలబడి కొనసాగుతున్న పత్రికలలో 1960 తరువాత వెలువడిన ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి 1970 తరువాత ఈనాడు, 1980 తరువాత ఉదయం, ఇప్పుడు వార్త 1996 ప్రధానమైనవిగా పేర్కొనవచ్చు.

అయితే ఈ పత్రికలలో వచ్చిన ప్రధాన పరిణామాల్లో భాష, ప్రచురణాంశాలలో వచ్చిన మార్పులను చెప్పుకోవచ్చు. తొలినాళ్లలో కేవలం సంఘసంస్కరణలకై ప్రాధాన్యతనిచ్చిన పత్రికలు ఆ తరువాత సమాచారం చేయడంలో, వ్యాప్తిలో, భాషా ఉద్యమంలో కీలకపాత్ర పోషించాయి. అయితే కొత్త టెక్నాలజీ, ఆధునీకరణ సమాజంలో వచ్చిన మార్పులు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ వంటి అంశాల ప్రభావం వల్ల పత్రికల్లో పత్రిక రచనల్లో మొత్తంగా పత్రికా వ్యవస్థలోనే గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి.

పత్రికలు పుట్టిన తొలినాళ్లలో వాటి పరిధి ఇంత విస్తృతంగా లేదు. నిజానికి భారతదేశంలోని పత్రికలకు చాలాకాలం వరకు పరిపూర్ణత లేదు. పత్రికలన్ని ఏదో ఒక లక్ష్యం కోసం పుట్టినవే, కొన్ని పత్రికలు స్వాతంత్ర్య పోరాటానికి ఉపయోగపడితే మరికొన్ని సంస్కరణ దృష్టితో నిలిచాయి. ఆ సమయంలో ప్రజలను చైతన్యవంతులను చేయడానికి అవి ప్రాధాన్యతనిచ్చేవి. అంటే వాటి పరిధి, లక్ష్యం పరిమితమన్నమాట.

కాని ఇవ్వాళ పత్రికారంగం ఒక పరిశ్రమగా ఎదుగుతున్నది. మరోవైపు సమాజం కూడా విస్తృతంగా మార్పులకు లోనవుతున్నది. ప్రజల అభిరుచులు, ఆసక్తులు, ఒకే రకంగా లేవు, ఒక్కొక్కరికి ఒక్కొక్క రంగం పట్ల ఆసక్తి పెరుగుతున్నది. ఈ నేపథ్యంలో సమాజ అభివృద్ధికి అనుగుణంగా పత్రికలు మారవలసి వస్తుంది.

సమకాలీన రాజకీయ వార్తలు వ్యవహారాలు, ప్రకటనలు ప్రజాభిప్రాయాలతో పాటు మహిళలు, క్రీడలు, వ్యాపార వాణిజ్య వ్యవహారాలు, విద్యార్థులు, బాలలు, ఉద్యోగులు, నిరుద్యోగులకు తెలుగు పత్రికలు ప్రత్యేక ప్రాధాన్యతనిస్తున్నాయి. దీనికి తోడు సమకాలీన అవసరాలకు అనుగుణంగా మార్కెట్ విశ్లేషణలు, వినియోగ వస్తువులు వివరాలు వైద్య, ఆరోగ్య సలహాలు, వస్తు సూచనలు మంచి, చెడు ఇట్లా అనేక అంశాలపై వార్తలు - వ్యాసాలు అందిస్తున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజలకు నిత్యం ఎదురయ్యే అన్ని అంశాల గురించి ఇవ్వాళ పత్రికలు రాస్తున్నాయి.

ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికలు కీలక పాత్ర నిర్వహిస్తూ, సమాజంలో నిత్యం జరుగుతున్న అటు పోటులను సామాన్య ప్రజలకు అర్థం అయ్యే రీతిలో పత్రికా రచన ఉండాలి. కేవలం కొన్ని వర్గాలకు, కొంతమందికి మాత్రమే ఉపయోగపడే విధంగా పత్రికలు ఉండరాదు. సమాజంలో ముఖ్యంగా ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికా స్వేచ్ఛను పూర్తిగా ప్రజల అవసరాలకు అనుగుణంగా వాడుకోవాలి. కేవలం ఒక వ్యక్తికో, వర్గానికో ఉపయోగపడే విధమయిన వార్తలు రాస్తే ఆ పత్రిక ఆదరాభిమానాలను కోల్పోతుంది. అయితే, భారత రాజ్యాంగంలో పేర్కొన్నట్టుగా పత్రికా స్వేచ్ఛను ఈనాటి ప్రభుత్వాలు వాడుకోనివ్వడం లేదని, బ్రిటీష్ ఇండియాలో పత్రికల పట్ల ప్రభుత్వం అనుసరించిన విధానాలను ఈనాడు పత్రికలు ఎదుర్కొంటున్నాయి. భావ ప్రకటన హక్కులను లాఠీలతో రూపుమాపుటకు ప్రయత్నం చేస్తే చరిత్రలో గత రాజరీకాలు, ప్రభుత్వాలు ఏ విధంగా కూలిపోయినాయో స్పష్టంగా తెలుస్తుంది. ◆

# ఎన్నికల సంస్కరణలు వ్యవస్థను మార్చుతాయా?

- ఎ. రామకృష్ణ

భారతదేశం ఎన్నికల్లో జరుగుతున్న అవినీతి అక్రమాలను నిరోధించి ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికలు జరిగే విధంగా ఎన్నికల సంస్కరణలను తీసుకరావడం లక్ష్యంగా ప్రకటించుకొని పనిచేస్తున్న సంస్థ 'లోక్‌సత్తా'. గత కొన్నేళ్లుగా ఈ సంస్థ తన కార్యక్రమాలను ముమ్మరం చేసింది. ఎన్నికల్లో జరుగుతున్న అవినీతి అక్రమాలను ఎత్తిచూపుతూ అందుకుగల కారణాలను రాజకీయ నాయకుల్లో వెతకకూడదనీ ఎన్నికల విధానం కారణంగానే రాజకీయాల్లో అవినీతి చోటుచేసుకుంటున్నదనీ, కాబట్టి 'ఆటగాళ్ళను మార్చడం కాదు, ఆట నియమాలనే మార్చాల'న్న నినాదంతో ఇప్పటికే అనేక ప్రతిపాదనలు చేసింది. వాటిలో మెజారిటీగా ఇటీవల పార్లమెంట్ ఆమోదించిన చట్టంలో చోటుచేసుకున్నాయని కూడా ఆ సంస్థ ప్రకటించింది. ఆ సంస్థ జాతీయ కన్వీనర్ అయిన జయప్రకాశ్ 'ఈనాడు' కాలమిస్టుగా అనేక వ్యాసాలు కూడా రాశాడు. 'అలిపిరి ఘటన' నుంచి సద్దాం అరెస్టు వరకు అనేక అంశాలపై వ్యాసాలున్నాయి. వీటిలో ప్రకటించిన అభిప్రాయాలు జయప్రకాశ్ స్వంత అభిప్రాయాలా లేక 'లోక్‌సత్తా' సంస్థ అభిప్రాయాలా తెలియదు గానీ వీటన్నింటిలోనూ పూసలో దారంలా 'ఎన్నికల సంస్కరణల అంశం వుంది కాబట్టి సంస్థ అభిప్రాయాలుగానే భావించాల్సి వుంటుంది. జయప్రకాశ్ వ్యక్తిగత అభాప్రాయాలుగా వున్నవాటిని ఆ సంస్థలో ప్రజాస్వామిక పద్ధతుల్లో తేల్చుకుంటారు.

ఆకలి గురించి ఆకలితో అలమటించేవారికి, దారిద్ర్యం గురించి పేదరికంలో మగ్గుతున్నవారికి, న్యాయం గురించి అన్యాయానికి గురైనవారికి తెలియదని చెప్పడం అవివేకమే అవుతుంది. అలాగే ఎన్నికల్లో జరుగుతున్న అవినీతి అక్రమాల గురించి కూడా. గత యాభై ఏళ్లుగా గ్రామసర్పంచ్ ఎన్నికల నుండి (ఇటీవల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో విద్యాకమిటీలు, నీటి ప్రజా సంఘాల ఎన్నికలు కొత్తగా లిస్టులో చేరాయి). పార్లమెంట్ ఎన్నికల వరకు అనేకసార్లు జరిగిన ఎన్నికలను తమ అనుభవంలో ప్రజలు చూస్తూ వస్తున్నారు. అందులో జరుగుతున్న అవినీతి అక్రమాల గురించి ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరం లేదు. అవి ఎందుకు జరుగుతున్నాయో విశ్లేషించుకోవడం, అందుకు పరిష్కార మార్గాలను రూపొందించుకుని చిత్తశుద్ధితో కృషి చెయ్యడం సరైన పద్ధతిగా లోక్‌సత్తా భావిస్తున్నది. 'ఒక విష వలయంలో చిక్కుకున్న రాజకీయ నాయకులను వ్యక్తిగతంగా నిందించడం వల్లనూ, వ్యవస్థను దూషించడం వల్లా ప్రయోజనం లేదనీ అలా చెయ్యడం వల్ల అరాచకత్వం ప్రబలుతుందని ఆందోళన కూడా. ఫలితంగా వచ్చిందే 'ఆటగాళ్ళను కాదు ఆట నియమాలను మార్చాలనే భావన' ఇందులో భాగంగానే ఈ క్రింది నియమాలను మార్చాలని ప్రతిపాదనలు.

1. నేరచరిత్రగల వాళ్లు రాజకీయాలలో (ఎన్నికల్లో) ఉండకుండా పటిష్టమైన చట్టాలను తేవడం.
2. నేర పరిశోధన యంత్రాంగానికి పాక్షిక స్వతంత్రత కల్పించడం.
3. దామాషా విధానం.
4. ప్రధానమంత్రి, ముఖ్యమంత్రులను డైరెక్టు ఎన్నికల ద్వారా ఎన్నుకునే పద్ధతి.

**చట్టాలు ఉన్నవాళ్ల చుట్టాలే**

దేశంలో జరుగుతున్న నేరాలు, ఘోరాలు, అవినీతి అక్రమాలు పటిష్టమైన చట్టాలు లేకనే జరుగుతున్నాయా? నేరచరిత్రగలవాళ్లను ఎన్నికలలోకి రానీయకూడదని వాళ్ల జాబితా ఒకటి తయారుచేసి 1999 ఎన్నికల సందర్భంగా లోక్‌సత్తా బహిరంగంగా ప్రకటించిందనీ, అందులో కృష్ణయాదవ్ పేరుకూడా వుందని జయప్రకాశ్ పేర్కొన్నాడు. బహుశా కోర్టుల్లో కేసులు ఎదుర్కొంటున్న వాళ్ల జాబితాను మాత్రమే లోక్‌సత్తా తయారుచేసి వుంటుంది. నేరం నిరూపించబడనంత వరకు నిందితుడు నేరస్తుడు కాదనే సూత్రం ఆధారంగానే ప్రధాన పార్టీలు టికెట్లు ఇచ్చి వుంటాయి. నేరస్తుల రేటు ఇంత తక్కువగా వుందంటే ఆశ్చర్యపడాల్సిందే. ఇంకా బయటపడని నేరస్తులెందరు? వాళ్ళమాటేమిటి? కొందరు అభాగ్యులు అవినీతి చెయ్యడం తెలియనివాళ్లు మాత్రమే బయటపడుతున్నారు. భారత శిక్షాస్మృతి ప్రకారం నేరాలకు పాల్పడిన వాళ్లే కాక పార్లమెంట్ రూపొందించిన వందలాది చట్టాలను, స్వయంగా రూపొందించిన రాజకీయ నాయకులు, పాలనాధికారులు, చట్టాలను అమలు జరిపే పోలీసులు ఏ మేరకు గౌరవిస్తున్నారో, అమలు జరుపుతున్నారో తెలియనంతటి అమాయకులు ఎవ్వరూ లేరు.

ఇన్ని చట్టాల అమలు పరిస్థితి ఇలాగ ఉంటే అసలు చట్టాలే ప్రజాస్వామికంగా రూపొందించబడనపుడు, అవి ప్రజాస్వామ్య వ్యతిరేకంగా ఉవన్నప్పుడు ఇక ప్రజల కడగళ్లకంతే వుండదు. ఇటీవల పదవీ విరమణ చేసిన రాష్ట్ర డిజిపి పేర్వారం రాములు మాట్లాడుతూ అసలు చట్టాలే ఉన్నవాళ్లకు అనుకూలంగా వున్నాయనీ మాట్లాడాడు. తన జీవితమంతా ఆ చట్టాలను కాపాడటంలోనూ చట్టవ్యతిరేకంగా విప్లవకారులను ఊచకోతకోయడంలోనూ గడిపి జీవితం ధన్యం చేసికున్నాడు. అది వేరే సంగతి.

పై విషయాలు తెలియనంతటి అమాయకుడేమీ కాదు జయప్రకాశ్. అయినా పార్లమెంట్‌లో ఎన్నికల నిధులకు సంబంధించిన చట్టం చెయ్యగానే "దేశ ప్రజాస్వామ్య ప్రస్థానంలో మేలిమలుపు" అన్న శీర్షికతో వ్యాసం రాయడం ఆశ్చర్యకరం! ఈ చట్టం ద్వారా అభ్యర్థులు అక్రమంగా పెట్టే ఖర్చులను అదుపు చేస్తామనుకోవడం వెర్రితనమే అవుతుంది.

**నేరమే అధికారమైనప్పుడు**

నేరమే అధికారమై పీకలమీద కూర్చుని వున్నప్పుడు నేర పరిశోధనా విభాగాలకి పాక్షిక స్వయం ప్రతిపత్తిని ఇచ్చినా, పూర్తిగా స్వయం ప్రతిపత్తిని ఇచ్చినా అందుకు బలయ్యేది సామాన్యుడే. దిక్కుమొక్కులేని జనాన్ని జైళ్లలోకి తోయడానికి, జైళ్ల అభివృద్ధికి దారితీస్తుంది. అసలు నేరపరిశోధనా యంత్రాంగంలో పనిచేస్తున్న

వాళ్లెవరు? రాజకీయ నాయకుల విషయంలో జయప్రకాశ్ పేర్కొన్నట్లు వాళ్లు ఆకాశం నుండి ఊడిపడలేదు కదా? బురదగుంటలో పరిశుద్ధమైన నీటిబొట్టును వెతకడం లాంటిదే ఇది.

**దామాషా విధానం మరో తమాషా**

అన్ని ప్రతిపాదనలలోకి ఇదే ముఖ్యమైనదిగా పేర్కొన్నారు. ఈ విధానంలో పార్టీలకు వచ్చిన సీట్ల శాతాన్ని బట్టి సీట్లు వస్తున్నందువల్ల ఒక నియోజక వర్గంలో పార్టీలు గెలుపు గుర్రాల వేటలో వుండవనీ, నిజాయితీగల వాళ్లు ఎన్నికయ్యే అవకాశం ఉంటుందనీ, రాజకీయాలు కులాలు, మతాలతో కాలుష్యం కావని పేర్కొన్నారు. మైనారిటీలకు తగిన ప్రాముఖ్యముంటుందనీ అంటూనే కనీసం 10 శాతం ఓట్లు వచ్చిన పార్టీలకే గుర్తింపు సీట్ల కేటాయింపు ఉంటుందని, అప్పుడు మాత్రమే కులాల పేర మరింత చీలికలు కాకుండా రాజకీయ సమీకరణ కేవలం పార్టీల కార్యక్రమం, సిద్ధాంతాలపై ఆధారపడి వుంటుందని అంటున్నారు. దీన్ని బట్టి జనాభాలో 10 శాతం లేని కులాలు, తెగలు ఇప్పుడున్న పాటి గుర్తింపు, ఉనికిని కోల్పోవడమేనన్నమాట. దామాషా విధానమే సరైన పరిష్కారం అన్న వ్యాసంలో ముస్లింలు సామూహికంగా, వ్యూహాత్మకంగా ఓటు వేయడం వల్లనే మతం, రాజకీయాలు కలగలసిపోయి మత వైషమ్యాలు పెచ్చు పెరిగినట్లు రాశారు. ఇది వాస్తవమేనా? భారతదేశంలో మతోన్మాదాన్ని మరీ ముఖ్యంగా ఇటీవల కాలంలో అది పెచ్చుపెరగడానికి సంఘ్ పరివార్ ప్రధాన కారణమని తెలియని వాళ్ళెవరు? మిగతా మైనారిటీలపై హిందూ మతోన్మాదుల దాడుల నేపథ్యం తెలియనిదా? ఈ విషయాలను, వాటి మూలాలను పక్కకు పెట్టి ఆ నేరాన్ని ముస్లిం, సామూహిక, వ్యూహాత్మక వోటింగ్‌పై నెట్టివెయ్యడం క్షంతవ్యం కాదు.

ఇక దామాషా పద్ధతిలో ఓటింగ్ జరుగుతున్న యూరప్ దేశాలలో ఎన్ని స్కాంలు జరగడం లేదు. రాజకీయ పార్టీలు టికెట్లను ఎవరికి కేటాయిస్తున్నాయి? సమాజంలో ఆర్థిక, రాజకీయ ఆధిపత్యమున్న వర్గాలకే కేటాయిస్తున్నాయి. అయితే ఇక్కడ ఒక తిరకాసును కూడా జయప్రకాశ్ రాయకుండా ఉండలేకపోయాడు. పార్టీలలో అంతర్గత ప్రజాస్వామ్యం ఉన్నప్పుడే దామాషా పద్ధతివల్ల సత్ఫలితాలు వస్తాయని అంటున్నారు. అసలు విషయమిక్కడే ఉంది. ప్రపంచంలో ఏ ఒక్క బూర్జువా పార్టీలోనైనా అంతర్గత ప్రజాస్వామ్యం ఉందని జయప్రకాశ్ నిరూపించగలడా? అయినప్పుడు ఇది సరైన విధానం ఎలా అవుతుంది? తన నియోజకవర్గంలో గెలుపు గుర్రాలు వెంటపడకపోయినప్పటికీ మొత్తం రాష్ట్రం లేదా దేశంలో మతోన్మాదాన్ని, జాతీయ ఉన్మాదాన్ని రెచ్చగొట్టి 'పోరు'లో సీట్లను సంపాదించుకుంటారు. గుజరాత్ పరిణామాలు నుండి మనం ఏం గుణపాఠాలు నేర్చుకోకపోవడం వెర్రితనమే అవుతుంది. ప్రపంచ రాజకీయాలను పరిశీలించినా అది ఇజ్రాయిల్ కావచ్చు, అమెరికా కావచ్చు లేదా యూరోపియన్ దేశాలు కావచ్చు, అవినీతి ఆరోపణలతో దామాషా పద్ధతి వున్న దేశాలలో ఎన్ని ప్రభుత్వాలు కూలిపోలేదు? రాజకీయాలను ఏం శాసిస్తున్నాయో అర్థం కావడం లేదా?

సమాజంలో నిజమైన ప్రజాస్వామ్యం, ప్రజల ప్రజాస్వామ్యాలు కరువైనప్పుడు దోపిడీ వర్గాలు దామాషా పద్ధతులను తమాషా పద్ధతులుగా మార్చుతాయే తప్ప, అవి ఎంతమాత్రం ప్రజల ప్రయోజనాలను నెరవేర్చేవిగా వుండవు. ప్రజల పాత్రను పెంచి, ప్రజల సృజనాత్మక శక్తులను వెలికి తీసి, ప్రజల నుండే నాయకులు ఉద్భవించే ప్రక్రియను ఊహించడమే కష్టం.

**డైరెక్ట్ ఎన్నికలు - అవినీతికి సుస్థిరత**

ప్రధానమంత్రి, రాష్ట్ర ముఖ్యమంత్రులను నేరుగా ఎన్నుకోవడం వల్ల పార్లమెంట్ సభ్యులు, శాసనసభ్యులపై ఆధారపడి బతకడంపోయి ఇక వారిని అదుపుచేసే శక్తి సమర్థతలు ప్రధానమంత్రికి, ముఖ్యమంత్రులకు వస్తాయి. 2000 సంవత్సరంలో అమెరికాలో జరిగిన అధ్యక్ష ఎన్నికలు ఎంత అవినీతితో గబ్బుకొట్టాయో ప్రపంచ మీడియా అంతా కళ్లముందుంచింది. ఆ విధంగా ఎన్నికైన బుష్ ఇక తనకు ఢోకా లేదన్న దాంతో దేశంలోని మెజారిటీ ప్రజలు, ప్రపంచంలో గతంలో కనీ వినీ ఎరగని రీతిలో కోట్లాదిమంది నిరసనలు తెలిపినా ఇరాక్ యుద్ధాన్ని ఆపలేదు. 'కేంద్రీకృత పాలనే అనర్థాలకు మూలం' అన్న వ్యాసంలో జయప్రకాశ్ చంద్రబాబు నియంతృత్వ ధోరణులను పేర్కొన్నాడే! ఇంత అస్థిరత్వంలో సహితం అంత నియంతృత్వాన్ని చలాయించేవాళ్లు ఇక తనకు ఢోకా లేదనుకున్నప్పుడు రాష్ట్రాన్ని, దేశాన్ని మరింతగా ప్రపంచ మార్కెట్‌లో అమ్మకానికి పెడతారు.

**నియమాలనే కాదు ఆటస్థలం మారాలి**

నిజానికి లోక్‌సత్తా ప్రతిపాదిస్తున్న నియమాలు కొత్తవేమి కావు. అవి ప్రజాస్వామిక ప్రక్రియలో భాగమే. పార్టీ, ప్రజాస్వామ్యం అన్నవి మనగలగడానికి అవసరమైన సూత్రాలే. అయితే అవి నిజమైన ప్రజాస్వామ్య పునాదిపై ఉన్నప్పుడు మాత్రమే అమలయ్యేవి. 'ప్రజాస్వామ్యం' అనేది వర్గాతీతమైంది కాదు. బూర్జువాల ప్రజాస్వామ్యం వుంది. అలానే ప్రజల ప్రజాస్వామ్యం వుంది. ఒక వర్గం ప్రజాస్వామ్యం యింకో వర్గం నియంతృత్వం అవుతుంది. మరి జయప్రకాశ్ మాట్లాడుతున్నది ఏ ప్రజాస్వామ్యం (నియంతృత్వం) గురించి? సమాజంలో ఆవహించి వున్న అవినీతి అక్రమాలకు కారణాలను విశ్లేషిస్తూ ఒక పార్శ్వాన్ని, లేదా మూలాల నుంచి ఉత్పన్నమైన అంశాన్ని మాత్రం తడిమి మొత్తం సమస్యలకు పునాది అయిన సామాజిక వ్యవస్థను వదిలిపెట్టడం శాస్త్రీయ విశ్లేషణ అనిపించుకోదు.

దామాషా విధానంపై రాసిన వ్యాసంలో 'మన సమాజంలోని ఎన్నో వైరుధ్యాల కారణంగా, ఇప్పటికే చాలామంది బీదరికంలోనూ, అజ్ఞానంలోనూ మగ్గుతున్న కారణంగా, ...'' అంటూ ఒక అప్రధానాంశంగా పేర్కొన్నాడే కాని ఆ వైరుధ్యమేమిటో, అవి ఎలా పరిష్కరించబడతాయో, వాటి పరిష్కారానికీ, ప్రజాస్వామ్యానికీ ఏమైనా సంబంధం వుందా వంటి అంశాలను పేర్కొనలేదు. సమాజ అభివృద్ధి క్రమాన్ని శాస్త్రీయంగా విశ్లేషించి సరైన పరిష్కారాలు వెతుక్కోవడంలోనే అశాస్త్రీయ భావాలున్నాయా లేక అవసరమనుకుంటున్నాడో తెలియదుగానీ రెంటి ఫలితాలు ఒకటే. అంధకారంలోకి వెళ్ళడమే.

'మంచి మార్పులకు సంకేతం ఈ ఉద్యమం' అన్న వ్యాసంలో మన వాదనలలో, సిద్ధాంతరాద్ధాంతాలతో, పార్టీల ప్రణాళికలలో జనజీవనాన్ని గురించి చాలావరకు విస్మరించాం. మన చర్చ ప్రజలకు

అంతుబట్టని అంతర్జాతీయ సైద్ధాంతిక అంశాలపైన సాగింది. అలీన విధానం, అంతర్జాతీయ సంబంధాలు, దేశాలలోని పరిణామాలు, ప్రపంచ వాణిజ్య ఒప్పందం గురించి జనజీవితంతో సంబంధం లేని, మనకెవరికీ అర్థం కాని అంశాలను గురించి మనం ఎడతెరిపిలేకుండా చర్చించుకుంటున్నాం" అని జయప్రకాశ్ రాశాడు. ప్రజలు నిత్యం ఎదుర్కొంటున్న సమస్యలకు ప్రాధాన్యత ఇవ్వకపోవడమనే విమర్శ ఉంటే ఆహ్వానించవచ్చు కాని సిద్ధాంత రాద్ధాంతాలనీ, ప్రజల జీవితాలతో పెనవేసుకున్న అతి ముఖ్యమైన, ప్రపంచాన్నే శాసిస్తున్న సిద్ధాంత రాజకీయాలను సంబంధంలేనివిగా పేర్కొనడం మూర్ఖత్వం తప్ప మరొకటి కాదు. ఫాసిజాన్నే తన ఇజంగా ఎంచుకున్న చంద్రబాబు "నాది ఏ ఇజం కాదు టూరిజం" అని చెప్పినట్టు ఇన్ని ప్రజాస్వామిక విలువల గురించి మాట్లాడే జయప్రకాశ్ సైద్ధాంతిక రాజకీయాలకు, అంతర్జాతీయ విషయాలకు ప్రజల జీవితాలతో సంబంధం లేదని తేల్చివేయడం ఏమనుకోవాలి?

ఈ సమాజంలో పుట్టిపెరుగుతున్న ప్రతి ఒక్కరూ తమకు తెలిసో, తెలియకో ఏదో ఒక సిద్ధాంతానికి, రాజకీయానికి లేదా వర్గానికి చెందినవారై ఉంటారు. ఇందుకు ఎవరూ అతీతులు కాదు. కాబట్టి జయప్రకాశ్ ఏ ప్రజాస్వామ్యాన్ని కోరుకుంటున్నాడో స్పష్టంగా చెబితే సరిపోతుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగా వెనకబడిన దేశాలలో 'వ్యవస్థాగత సర్దుబాట్లు', 'స్థిరమైన పాలన' అనే సామ్రాజ్యవాదుల ఎజెండాలోకి వచ్చాయి. ప్రజాస్వామ్యం, సాధికారత, సుపరిపాలన నినాదాలు గతంలో ఎన్నడూ లేని విధంగా ప్రచారంలోకి వచ్చాయి. అభివృద్ధి, దేశీ పెట్టుబడులు అన్నీ విడదీయలేని అంశాలుగా ప్రచారం చేస్తున్నారు. పబ్లిక్ సెక్టార్ అంటేనే అవినీతిమయమనీ, ఆరోగ్యకరమైన పోటీ ప్రైవేట్ పరిశ్రమల ద్వారా సాధ్యమవుతుందనీ, దీనివల్ల అవినీతి ఎంతగానో తగ్గిపోయినట్లు లెక్కలు కట్టి మరీ చెబుతున్నాడు జయప్రకాశ్.

తన వ్యాసాలన్నిటిలో నేడు సామ్రాజ్యవాదుల కనుసన్నల్లో భారత పాలకులు అమలు జరుపుతున్న ఉదారీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలకు పూర్తి మద్దత్తునిస్తున్నాడు జయప్రకాశ్. ఆ విధానాలు అమలు చేయాలంటే నేడున్న 'బూర్జువా ప్రజాస్వామ్యం'పై ప్రజలకు తొలగిపోతున్న భ్రమల్ని నిలిపి వుంచడం పాలకులకు అవసరం. ఆ ముసుగును ఎన్ని చిరుగులతోనైనా ఉంచుకోవాలి. ఆ చిరుగుల్ని అందంగా (?) కుట్టి అమ్మాలని ఆయన వ్యర్థ ప్రయాస చేస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా పాలకవర్గాలు తమ ఆర్థిక విధానాలకు అనుగుణమైన రాజకీయ పరిపాలనా వ్యవస్థను ఏర్పర్చుకోవడానికీ (ఫాసిజం అని చదువుకోండి), మరోవైపు దానికి ముసుగులు వేసి ప్రజల క్రోధాగ్నిని తప్పించుకోడానికీ పడుతున్న తిప్పలకు మరొక రూపమే జయప్రకాశ్ సోకాల్డ్ ఎన్నికల సంస్కరణలన్నీ. రాజకీయ నాయకులు క్యాన్సర్ వంటివారు అన్న లింగ్డో వ్యాఖ్యకు అందుకే ఆయన, అంత తీవ్రంగా స్పందించారు. ఒకపక్క నూటికి తొంభైమంది నాయకులు అవినీతిపరులు అంటూనే మిగిలిన పదిమందిలో మంచిని చూడమని కాబట్టి దాన్ని తిరస్కరించవద్దనీ ప్రజలను ఎలాగైనా ఒప్పించాలని చూస్తున్నారు.

ఇరాక్‌పై అమెరికా యుద్ధానికి అనుకూలంగా చేసిన వ్యాఖ్యలు, అమెరికా అధికార దాహానికి దోహదపడే వాదనలూ, మరోవైపు సంఘ్ పరివార్ మతోన్మాద రాజకీయాలకు పరోక్ష మద్దతు జయప్రకాశ్ చేసే విఫలయత్నానికి మరో పార్శ్వం మాత్రమే. ప్రజాస్వామ్యం పేరుతో ప్రజలపై అమలవుతున్న దారుణమైన రాజ్యహింస ఆయన 'కళ్లబడక' పోవడంలో ఆశ్చర్యపోనవసరం లేదు.

తను మాట్లాడుతున్న ప్రజాస్వామ్యాన్ని 'బూర్జువా ప్రజాస్వామ్యం'గా పిలుచుకుంటే సరిగా వుంటుంది. బూర్జువా ప్రజాస్వామ్యంలో ప్రజల ప్రజాస్వామ్యాన్ని కోరుకోవడం పగటికలైనా అవుతుంది, పచ్చిమోసమైనా అవుతుంది. అందువల్ల ఆట నియమాలనే కాదు మార్చాల్సింది, ఆ ఆట ఏ కోర్టులో ఆడుతున్నారో ముఖ్యమైంది. నేల విడిచి ఆడే ఆటకు ఎన్ని నియమాలు పెట్టుకున్నా వట్టిదే. బురదగుంటలో పొర్లుతున్న వారిని, గుంటనూ జేబురుమాలుతో శుభ్రం చేస్తానంటున్న జయప్రకాశ్ భంగపడక తప్పదు.

భారత సామాజిక వ్యవస్థ అర్థవలస–అర్థ భూస్వామ్య వ్యవస్థనీ, దానిని నిర్మూలించకుండా ఈ దేశంలో కనీసం బూర్జువా ప్రజాస్వామ్యాన్ని సహితం అమలు జరుపలేమని విప్లవపోరాటాలు దేశవ్యాప్తంగా విస్తరిస్తున్నాయి. నిజమైన ప్రజాస్వామిక వాదులందరూ అందులో భాగస్వాములై ఉద్యమించినపుడే ప్రజల ప్రజాస్వామ్యం నెలకొంటుంది. ◆

**వచ్చే సంచికలో...**

- **ఫోకస్ - ముస్లింల సామాజిక స్థితిగతులు - సచార్ కమిటీ నివేదిక**
- **అమిత్ భాదురి పుస్తకం 'గౌరవనీయ అభివృద్ధి' - ఆర్.ఎస్. రావు**
- **ప్రజాస్వామ్యం ఉంటేనే మానవ హక్కులా? - వాసిరెడ్డి భాస్కరరావు**
- **కొండను తవ్వి.... - దుప్పల రవికుమార్**
- **స్త్రీల అస్తిత్వాలకు కొత్త సవాళ్లు - వి. ప్రతిమ**
- **కేంద్ర ప్రభుత్వ పన్ను బకాయిలు లక్షా అరవై మూడు వేల కోట్లు - వి. హనుమంతరావు**
- **ప్రభుత్వ పథకాలు - ఒక పరిశీలన - ఎన్. శ్రీదేవి**
- **స్వాతంత్ర్యానంతరం - టెక్నాలజీ, గ్రామీణాభివృద్ధి - డా. తోట సత్యనారాయణ, బండి, శ్రీనివాస్**

# కోయజాతి జీవన విధానం - ఒక పరిశీలన

- తిరునగరి మనోహరస్వామి, తాల్లపల్లి సదయ్య

ఆంధ్రప్రదేశ్ గిరిజనులలో కోయజాతి గిరిజనులు సంఖ్యాపరంగా రెండవ స్థానంలో ఉన్నారు. వీరు ప్రధానంగా గోదావరి నదీజలాల పరీవాహక ప్రాంతాలలో ఉన్నారు. ముఖ్యంగా తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్ జిల్లాలలో ఉన్నారు. వీరు ముఖ్యంగా అటవిక సంపదపై ఆధారపడి జీవిస్తారు. కొందరు వ్యవసాయం ప్రధానమైనదిగా జీవిస్తున్నారు. అడవియే వీరి కన్నతల్లి వీరిలో 1. కొండదొర 2. కొండరెడ్డి 3. కోలం 4. తోటి 5. జతపు. నాలుగు జిల్లాలో వీరి జనాభా దాదాపు 14,33 లక్షలు. వరంగల్ జిల్లాలో కోయలు ఎక్కువగా నర్సంపేట, ములుగు, మహబూబాబాద్, ఖమ్మంలో భద్రాచలం, కొత్తగూడెం, ఇల్లందు, బూర్గంపాడు, నూగూర్, మధిర, పాల్వంచ మొదలగు చోట్లలో వీరున్నారు. కోయ జనాభాలో 4.92 లక్షల మంది భూమి సాగుచేసుకొని జీవిస్తున్నారు. 1.50 లక్షల మంది పూర్తిగా భూమిలేని వ్యవసాయ కూలీలు. కోయలు గతంలో ఎన్నో రాజకీయ పోరాటాలు చేశారు. ఉదాహరణ : 1969లో శ్రీకాకుళం గిరిజనోద్యమం, అలాగే కొండ మొదలు గిరిజన పోరాటం, తెభాగా గిరిజన పోరాటం ముఖ్యమైనవి. ఒక్క శ్రీకాకుళ గిరిజనోద్యమంలోనే ఎంతోమంది గిరిజనులు ప్రాణాలు కోల్పోయారు. అలాగే ఆదిలాబాద్‌లోని ఇంద్రవెల్లిలో 13 మంది గిరిజనులు ప్రాణాలు కోల్పోయారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1970 నుండి గిరిజనులకు సంక్షేమ కార్యక్రమాలు ప్రవేశపెట్టింది.

ఆంధ్రప్రదేశ్‌లో కోయజాతి వారు ముఖ్యంగా నక్సలైట్ ఉద్యమంలో చురుకైన పాత్ర వహించారు. కోయజాతిలో ఎక్కువగా తెలుగు భాష, తెలుగు సాంప్రదాయాలు కనిపిస్తాయి.

**కోయల సాంఘిక నిర్మాణం**

కోయజాతిలో ఎన్నో ఉపజాతులున్నవి. ఒక్క ఆదిలాబాద్ జిల్లాలోనే 18 ఉపజాతులున్నవి. ఖమ్మం, కరీంనగర్, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలో ఈ కింది విధంగా ఉపజాతులున్నవి. అవి. 1. రాజకోయ 2. గుత్తకోయ 3. అడవి కోయ 4. డొల్ల కోయ 5. బొమ్మ కోయ 6. మన్నె కోయ 7. చిత్త కోయ 8. పుష్టి కోయ 9. చెంచు 10. లింగకోయ మొదలగునవి.

**కోయజాతిలో వృత్తిపరమైన విభజన**

వృత్తి ప్రాతినిధ్యంపై కోయజాతివారు ఈ క్రింది విధంగా విభజింపబడినారు. 1. కమ్మరి కోయ, 2. మూసర కోయ, 3. ఒడ్డి కోయ. వీరందరూ జీవనాధారంగా అటవీ సంపదపై ఆధారపడి జీవిస్తున్నారు. బెల్లం, తేనె, చింతపండు, జింక చర్మాలు, పులి చర్మాలు, పాము చర్మాలు, జీడిపప్పు, ఇప్పపువ్వు, తునికాకు, వేప తేనే, పులినెయ్యి, గోందు లేదా బంక, ఉసిరికాయలు మొదలగు ముఖ్యమైన వస్తువులను సేకరిస్తారు, మార్కెట్‌లో విక్రయిస్తారు. అడవికి దగ్గరగా ఉండే గ్రామాలకు గాని, లేదా తండాలకు గాని, పట్టణాలకు గాని వెళ్లి తాము సేకరించిన వస్తువులను అమ్ముకుంటారు. వారు వెదురు బొంగులు, కారెగడ్డి, తుంగతో గుడిసెలు వేసుకొని గూడెంలో జీవిస్తారు.

కోయస్త్రీలు ఎడమ చేతిపై పచ్చబొట్టు పొడుచుకుంటారు. సాధారణంగా హిందూ సాంఘిక ఆచారాలు పాటిస్తారు. పండుగలు, విందులు, వినోదాలు హిందూ ఆచారాలు వాడుకను బట్టి నిర్వహిస్తుంటారు. హిందువుల పండుగలైన దసరా, దీపావళి, సంక్రాంతి మొదలైన పండుగలు, ఇవే కాకుండా ఒక ప్రత్యేక ధోరణిలో నిర్వహించే పండుగలు 'భూమాత', 'యూర్వక', 'అమ్మోరు', మొదలైనవి.

వీరు నాగరికులకు దూరంగా 'అమ్మోరు' జాతర నిర్వహిస్తారు. మేకలు, గొర్రెలు బలి యిస్తారు. చిన్న పిల్లలను, కన్నెలను బలియిచ్చే సాంప్రదాయాలు అతి ప్రాచీన కాలంలో వుండేవి. (ఇప్పుడు చాలా వరకు మానుకున్నారు). జాతరలు వారిలో జాతి ఐక్యతను పెంపొందిస్తుంది. ఈ జాతరలు వారి పాడిపంటలు పిల్లాపాపల క్షేమం కొరకు తోడ్పడునని వారి నమ్మకం. ఉదాహరణకు వరంగల్ జిల్లాలో నిర్వహించబడే 'మేడారం' సమ్మక్క సారలమ్మల జాతర. 2. మగదపూర్ణిమ రోజున ఇది ఒక గొప్ప కోయజాతి జాతరగా గుర్తింపు పొందింది. వరంగల్ జిల్లాలోని ములుగులో కోయలు తెలుగు మిళితంగా మాట్లాడతారు. వీరు కోయదొరలని పిలిపించుకుంటారు. ఆదిలాబాద్‌లో గోండులు వరంగల్ కోయల కంటే భిన్నంగా మాటాడుతారు.

భారతదేశంలో కోయజాతివారు ఎక్కువగా కోరాపుట్, బస్తర్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో ఉన్నారు. 1901 జనాభా లెక్కలను బట్టి ఆంధ్రప్రదేశ్‌లో కోయల జనాభా విశాఖ పట్టణంలో 76,895 మంది. భద్రాచలం ఏజెన్సీ ప్రాంతంలో 24,329. కోరాపుట్ బస్తర్‌లో 3 లక్షలు.

**తెలంగాణా ప్రాంతంలో కోయల సాంఘిక వ్యవస్థ**

రాచకోయ జాతి, ఫారస్టీ, గట్టుతెగ, పారెడు గట్ట, కుటుంబం

**వృత్తిపరమైన శాఖలు**

వంశ పారంపర్యంగా, లింగదారి కోయ, రాచకోయ, కమ్మర, అరితదోలు.

విందులు, వివాహాలు ఒక తెగలోని వారిమధ్యనే వుంటాయి. ఒక వేళ ఒక తెగలోని స్త్రీ ఇతర తెగలోని పురుషుని వివాహమాడితే జాతి సంకరం అవుతుంది. వారిని బహిష్కరిస్తారు. ప్రతి తెగలోను వారికి సంబంధించిన న్యాయ వ్యవస్థ ఉంటుంది.

**వంశపారంపర్య పద్ధతి**

హిందువులలో వలె వంశపారంపర్య కులాచారాలు ఉంటాయి. లింగాదారి కోయలు అడవి పందులను తినరు. ఇతర కోయలతో కలువరు. విందులు, వివాహాలలో వీరికి ప్రత్యేక పద్ధతి ఉండును.

**సాంఘిక సంబంధాలు - రక్తసంబంధం**

గట్టి కోయ, మన్నె కోయ, మూసకోయ, అడవికోయ,

దొమ్మకోయ, రాచకోయలలో వంశపారంపర్య సంప్రదాయాలున్నవి. పెళ్లిళ్లలో రక్త సంబంధాలు పాటిస్తారు.

**పెళ్లిళ్లు**

కోయ కుటుంబాలను 'కుతుం' అంటారు. ఇవి చిన్న కుటుంబం, ఉమ్మడి కుటుంబం, ఒక స్త్రీకి ఒకే భర్త అనే పద్ధతి ఉంది. ఎక్కువ భర్తలున్నట్లు ఆధారాలులేవు. తల్లి యొక్క అన్న లేక తమ్ముని పెళ్లి చేసుకునే పద్ధతి కోయలలో ఉంది.

20 సంవత్సరముల వయస్సు వచ్చిన స్త్రీకి వివాహం చేస్తారు. గోండులలో కూడా రక్త సంబంధం అనుసరించి పెళ్లిళ్లు చేస్తారు. కోయ జాతిలో పెళ్లి సంబంధాలు 5 రకాలుగా వుంటాయి. 1. ఉభయ కుటుంబాలు అబ్బాయి-అమ్మాయి చర్చించుకొని నిర్ణయించుకోవడం. 2. బలవంతంగా అమ్మాయిని ఎత్తుకొని వెళ్లి పెళ్లి చేసుకోవడం. 3. లేచిపోవడం, 4. వచ్చి ఇంట్లో ఉండడం, 5. అబ్బాయి అమ్మాయి కుటుంబానికి సేవలు చేసి మెప్పు పొంది పెళ్లికి అంగీకరించే విధంగా చేయడం. అమ్మాయి అంగీకారం పెళ్లిళ్లలో చాలా అవసరంగా భావిస్తారు. అబ్బాయి అబ్మాయిని అపహరించుకపోయి ఒక కడవనిండ నీళ్లు అమ్మాయిపై పోస్తాడు ఇది పెళ్లికి ముందు సంకేతంగా భావిస్తారు.

'మరియా గోండులలో' కూడా ఈ పద్ధతి ఉంది. అబ్బాయి ఇంట్లో పెండ్లి జరుగుతుంది, అమ్మాయికి మూల్యం చెల్లించాలి. పెద్దలు మూల్యం నిర్ణయిస్తారు. పెళ్లి మూడురోజులు జరుగుతుంది. అబ్బాయి, అమ్మాయికి చెందిన బంధువులు మూడురాత్రులు నృత్యం చేస్తారు. వీటిని మార్చి నెలలో తాటి కల్లు దొరికే సమయంలో చేస్తారు. (అడవి దున్న ముఖంతో నృత్యం).

కోయజాతిలో పెళ్లి అబ్బాయి, అమ్మాయికి చెందిన రెండు కుటుంబాల మధ్య కాదు. మొత్తం రెండు తండాలు అనగా గ్రామాల మధ్య ప్రజలందరు పెళ్లిలో పాల్గొంటారు. పెళ్లిలో పాల్గొనే ప్రతివ్యక్తి కొంత ధాన్యం, మద్యం పట్టుకొని వస్తారు. ఈ రకం పెళ్లిళ్లలో కోయ జాతివారి సాంఘిక ఐక్యత వెల్లడించబడుతున్నది. అబ్బాయి వాళ్లు అమ్మాయి వాళ్లకు పెళ్లి నిశ్చయించుకునే రోజు రెండు కడవల మద్యం, ఆడమగ రెండు మేకలు, ఒక గొడ్డలి, పువ్వులు యిస్తారు.

**కోయ తెగల గ్రామీణ జీవితం**

కోయతెగలు సాధారణంగా 15 లేక 20 కుటుంబాలు కలిసి ఒకచోట జీవిస్తారు. భద్రాచలం లో మనం చూడవచ్చు. పోడు వ్యవసాయం చేసుకునే భూమిని ఆనుకొని గుడిసెలు ఉంటాయి. బంధుత్వం, రక్తసంబంధం అనుసరించి ఒక చోట జీవిస్తారు.

భౌగోళిక పరిసరాలను 'ముతా' అంటారు. ప్రతి గ్రామం ఒకే తెగ ఒకే రక్త సంబంధం కలవారిదై వుంటుంది. కాని కాలం గడిచినకొద్దీ ఇతర కోయ తెగలవారు వచ్చి పోడు వ్యవసాయం చేసుకొనుటకు ఒకచోట జీవించసాగినారు. వర్తమాన కాలంలో కోయజాతి వారిపై అడవులలో దాడులు ఎక్కువైనవి. అటవీ అధికారులు, అటవిక కాంట్రాక్టర్లు, అడవి దొంగలు వీరిపై దాడులు చేయడం ప్రారంభించారు. గిరిజనేతురులు కూడ అడవులలో ప్రవేశించి అడవులను నరకటం మొదలుపెట్టారు. అందువల్ల తప్పని పరిస్థితులలో కోయజాతి వలసపోవడం మొదలైంది.

సంప్రదాయ బద్ధంగా కోయలలో పెద్ద దొర వుంటాడు. అతనికి కోయగూడెం భూమి అమ్మే అధికారముంది. వ్యవసాయ భూమిపై కూడ అతనికే అధికారముంది. కోయలకు వ్యవసాయ భూమి సమష్టి ఆస్తి. బ్రిటిష్ వారి కాలంలో కోయజాతి భూములను బలవంతంగా పరాయీకరణ చేశారు. వారిని వారి భూములనుండి వెళ్లగొట్టారు.

కోయగ్రామ పెద్దమ్మను ముత్యాలమ్మ లేక దేవర అంటారు. గూడెంలో ఎలాంటి నేరాలు జరిగిన వీరి సమక్షంలో విచారించేవారు. కోయగూడెంలోని పదవులు వంశపారంపర్యంగా సంక్రమిస్తాయి. ఆస్తి పంపకాలలో కూడ వంశపారంపర్యంగా సంక్రమిస్తాయి. ఒక కోయ వ్యక్తి చనిపోతే అతని ఆస్తి అతని భార్య, కుమారులకు సంక్రమిస్తుంది. గూడెం పరిపాలనంత సంఘటితన గిరిజన బంధుత్వం, రక్తసంబంధంపై ఆధారపడియుండును. గిరిజన తగాదాలు పరిష్కరించుటకు గిరిజన పెద్ద ఉంటాడు. 15 గ్రామాలు కలిసి 'సమితి' ఉంటుంది. గిరిజన దొర అధ్యక్షతన పరిపాలన జరుగుతుంది. నేరస్తులను ప్రమాణము చేయిస్తారు. సమ్మక్క-సారలమ్మపై ఒట్టు పెట్టుకొని నిజం చెప్పాలి. ఆవు తోకను కళ్లకు అద్దుకొని ప్రమాణం చేయాలి. గిరిజన పెద్ద నేర విచారణ జరిపి దండుగ వేస్తారు. బలమైన గిరిజన సాంఘిక ఐక్యత ముందు నేరస్థులు తప్పించుకోలేరు. ◆

# వందేమాతర వివాదం - అపోహలు, యథార్థాలు

- డా. ఎస్.ఎం. రహ్మతుల్లా

(వందేమాతర గేయ రాజకీయం వలన మన దేశంలో మతపరమైన వివాదాలను ప్రబలకుండా చేసీ కుల మత విచక్షణారహితంగా దేశ పోరులందరిలో దేశాభివృద్ధి కొరకు జాతీయ సమైక్యత భావాన్ని పెంపొందించే మహత్తర ఉద్దేశ్యంతో వందేమాతర గేయ భావ స్వభావాన్ని, దాని చరిత్రను, దానిపట్ల ముస్లీంలు అవలంభిస్తున్న వ్యతిరేక వైఖరికి గల సమంజసాన్ని, స్వార్థ రాజకీయ నాయుకుల కుటిల రాజనీతిని అధ్యయనం చేస్తూ ఈ మొత్తం వివాదాస్పద వ్యవహారాన్ని భారత రాజ్యాంగ పరిధిలో సమీక్షించిన వ్యాసమిది).

వందేళ్ల చరిత్ర గల వందేమాతర గేయం ఆది నుండీ విమర్శలకు గురవుతూనే ఉంది. ప్రపంచ దేశాలలో ఏ గీతం కూడా దీనంత వివాదస్పదం కాలేదు అనడంలో అతిశయోక్తి లేదు. కొందరు దీనిని పాడాలంటారు, మరికొందరు కూడదంటారు. ఇంకొందరైతే మధ్యమార్గననుసరిస్తూ పాడితే పాడండి లేకపోతే లేదు మీ ఇష్టమంటారు. ఈ వివాదాస్పద చర్చ ఈనాటిది కాదు. ఎన్నాళ్ల నుంచో ఇది నిరంతరంగా కొనసాగుతున్నది. ఈ చర్చను కొందరు స్వార్థపరులు ముస్లీంల దేశాభిమానంతో ముడిపెట్టి వారికి వ్యతిరేకంగా ఉపయోగించుకునేందుకు గత కొన్ని సంవత్సరాలుగా ప్రయత్నిస్తూనే ఉన్నారు. తత్కారణంగా ముస్లీంలు ఈ గేయాన్ని వ్యతిరేకించడానికి బలమైన కారణమున్నప్పటికిన్నీ వారి దేశాభిమానం, పట్ల మన దేశ అమాయక ప్రజలలో నిరాధారమైన అపోహలు చోటు చేసుకున్నాయి. వందేమాతర గేయానికి నూరేళ్లు పూర్తయిన సందర్భాన్ని పురస్కరించుకొని 2006 సెప్టెంబరు 7న దేశవ్యాప్తంగా అన్ని పాఠశాలల్లో దాన్ని ఆలపించాలని కేంద్ర మానవ వనరుల మంత్రి సర్క్యులర్ జారీ చేయడంతో మన దేశంలో ఈ గేయం ద్వారా మరోమారు ముస్లీంల దేశాభిమానాన్ని శంకించేందుకు, తద్వారా మత విద్వేషాలను రెచ్చకొట్టి రాజకీయ లబ్ధి పొందేందుకు స్వార్థ రాజకీయ నాయకులకు మరో అవకాశం దొరికింది. ఈ నేపథ్యంలో ఈ వ్యాసంలో వందేమాతర గేయ భావ స్వభావాన్ని, దాని చరిత్రను, దానిపట్ల ముస్లీంలు అవలంబిస్తున్న వ్యతిరేక వైఖరికి గల సమంజసాన్ని, స్వార్థ రాజకీయ నాయకుల కుటిల రాజనీతిని అధ్యయనం చేస్తూ, ఈ మొత్తం వివాదాస్పద వ్యవహారాన్ని భారత రాజ్యాంగ పరిధిలో సమీక్షించడానికి ప్రయత్నించడం జరిగింది.

వందేమాతరం ఒక శతాబ్దానికి పూర్వం బంకించంద్ర చటర్జీ అనే సుప్రసిద్ధ బెంగాలీ రచయిత 1875లో 'బంగ దర్శన్' అనే పత్రికలో ప్రచురించిన ఒక గేయం. ఈ గేయం మొదటి చరణాలు దేశాభిమానం, దేశ ప్రేమ, దేశ ప్రకృతి వర్ణనలపై ఆధారపడి ఉన్నాయి. ఈ విషయంలో ఎవరికీ ఎటువంటి సందేహమూ వివాదమూ లేదు. అయితే మిగతా చరణాలలో ఒక మతానికి అనుకూలమై ఇంకో మతమైన ఇస్లాం ప్రబోధాలకు వ్యతిరేకమైన భావాలున్నాయన్న విషయం కూడా అందరికీ తెలుసు. దీనికి తోడు బ్రిటీష్ పాలకులను ప్రశంసిస్తూ ముస్లీంలను వ్యతిరేకిస్తూ 1882లో తాను రచించిన 'ఆనందమఠ్' నవలలో బంకించంద్ర చటర్జీ వందేమాతర గేయాన్ని చేర్చాడు. స్వతంత్ర్య ఉద్యమ రోజులలో వందేమాతర గేయాన్ని తమదిగా స్వీకరించి దానిని ఆలపించడంతోనే తమ ప్రతి కార్యక్రమాన్ని మొదలుపెట్టే కాంగ్రెస్, అందులో ఒక మత సంబంధిత భావాలుండడం వలన ఇక మీదట సభల్లో, సమావేశాల్లో ఈ గేయం మొదటి చరణాలను మాత్రమే పాడాలని 1937లోనే తీర్మానించింది. అంటే మిగతా చరణాల గురించి భారతదేశ ప్రజానీకంలో వివాదముందని అప్పుడే నిర్ధారించడమైనది. అప్పటి నుంచి తమ సభల్లో వందేమాతర గేయం మొదటి చరణాలను మాత్రమే పాడడం కాంగ్రెస్ పార్టీకి ఆనవాయితి అయ్యింది. దీనికితోడు వందేమాతర గేయంలో ఎంపిక చేసిన చరణాలను మాత్రమే యావత్ జాతికి బెంగాల్ ఇచ్చిన బహుమతి అని 1939 నాటి 'హరిజన్' సంచికలో మహాత్మగాంధీయే ప్రస్తుతించారు. పండిత్ నెహ్రూ, రవీంద్రనాథ్ ఠాగూర్, డా. లోహియా, సుభాష్ చంద్రబోస్ తదితరులు కూడా అనేక సందర్భాలలో వందేమాతర గేయంలో వివాదాస్పదమైన అంశాలున్నట్లు తమ అభిప్రాయాలను వ్యక్త పరిచారు. అయితే ఆది నుంచి కూడా విమర్శలకు లోనౌతున్నప్పటికిన్నీ ఈ గేయం స్వాతంత్ర్య ఉద్యమంలో ఒక విప్లవ నినాదంగా, ఒక పోరాట గీతంగా ప్రతిధ్వనిస్తూ ఆంగ్లేయపాలకులను హడలెత్తిస్తూ స్వాతంత్ర్య పోరాటానికి చేయూత నిచ్చిందని చెప్పకతప్పదు. స్వాతంత్ర్య సమరంలో ఈ గేయం రగిలించిన పోరాట స్ఫూర్తిని దృష్టిలో పెట్టుకొని దీనిని 'నేషనల్ సాంగ్' గా రాజ్యాంగ సభ గుర్తించింది. ఇది క్లుప్తంగా వందేమాతర గేయ స్వభావం, దాని చరిత్ర.

ఇక మనం వందేమాతరం పట్ల ముస్లీంలు అవలంబిస్తున్న వైఖరిని పరిశీలిద్దాం. స్వాతంత్ర్య ఉద్యమంలో కుల మత విచక్షణారహితంగా అందరితో కలసి దేశ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసం పాటుపడి, స్వాతంత్ర్యానంతరం తోటిపౌరులతో కలిసి దేశాభివృద్ధి కొరకు శ్రమిస్తున్న ముస్లీంలు, గత వందేళ్లకు పైగా వందేమాతర గేయంలోని కొన్ని చరణాలను వ్యతిరేకిస్తున్నారు. ఇది యదార్థం. ఇందులో ఎటువంటి సందేహం లేదు. అయితే ముస్లీంల ఈ వైఖరిని విజ్ఞతతో పరీక్షించినట్లయితే, ఈ గేయంలోని కొన్ని చరణాల పట్ల ముస్లీంలు లేవనెత్తిన అభ్యంతరాలలోని సమంజసాన్ని అంగీకరించక తప్పదు. వందేమాతర గేయం పట్ల ముస్లీంల వ్యతిరేకతను అర్థం చేసుకోవడానికి గాను ప్రేమ, పూజ, సృష్టి, సృష్టికర్తల అర్థములను, వాటి మధ్య గల వ్యత్యాసాన్ని దృష్టిలో ఉంచుకోవడం చాల అవసరం. ఈ సమస్త సృష్టిలో మనం దేన్నైనా ప్రేమించవచ్చును. దీన్నెవరు కాదనలేరు. అయితే సృష్టి అంతా దైవాధీనంలోనే ఉంటుంది కాబట్టి పూజింపబడే అర్హత సృష్టికి కాకుండా ఒక్క సృష్టికర్తకే గలదని చెప్పక తప్పదు. మాతృభూమి ప్రతి

ఒక్కరికి ప్రేమదాయకమే. ముస్లీంలు తమ దేశాన్ని అమితంగా ప్రేమిస్తున్నారు. అవసరం వచ్చినప్పుడు తమ దేశం కోసం ధన, మాన ప్రాణాలను కూడా అర్పించడానికి ఎల్లవేళలా వారు సిద్ధంగానే ఉన్నారు. అయితే ముస్లీంల దేశాభిమానాన్ని వందేమాతరంతో ముడిపెట్టడం సమంజసం కాదు. ఈ గేయంలో అవివేకానికి పరాకాష్టగా మాతృభూమికి భగవంతుని హోదాను కల్పించి సృష్టిని సృష్టికర్తగా అభివర్ణించడం జరిగింది కాబట్టి ముస్లీంలు ఈ గేయంలోని కొన్ని చరణాలను వ్యతిరేకిస్తున్నారని గ్రహించాలి. విజ్ఞతతోపాటు మతపరమైన సమీక్షను జరిపినప్పటికిన్నీ వందేమాతరం పట్ల ముస్లీంల వైఖరిని సమర్థించక తప్పదు. సాధారణంగా ప్రతి మనిషి ఏదో ఒక మతాన్ని కలిగి ఉండి తన మత విశ్వాసానుసారంగానే ప్రతి విషయంలోనూ తన ప్రవర్తనను మలుచుకుంటాడు. మతంపై విశ్వాసం గల వారెవ్వరు దీన్ని నిరాకరించలేరు. ముస్లీంలు ఇస్లాం మతంను కలిగి ఉన్నారు. ఇస్లాం మతానుసారం 'అల్లాహ్' తప్ప మరెవ్వరు పూజార్హులు కారు. ఇతరులను పూజించువాడు ముస్లీం కాడు. వందేమాతరం గేయంలో భారతదేశాన్ని ముస్లీమేతరులైన కొందరు పూజించే దుర్గ, లక్ష్మీ, సరస్వతి దేవతలతో పోల్చడం జరిగింది కాబట్టి ముస్లీంలు ఈ గేయాలాపన చేయడానికి మతపరంగా ఇష్టపడరు. అలా అని వారు ఈ గేయాలాపన చేయరాదని ఇతరులను ఎప్పుడూ నిరోధించలేదు. ఈ సందర్భంలో గమనించాల్సిన విషయమేమంటే ఒక మతాన్ని కలిగిఉండి దానినే ఆచరించే వారు వేరొక మతస్తులను ముఖ్యంగా ముస్లీంలను వారి మత విశ్వాసాలకు విరుద్ధంగా ప్రవర్తించమని బలవంతం చేయడం సమంజసమేనా? ఈ ధోరణి ప్రజాస్వామ్య హక్కులకు విరుద్ధమైన వారి ద్వంద్వ వైఖరికి నిదర్శనం కాదా? వారి ఈ ద్వంద్వ వైఖరి మన దేశ ప్రశాంత వాతావరణాన్ని కలుషితం చేసి మత విద్వేషాలను రెచ్చగొట్టే విధంగా లేదా? ఈ ప్రశ్నలు ప్రజాస్వామ్యవాదులందరిని ఈ గేయ విషయంలో నిరంతరంగా వేధిస్తూనే ఉన్నాయి.

ఇప్పుడు మనం వందేమాతరం పట్ల ముస్లీంలు అవలంబిస్తున్న వైఖరిని, దానిని వ్యతిరేకిస్తున్న వారి ధోరణిని భారత రాజ్యాంగ పరిధిలో పరిశీలిద్దాం. భారత రాజ్యాంగం పౌరులందరికి వ్యత్యాసరహితంగా సమాన హక్కులను ప్రసాదించింది. భారత పౌరులందరు తమ తమ మతాల కనుగుణంగా మత విధులను నిర్వహించుకొనే స్వేచ్ఛను కలిగి ఉన్నారు. స్వతంత్ర ప్రతిపత్తి గల న్యాయస్థానాలు పౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు రక్షణ ఇస్తాయి. భారత రాజ్యాంగ 25వ ప్రకరణ ప్రకారం ప్రతి వ్యక్తీ తన అంతరాత్మ ప్రభోధం ప్రకారం తనకు నచ్చిన మతాన్ని స్వేచ్ఛగా స్వీకరించవచ్చును. భారత రాజ్యాంగ 28వ ప్రకరణ ప్రభుత్వ విద్యాలయాలలో ఏ మత బోధన జరగరాదని విద్యా సంస్థలలో విద్యార్థుల ఇష్టానికి వ్యతిరేకంగా మతబోధ విషయంలో నిర్బంధం, ఒత్తిడి ఉండకూడదని స్పష్టం చేస్తున్నది. కొన్ని వందల సంవత్సరాల నుంచి మతసామరస్యానికి స్వేచ్ఛకు ప్రతీకగా నిలచి, స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగం ద్వారా దేశంలో లౌకిక రాజ్యాన్ని స్థాపించి, పౌరులందరికి సమాన హక్కులను కల్పించిన మహోన్నతమైన భారతదేశంలో ముస్లీంలను వారి మత విశ్వాసాలకు విరుద్ధమైన గేయాలాపన చేయమని బలవంతం చేయడం, దీని కొరకు ప్రభుత్వాదేశాలను జారీ చేయడం, ఈ గేయాలాపన చేయని ముస్లీంలను దేశ ద్రోహులనడం, ఈ దేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే ననడం ముమ్మాటికి అవివేకం. నియంతృత్వ పూరిత దౌర్జన్యం. భారత సంస్కృతి సంప్రదాయాలకు వ్యతిరేకం, రాజ్యాంగ విరుద్ధం. కేంద్రంలో భారత అధ్యక్షుడు, రాష్ట్రాలలో గవర్నర్లు రాజ్యాంగ పరిరక్షకులు. కావున వారు దేశంలో న్యాయపాలనను పరిరక్షించడానికి గాను తమ రాజ్యాంగాధికారాలను ఉపయోగించాలి. పదవీ బాధ్యతలను స్వీకరించేటప్పుడు రాజ్యాంగబద్ధంగా వ్యవహరిస్తామని ప్రతిజ్ఞ చేసిన తరువాత రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా ప్రవర్తించే రాజకీయ నాయకులను అధికారం నుంచి బర్తరఫ్ చేయాలి. దేశంలో మత విద్వేషాలను రెచ్చగొట్టే వారిని కఠినంగా శిక్షించాలి. అప్పుడే ఈ దేశంలో ప్రజాస్వామ్యం రక్షింపబడుతుంది.

దేశ సర్వతోముఖాభివృద్ధికి జాతి సమైక్యత, కుల, మత, భాష, ప్రాంతాల కతీతమైన కృషి తప్పనిసరి. అందువలన దేశ పౌరులందరు లౌకిక జీవన విధానాన్ని విడనాడకుండా సర్వమత సహనాన్ని దెబ్బతీసే శక్తుల నీచరాజకీయాలను కాలరాస్తూ దేశాభివృద్ధి కొరకు పాటు పడాలి. ఇది ఈ దేశ పౌరులందరి కనీస తక్షణ కర్తవ్యం. ఇది గుర్తించని వారే దేశభవిష్యత్తును విచ్ఛిన్నం చేసే ప్రమాదకారులు. వారి బారి నుండి దేశాన్ని కాపాడుకుందాం. ◆

## రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

## చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటి వారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

**– సర్క్యులేషన్ మేనేజర్**
9949391028

# నూనె సీసా, విప్లవ సంభాషణ

**– శివవర్మ సంస్మృతుల్లోంచి**

చిన్న చిన్న విషయాలకుకూడా నేనూ, భగత్‌సింగూ తగాదా పడుతుండేవారం. ఒకరోజు నేను బజారునుంచి సామానులు తీసుకొచ్చాను. వాటిలో ఒక నూనె సీసాకూడా వుంది. కొంతసేపట్లో భగత్‌సింగ్ వచ్చాడు. కొద్దిసేపు అవీఇవీ మాట్లాడిం తర్వాత తలగోక్కుంటూ 'భాయీ! ఈ సీసాలోని నూనె కొంచెమివ్వు. చాలా రోజుల నుంచి తలకు నూనె రాసుకోలేకపోయాను. తల దురద పెడుతోంది' అన్నాడు భగత్‌సింగ్.

నేను బజారునుంచి అప్పుడే వచ్చాను. చాలా అలసికూడా వున్నాను. ఇంకా సీసా మూతకూడా తీయలేదు. అప్పుడే అతను నూనె ఇమ్మని ఆజ్ఞాపించాడు. నేను కొంచెం కోపంలో కూడా వున్నాను. 'భాయీ ! నిన్ను అర్థం చేసుకోవడమే కష్టంగా వుంది. నేను భోంచేస్తుంటే నా పళ్లెంలోంచే రొట్టె తుంచుకుంటావు. బజారునుంచి నేను తెచ్చిన నూనెను చూడగానే నీ తల దురదపెడుతుంది. నీకు నిజంగానే నూనె కావాలా లేక నన్ను ఉడికించాలని అడుగుతున్నావా ? ఏమైనా సరే ఈ రోజు నీకు నూనె ఇవ్వనుగాక ఇవ్వను' అని అన్నాను. కాని భగత్‌సింగ్ పట్టుదలగా మట్లాడసాగాడు. 'నీవద్ద నూనె వున్నప్పుడు, దాని అవసరం నాకు వున్నప్పుడు దాని నేను తీసుకోకుండావుండను. నీవుగా ఇవ్వకపోతే నేను లాక్కుంటాను. మనిద్దరి పోట్లాటలో సీసా పగిలిపోవచ్చు. నూనె మనిద్దరికి దక్కకపోవచ్చు. అప్పుడు మనిద్దరం బాధపడాల్సి వస్తుంది'. 'నీవు నా వస్తువును దౌర్జన్యంగా లాగుకో చూస్తున్నావు ఇది దోపిడి గాక మరేమిటి?' అని నేనరచాను. 'నీవు దీన్ని దోపిడీ అనైనా అనుకో, లేక మరేమైనా అనుకో. నేను నూనె తప్పక తీసుకుంటాను' అన్నాడు భగత్‌సింగ్.

దీని తర్వాత కొద్దిసేపటి వరకు సీసాకోసం మా ఇద్దరిమధ్యా సంఘర్షణ జరిగింది. భగత్‌సింగ్ నా మణికట్టును త్రిప్పి, నా చేతిలోంచి సీసాను లాగుకుని, బిరడా తీసి తన తలపై ఒంపుకున్నాడు. అతను తన పొడవాటి వెంట్రుకలను బాగా విప్పి తలకు పూర్తిగా నూనె పట్టించాడు. అతను సీసాలోని నూనెనంతటినీ ఒంపుకొని వెంట్రుకలను సవరించుకోసాగాడు. అది చూచి నాకాశ్చర్యం వేసింది. అది చూడదగిన దృశ్యం. నూనెవల్ల వెంట్రుకలు నునుపుదేలడమే గాక తలనుంచి నూనె కారబోయేటట్లుంది. 'ఇక వెంట్రుకల ఆకలి తీరిపోయింది. ఒక వారంవరకు నూనె రాసుకొనే పనిలేదు' అని భగత్‌సింగ్ సంతోషంగా చెప్పుకుపోయాడు. నూనె అంతా ఒంపుకున్న తర్వాత అతను ఖాళీ సీసాను నా చేతికివ్వబోయాడు. నేను తీసుకో నిరాకరించాను. అతను ఖాళీ సీసాను అక్కడ బల్లపైన వుంచేశాడు.[1]

ఒకసారి ఫ్రెంచి నవలాకారుడు విక్టర్ హ్యూగో రచన 'నైంటీత్రీ'లోని ఒక ఘటన గురించి భగత్‌సింగ్‌కూ, సుఖదేవుకూ అభిప్రాయభేదం వచ్చింది. ఫ్రాన్స్‌లో చక్రవర్తి సైన్యాలకూ, విప్లవ సైనికులూ యుద్ధం జరుగుతుంది. విప్లవ సైన్యాలు విజయం సాధిస్తాయి. శత్రు సైన్యాధ్యక్షుడు 'లాంత్నక్' ఖైదు చేయబడతాడు. విప్లవ సైన్యాధినేత 'గావెన్' లాంత్నక్ వంశానికే చెందిన యువకుడు. అతడు లాంత్నక్ సోదరుని మునిమనమడూ, అతని సంస్థానానికి వారసుడూకూడా. ఉరి తీయడానికి ముందు రాత్రి గావెన్ తన చినతాతను చెరసాల గదిలో కలుసుకుంటాడు. గావెన్ చక్రవర్తి కుటుంబానికి ద్రోహం చేసి ప్రజాతంత్రవాదులతో చేయి కలిపాడని లాంత్నక్ అతడ్ని గర్హిస్తాడు. గావెన్ కోమలమైన హృదయ తంత్రులను కూడా స్పందింపజేస్తాడు. చివరకు గావెన్‌కు వృద్ధుడైన లాంత్నక్ మీద జాలేస్తుంది. అతడు తన సైన్యాధినేత ఉడుపులను చినతాతకు ధరింపజేసి, రక్షకుల కళ్లు కప్పి చెరసాల నుంచి అతడ్ని బయటకు తప్పిస్తాడు. అతనికి బదులుగా తానే జైలుగదిలో బందీగా ఉండిపోతాడు. మరురోజు వుదయం ఉరితీయబడడానికి ఖైదిని వెలుపలికి తెచ్చినపుడు లాంత్నక్‌కు బదులుగా గావెన్ వుండడం చూచి అందరూ ఆశ్చర్యపోతారు. విప్లవ సైన్యాల మధ్య ప్రజాసురక్షా పరిషత్ ప్రతినిధిగా 'సిమర్దిన్' అనే మత గురువు కూడ వుంటాడు. అతడు గావెన్‌కు బాల్యంలో విద్య గరిపినవాడేగాక, తండ్రిలా ప్రేమించిన వాడు. సిమర్దిన్ కర్తవ్య నిర్వహణలో ఎంత పట్టుదల గలవాడో, మానవ సహజమైన మృదుభావలలో అంత దుర్బలుడు. గావెన్ అతని ఎదుట తన నేరాన్ని ఒప్పుకున్నాడు. సిమర్దిన్ ఆధ్వర్యాన విప్లవ న్యాయస్థానం విప్లవానికి ద్రోహం చేసిన నేరానికి గాను అతనికి మరణదండన విధించింది.

ఉరితీయదానికి ముందు రాత్రి సిమర్దిన్ గావెన్‌ను చెరసాల గదిలో కలుసుకుంటాడు. సిమర్దిన్‌ను చూడగానే గావెన్ మర్యాద పూర్వకంగా లేచి నిలబడతాడు. ఇద్దరి కళ్లనుంచి కన్నీరు ప్రవాహంగా కురుస్తుంది.

మరురోజు ఉదయం వధ్య స్థలంలో గావెన్ చేతులు కట్టబడి నిలుచున్నాడు. సైనికులు ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నారు. ఎదుట ఒక బురుజు మీద సిమర్దిన్ నిలబడి వున్నాడు. అతని చేతి సైగతో పాటు గావెన్ మృతశరీరం భూమ్మీద పడుతుంది. దానితోపాటే ఒక పిస్తోలు పేలిన శబ్దం వినబడుతుంది. సిమర్దిన్ శరీరం కూడ బురుజు పైనుండి నేలపై కూలుతుంది. అతడు ఆత్మహత్య చేసుకుంటాడు.

ఆత్మహత్య చేసుకుని సిమర్దిన్ విప్లవకారుల ముందు మంచి ఆదర్శాన్ని వుంచలేదనేది సుఖదేవ్ వాదన : విప్లవానికి అతని అవసరం అధికంగా ఉన్న సమయాన సిమర్దిన్ ఒక యువకునిపట్ల మోహంతో తన లక్ష్యాన్ని కాలదన్నాడు. సిమర్దిన్ ఏనాడో తన జీవితాన్ని విప్లవాదర్శానికి అంకితం చేసేశాడు. అటువంటివాడు మధ్యలో తన ఆదర్శ మార్గం నుంచి తప్పుకోవడానికి వీల్లేదనేది సుఖదేవ్ అభిప్రాయం. విప్లవ వీరునికి భావావేశమో, వ్యక్తిగత మమతా, వాత్సల్యాలో వుండడాన్ని సుఖదేవ్ అంగీకరించలేదు.

దీనికి వ్యతిరేకంగా భగత్‌సింగ్ సిమర్దిన్ పట్ల సానుభూతి చూపాడు. సిమర్దిన్ గావెన్‌కు మరణశిక్ష విధించి విప్లవోద్యమం పట్ల

తన కర్తవ్యాన్ని నిర్వర్తించాడు. అయితే అతనూ మానవుడే : మానవ సహజమైన వాత్సల్య పూరితమైన హృదయం అతనికుంది. అతను గావెన్‌ను పుత్రునితో సమానంగా చూచుకున్నాడు. కాబట్టి గావెన్ మృత్యువును సిమర్దిన్ ఓర్చుకోలేకపోయాడు. మానవుల మధ్య తరతరాలుగా వస్తోన్న మమతానుబంధాల్ని గౌరవించడం ద్వారానే విప్లవ ధర్మాన్ని కూడ మనం సరిగ్గా నిర్వహించగలమని భగత్‌సింగ్ చెప్పాడు. "మనం మానవులుగా వుండే విప్లవకారులం కాగలం. దేవతలుగా వుండి కాదు. దైవత్వంలో చలనమో ప్రగతో, శాశ్వత ప్రవాహమో వుండదు"

నాకు జ్ఞాపకమున్నంత వరకు ఆనాడు ఎంతో సేపు తీవ్రంగా చర్చించుకున్న తర్వాత కూడ భగత్‌సింగ్‌కూ, సుఖదేవ్‌కూ ఏకాభిప్రాయం ఏర్పడలేదు. చివరకు సుఖదేవ్ "దైవత్వం గురించి నీవు చెప్పింది ఒప్పుకుంటా గానీ, కవుల్లా వాదించే నీ నవలా తర్కం నాకర్థం కాలేదు" అని చెపుతూ లేచిపోయాడు.

భగత్‌సింగ్‌కు ముందున్న విప్లవకారుల ప్రధాన లక్ష్యం దేశ స్వాతంత్ర్యం మాత్రమే. కానీ ఈ స్వాతంత్ర్యం ఎలా వుండాలి అనే విషయంలో మాకెవరికీ స్పష్టమైన అభిప్రాయాలు లేవు. ఆంగ్లేయ వైస్రాయిని తొలగించి ఆయనకు బదులుగా ఒక భారతీయ వైస్రాయిని వుంచేస్తే సమస్య పరిష్కరమైపోతుందా? మన సమాజంలో ఆర్థిక అసమానత్వం, ఒక మనిషిని మరో మనిషి దోచుకుంటూండగా నిజంగా మనం స్వాతంత్ర్యాన్ని అనుభవించగలమా? దేశ స్వాతంత్ర్యం తర్వాత ఏర్పడే ప్రభుత్వం ఎవరిదిగా వుండాలి? అప్పటి సాంఘిక వ్యవస్థ ఎలా వుండాలి? ఇటువంటి విషయాల గురించి విప్లవ వీరులలో అస్పష్టత అత్యధికంగా వుండేది. భగత్‌సింగ్ అందరికన్నా ముందుగా ఈ సమస్యలను లేవనెత్తి సోషలిజాన్ని పార్టీ ధ్యేయంగా ముందుంచాడు. మన స్వాతంత్ర్య పోరాటం గమ్యస్థానం ఒకవైపు ఒక ముందడుగు మాత్రమేననీ, అక్కడే మనం ఆగిపోతే మన మహాప్రస్థానం అసంపూర్ణమై పోతుందని అతడు చెప్పేవాడు. సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా కేవలం రాజకీయ స్వాతంత్ర్యం కొందరు పలువురిని దోచుకునే స్వాతంత్ర్యంగానే వుంటుంది. దోపిడీ అసమానత్వాల నిర్మూలన అనే సిద్ధాంతం పైన నిర్మింపబడ్డ సోషలిస్టు సమాజంలోనే, సోషలిస్టు రాజ్యాధికారంలోనే సర్వతోముఖమైన దేశాభివృద్ధి సాధ్యమవుతుంది.

సోషలిజం ఆ కాలంలో యుగనినాదంగా వుంది. విప్లవకారులలో భగత్‌సింగే మొట్టమొదట ఆ నినాదాన్ని విన్నాడు, గుర్తించాడు. ఇక్కడ అతను తన ఇతర మిత్రులందరికంటే ముందున్నాడు.

భగత్‌సింగ్‌కు మునుపు విప్లవకారుల దేశవ్యాప్తమైన సంస్థ ఏదీలేదు. బెంగాల్‌లో 'యుగాంతర్', 'అనుశీలన్' మున్నగు సంస్థలుండేవి. పంజాబులో 'గదర్' పార్టీ పనిచేస్తుండేది. ఉత్తరప్రదేశ్, బీహారుల్లో ప్రధానంగా 'హిందుస్థాన్ ప్రజతంత్ర సంఘం' పనిచేస్తుండేది. అమరవీరులను అందరూ సమానంగానే కీర్తించవచ్చు. కానీ వారిలో పరస్పర సహకారమేదీ వుండేదికాదు. భగత్‌సింగ్ అందరినీ ఏకం చేసి దేశవ్యాప్తమైన సంస్థనొకదాన్ని స్థాపించాలనుకున్నాడు. ఈ ఉద్దేశ్యంతోనే అతను 1928వ సంవత్సరం సెప్టెంబర్‌లో ఢిల్లీలో అన్ని ప్రాంతాలకు చెందిన విప్లవకారుల ప్రతినిధులతో ఒక సమావేశం ఏర్పాటు చేశాడు. ఆ సమావేశానికి ఉత్తరప్రదేశ్, బీహార్, రాజస్థాన్, పంజాబ్ నుంచి పదిమంది ప్రతినిధులు హాజరయ్యారు. బెంగాల్ విప్లవకారుల్లో చాలామంది అప్పుడు జైళ్లలో వున్నారు. వెలుపల వున్న కొద్దిమంది మాసోషలిస్టు భావాలతోనూ, ప్రజాతంత్ర పద్ధతులతోనూ ఏకీభవించలేదు. అందువల్ల వారు ఢిల్లీ సమావేశంలో పాల్గొనడానికి నిరాకరించారు.

ఢిల్లీ సమావేశానికి భగత్‌సింగే అధ్యక్షత వహించాడు. అతని సూచనమేరకు 'సోషలిజం' పార్టీ లక్ష్యంగా అంగీకరించబడింది. పేరు కూడ 'హిందూస్తాన్ ప్రజాతంత్ర సంఘం' నుంచి 'హిందూస్తాన్ సోషలిస్టు ప్రజాతంత్ర సంఘం' అని మార్చబడింది. దీని అర్థం మేం మార్క్సిజాన్నో, వైజ్ఞానిక సోషలిజాన్నో సంపూర్ణంగా బోధనపరచుకున్నామని కాదు. అది సోషలిజం వైపు మేం వేసిన మొదటి అడుగు మాత్రమే. మేము సమాజంలోని వర్గ తారతమ్యాలను అర్థం చేసుకున్నాం. రైతు, కూలీల ప్రభుత్వ స్థాపనే మా లక్ష్యమయింది. అయితే రైతు, కూలీల సంఘటిత శక్తితో ఈ లక్ష్యాన్నెలా సాధించగలమనే విషయం మేం పూర్తిగా అర్థం చేసుకోలేదు.

సమావేశంలో తీసుకున్న రెండవ నిర్ణయం సంస్థను ప్రజాతంత్రీకరించడం, ఎవరో ఒక వ్యక్తిని ఉద్యమాభినేతగా చేసి, అతని మంచి చెడ్డలపై అన్నిటిని వదిలివేయడం భగత్‌సింగ్‌కు ఇష్టంలేదు. అతని సలహాలపైనే ఉద్యమ నిర్వహణకు ఒక కేంద్ర కమిటీ ఏర్పాటు చేయబడింది. విధాన నిర్ణయాలలో దానికే సంపూర్ణాధికారం అప్పగించబడింది. ఈ సమావేశంలోనే సుఖదేవ్ పంజాబ్‌కు, ఫణీంద్రఘోష్ బీహారుకు, కుందన్‌లాల్ రాజస్థాన్‌కు, శివవర్మ (నేను) ఉత్తరప్రదేశ్‌కు కన్వీనర్లుగా ఎన్నుకోబడ్డాం. భగత్‌సింగ్‌కూ, విజయకుమార్ సిన్హాలకు ప్రచారం, అంతర్ ప్రాంతీయ సంబంధాల బాధ్యతా ఇవ్వబడినాయి. ఈ ఆరుగురితో చంద్రశేఖర్ ఆజాద్‌ను కలుపుకొని కేంద్రకమిటీ నిర్మించబడింది. ఆ సమావేశంలో జయదేవ్‌కపూర్, సురేంద్రనాథ్ పాండే, బ్రహ్మదత్త మిశ్రా, బీహారుకు చెందిన మన్‌మోహన్ బెనర్జీ కూడా పాల్గొన్నారు.

పార్టీకి ఒక సైన్యాధ్యక్షుణ్ని కూడా ఎన్నుకొనే విధానం అవలంబించబడింది. చంద్రశేఖర్ ఆజాద్ మొదటి పార్టీ సైన్యాధ్యక్షుడయ్యారు. సమావేశంలో ఆజాద్ పాల్గొనలేక పోయినప్పటికీ భగత్‌సింగ్, విజయకుమార్ సిన్హా ముందుగానే ఆయన్ను కలుసుకుని అన్ని విషయాలనూ చర్చించారు. వారి సూచనలను ఆజాద్ ఆమోదించారు కూడా !

ఇంతకు మునుపు విప్లవకారుల అత్యధికశక్తి ప్రభుత్వం తరపున సాక్ష్యమిచ్చేవారిని, అప్రూవర్‌లను, సి.ఐ.డి. శాఖాధికారులనూ చంపడంలోనూ, డబ్బు కోసం దోపిడీలు సాగించడంలోనూ ఖర్చయిపోతూండేది. ఈ కార్యక్రమాలవల్ల పొందేలాభం కంటే ఎక్కువగా ప్రాణాల్ని బలిఇచ్చి వచ్చేవారం. ఢిల్లీ సమావేశంలో ఈవిషయం గురించి కూడా నిర్ణయం తీసుకోబడింది. వీలయినంతవరకు ప్రభుత్వ సొమ్మునే దోచుకోవాలని నిశ్చయించుకున్నాం. ప్రజలతోను, దేశరాజకీయ సమస్యలతోను ప్రత్యక్ష సంబంధమున్న వాటినే 'యాక్షన్స్'[2] కు తీసుకోవాలనుకున్నాం. ఈ నిర్ణయాలన్నింటి వెనుక భగత్‌సింగే ప్రధాన సూత్రధారి !

రాజకీయాందోళనల దృష్ట్యా 1928వ సంవత్సరం చాలా ప్రాధాన్యత గలది. దేశవ్యాప్తంగా పెద్ద పెద్ద కార్మికుల సమ్మెలు జరుగుతున్నాయి. ప్రపంచ వ్యాప్తమైన పెట్టుబడిదారీ వ్యవస్థ ఆర్థిక సంక్షోభం, నీలి నీడలు భారతదేశంపై కూడా పడ్డాయి. ఇందువల్ల రైతులు, మధ్యతరగతి వారు జాతీయ పెట్టుబడిదారులు కూడా కష్టాలపాలైరి. సంక్షోభంలో చిక్కుకున్న బ్రిటిష్ పెట్టుబడిదారులకు కొంత వెసులుబాటు కల్గించడానికై ప్రభుత్వం రూపాయి విలువను ఒక షిల్లింగ్ విలువ నాలుగు పెన్నీల నుంచి ఆరుపెన్నీలుగా నిర్ణయించింది. ఇందువల్ల ఆంగ్లేయ వ్యాపారులూ, పెట్టుబడిదారులూ రాత్రికి రాత్రే అనేక లక్షల రూపాయలు సంపాదించుకోవడానికి మార్గం సుగమం చేయబడింది. మరోవైపు స్వదేశీ ఉక్కు పరిశ్రమకు ఇచ్చివుండిన సంరక్షణను ప్రభుత్వం రద్దు చేసింది. ఇందువల్ల విదేశీ ఉక్కు దేశంలో ప్రవాహంలా వచ్చిపడింది. దీంతో భారతీయ పెట్టుబడిదారీవర్గం కూడా అసంతృప్తి చెందింది. దేశవ్యాప్తమైన ఈ అసంతృప్తిని ఉపశమింపజేయడానికై ప్రభుత్వం కొన్ని సంస్కరణల ఎర చూపి, సైమన్ కమిషన్ ఏర్పాటును ప్రకటించింది. ఈ కమిషన్ సభ్యులందరూ ఆంగ్లేయులే, భారత దేశంలోని రాజకీయ పక్షాలన్నీ ఈ కమిషన్ నిర్మాణాన్ని వ్యతిరేకించాయి. దీని తర్వాత కూడా సైమన్ కమిషన్ భారతదేశానికి వచ్చింది. దేశమంతా దానిని బహిష్కరించింది. ప్రజలు కమిషన్ రాకను నిరసించి సమ్మెలు చేశారు. 'సైమన్ కమిషన్ తిరిగి వెళ్ళిపో' నినాదాలతో నల్లజెండాలు చూపారు. బ్రిటిష్ ప్రభుత్వం వీటినేమీ ఖాతరు చేయలేదు. ప్రజల అభిలాషలకు విరుద్ధంగా ఆ కమిషన్ దేశం మీద రుద్దబడింది. ఇది మన భారతదేశానికే ఘోర అవమానం.

మేము ఉత్తర భారతదేశంలో సైమన్ కమిషన్ను వెంబడించాలని నిశ్చయించాం. కమిషన్ ఢిల్లీకి వచ్చినపుడు భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తు, జయదేవ్ కపూర్ ముగ్గురూ కమిషన్ సభ్యులకు దగ్గరగా వెళ్ళాలని ఢిల్లీ వీధులంతా గాలించారు. కానీ వారి నీడలను కూడా మన వారు చూడలేకపోయారు. ఆ సమయంలో ఈ కామ్రేడ్స్ వద్ద రివాల్వర్లూ, పిస్తోళ్లు మాత్రమే ఉన్నాయి. ఢిల్లీలో పొందిన అనుభవంతో విజయం సాధించాలంటే బాంబులు సంపాదించాలనే నిర్ణయానికొచ్చాం.

పార్టీ బాంబులు తయారు చేయడానికి ఫ్యాక్టరీ స్థాపించాలని నిశ్చయించింది. దీనికి అన్నిటికన్నా ముందు చాలా డబ్బుకావాలి. ఇందుకై లాహోరులోని పంజాబ్ నేషనల్ బ్యాంక్ ప్రధాన కార్యాలయం మీద దాడి చేయాలని నిర్ణయించాం. ప్రణాళిక వేయబడింది. కామ్రేడ్స్ లాహోరు చేరుకున్నారు. ఒకరోజు బ్యాంక్ ముఖద్వారం వరకు కూడా వెళ్లారు. కానీ చివరి నిముషంలో తాము తీసుకెళ్ళిన కారు మంచి స్థితిలో లేదనే విషయం కనుగొన్నారు. కాబట్టి మరో మంచి కారు తీసుకుని మరో రోజు రావాలనుకుని తిరిగి వచ్చేశారు.

ఇదిలా వుండగా, 1928 అక్టోబర్ 30వ తేదీనాడు సైమన్ కమీషన్ లాహోర్ వచ్చింది. ఓ పెద్ద ప్రజాసమూహం నల్ల జెండాలతో కమిషన్‌కు 'స్వాగతం' పలికింది. ప్రభుత్వాధికార్లు పిచ్చివారైపోయారు. పోలీసులు ప్రజల ఊరేగింపుపై లాఠీలతో విరుచుకు పడ్డారు. అప్పుడు జాతీయ నాయకుడైన లాలాలజపతిరాయ్ తీవ్రంగా గాయపడి, కొన్నాళ్ల తర్వాత 1928 నవంబర్ 19న చనిపోయాడు. దీంతో దేశమంతా క్రోధావేశాలు వ్యాపించాయి. ప్రజలందర్నీ తీవ్ర దుఃఖం అలముకుంది. 'దేశ గౌరవాన్ని కాపాడకో లేకపోయిన అసహాయులై పోయామా మనం?" అనే ప్రశ్న ప్రతిచోటా వినబడింది.[3]

లాలా లజపతిరాయ్ తన అంతిమ కాలంలో విప్లవకారులను ద్వేషించనారంభించారు. భగత్‌సింగ్, సుఖదేవ్‌లకు తమ బంగాళా ద్వారాలను కూడా మూసి వేశారు. కాంగ్రెస్‌లో కూడా మోతీలాల్ నెహ్రూతో విభేదించి వున్నారు. ఆయన కాంగ్రెస్ లౌకిక సంప్రదాయాలకు విరుద్ధంగా మతతత్వాన్ని ప్రోత్సహించడం ప్రారంభించారు. అయినా ఇవన్నీ మనదేశ ఆంతరంగిక సమస్యలు. విదేశాలలో లజపతిరాయ్‌ని మన జాతియోద్యమ అగ్రనాయకులలో ఒకరుగానే భావించారు. కాబట్టి ఆయన పై లాఠీల దాడి దేశముపై దాడిచేసినట్టే ; ఆ దాడి మన పౌరుషానికి సవాల్ వంటిది. ఆ సవాలును మేం స్వీకరించాం.

బ్యాంకు దోపిడీ ఆలోచన విరమించబడింది. లజపతిరాయ్ చనిపోయిన ఒక నెల తరువాత భగత్‌సింగ్, రాజగురు లాహోరు పోలీసు కేంద్ర కార్యాలయం నుంచి వెలుపలికి వస్తున్న డిప్యూటి పోలీసు సూపరిండెండెంటు సాండర్స్‌ను తుపాకీతో కాల్చి చంపారు. సాండర్సే లాఠీతో లాలా లజపతిరాయ్‌ని చావబాదాడు.[4]

ఈ హత్యా ప్రయత్నానికై అనేక రోజులుగా మన కామ్రేడ్స్ పోలీసు ఆఫీసు కెదురుగా తిరుగుతూ వున్నారు. ఆ స్థలాన్ని క్షుణ్ణంగా పరిశీలించారు కూడా. చివరగా 1928 డిశంబరు 17న సాండర్స్ మాకు దొరికిపోయాడు. అతడు పోలీసు కార్యలయం నుంచి మోటారుసైకిలుపై వెలుపలికి వచ్చేటప్పుడు కాల్పులు సాగించాలని ముందుగానే నిశ్చయించబడింది. భగత్‌సింగ్, రాజ్‌గురు ఇద్దరూ పోలీసు కార్యలయం గేటుకు కొంత దూరంలో నిలబడివున్నారు. అక్కడినుంచి కొంతదూరంలో జయగోపాల్ సైకిలుతో నిలబడ్డాడు. సైకిల్‌కు ఏదో చిన్న రిపేరు చేస్తున్నవాడిలాగా అతడు అక్కడ నటిస్తున్నాడు. భగత్‌సింగ్, రాజగురు – జయగోపాల్ చేసే సైగలనుబట్టే ముందుకు పోవాల్సి వుంది. వీరికి కొంతదూరంలో డి. ఎ.వి. కాలేజీ ఆవరణలో చంద్రశేఖర్ ఆజాద్ తన మౌజర్ పిస్టలుతో నిలబడి వున్నాడు. భగత్‌సింగ్, రాజ్‌గురు తమ పని పూర్తి చేసిన తరువాత కాలేజీ మార్గంగా హాస్టలుకు చేరుకోవలసి వుంది. వారిని ఎవరైనా వెంబడిస్తే ఆజాద్ వారినెదుర్కొని భగత్‌సింగ్, రాజ్‌గురులకు పారిపోవడానికి మార్గం సుగమం చేయడానికే అక్కడ నిలబడ్డాడు.

సాండర్స్ కార్యాలయం నుండి వెలుపలికి రాగానే జయగోపాల్ సైగచేశాడు. రాజగురు వెంటనే సాండర్స్ తలపై పిస్టలు పేల్చాడు. మొదటి గుండుదెబ్బకే అతడు మోటారు సైకిలుతో సహా నేలమీద పడిపోయాడు. సాండర్స్ మళ్లీ సజీవుడు కాకూడదనే ఉద్దేశ్యంతో భగత్‌సింగ్ మళ్లీ నాలుగైదుసార్లు కాల్చాడు. తర్వాత వారిద్దరూ కాలేజి ఆవరణ నుంచి హాస్టలువైపు వెళ్ళిపోయారు. చనన్‌సింగ్ అనే ఒక పోలీసు హెడ్‌కానిస్టేబుల్ వారి వెనకపడ్డాడు. చంద్రశేఖర్ ఆజాద్ అతణ్ణి హెచ్చరించినప్పటికీ విననందువల్ల ఆజాద్ అతనిని కాల్చాడు. పిస్తోలు గుండు చనన్‌సింగ్ తొడను చీలుస్తూ దూసుకుపోయింది. అయినా అతడు వెంబడిస్తూనే వున్నాడు. అందువల్ల ఆజాద్ మరో గుండు పేల్చాడు. కానిస్టేబుల్ భూమిమీద బోర్లాపడిపోయాడు.

ఈ సంఘటన జరిగిన మరురోజు దీని ప్రాధాన్యతను వివరిస్తూ లాహోరు నగరంలో ఆంగ్లభాషలో ఎర్రటి కరపత్రాలు పంచబడ్డాయి. గోడల మీద వాల్‌పోస్టర్లు కూడా వెలిశాయి. అవి సాండర్స్ మరణాన్ని, లాలా లజపతిరాయ్ చావుకు ప్రతీకారం తీర్చుకోబడిందనే విషయాన్ని ఎలుగెత్తి చాటాయి.

ఈ సంఘటనతో చాలామందికి సంతృప్తి కలిగింది.[5] మా విధానాలను అంగీకరించని కాంగ్రెస్ నాయకులు కూడ మా భద్రత విషయంలో ఆదుర్దా చెందారు. మా సానుభూతిపరుల ద్వారా మాకు కావలసినంత డబ్బు కూడా పంపించారు. దీని తరువాత చాలాకాలం వరకు మేం దోపిడీలు సాగించవలసిన అవసరం లేకపోయింది.

దేశానికి జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవడానికి లాలాజీ హంతకుణ్ణి తుదముట్టించడం అవసరమనే ప్రతిపాదన చేసింది భగత్‌సింగే : అయినప్పటికీ సాండర్స్‌ని హత్య చేసిన తర్వాత అనేక రోజుల దాకా అతని మనస్సు వ్యాకులతతో నిండిపోయింది. అతడు విప్లవకారుడైనప్పటికీ రక్తపిపాసి కాడు. మానవులందరినీ సుఖసంపన్నులు చేయడమే అతడి ధ్యేయం. అందువల్ల అందరి ప్రాణాలను అభిమానించడం అతని స్వాభావిక గుణం. విప్లవకారులు హంతకులు కారు. వారు మానవత్వాన్ని ఆరాధించేవారు. కాబట్టి మానవుల ప్రాణాల్ని హరించేటప్పుడు వారికి సహజంగానే విచారం కల్గుతుంది. ఈ విషయం ఢిల్లీ పార్లమెంట్‌లో వెదజల్లబడిన పార్టీ కరపత్రాలలో ఇలా చెప్పబడింది:

"మేము మానవ జీవితాన్ని పవిత్రమైనదిగా భావిస్తాం. ప్రతి ఒక్కరికి సంపూర్ణమైన శాంతి, స్వాతంత్ర్యాలు లభించే ఉజ్వల భవిష్యత్తులో మాకు విశ్వాసముంది. తప్పనిసరైనప్పుడే మేము మానవరక్తాన్ని చిందిస్తున్నాం. ఇందుకు మేమెంతో బాధపడుతున్నాం. అయినా విప్లవం ద్వారా అందరికీ స్వాతంత్ర్యం ప్రసాదించడానికి, మనిషిని మనిషి దోచుకునే పద్ధతిని ముగించడానికి విప్లవంలో కొంత రక్తపాతం కూడా తప్పదు."

---

1. రాజారాం శాస్త్రి రచించిన "అమరవీరుల సంస్మరణలు" 70వ పుట నుంచి గ్రహింపబడింది.
2. సాండర్స్ హత్య, పార్లమెంట్ భవనంలో బాంబుదాడి ఇటువంటి 'యాక్షన్స్;'
3. మన ప్రముఖ నాయకునిపట్ల ఆంగ్లేయుల ఇటువంటి ప్రవర్తన అందరికి రాక్షస ప్రవృత్తి అనిపించింది. దీనికి విరుద్ధంగా భారతదేశమంతటా ముఖ్యంగా ఉత్తర భారతదేశంలో ఒక నిర్జీవమైన క్రోధానలం వ్యాపించింది. మనం మన నాయకుల గౌరవాన్ని కూడా రక్షించుకోలేని అసహాయులుగాను, అసహ్యకరమైన వారుగాను వున్నాం." (నెహ్రూజీ ఆత్మకథ, పేజి. 215, సస్తా, సాహిత్య మండల్, 1936)
4. మేము లాహోరు పోలీసు సూపరింటెండెంటు స్కాట్‌ను చంపాలనుకొన్నాం. జయగోపాల్ అనే మిత్రుడు పొరపాటుగా సాండర్స్‌నే స్కాట్ అనుకొని మాకు చూపాడు. సాండర్స్ హత్య తరువాత, స్కాట్ లాఠీ దెబ్బలకే లాలా లజపతిరాయ్ చనిపోయాడనే విషయం తెలిసింది.
5. "ఆ సమయమునందు భగత్‌సింగ్ లజపతిరాయ్ గౌరవాన్ని, ఆయన ద్వారా జాతి గౌరవాన్నీ రక్షించాడని అందరూ భావించారు." (నెహ్రూజీ ఆత్మకథ పేజీ 217)

# పెట్టుబడిదారీ మానస పుత్రుడు మిల్టన్ ఫ్రీడ్‌మన్

– డి. పాపారావు

ప్రఖ్యాత మితవాద ఆర్థికవేత్త మిల్టన్ ఫ్రీడ్‌మన్ తన 94వ ఏట అంటే 2006 నవంబర్ 16వ తేదిన శాన్‌ఫ్రాన్సిస్కోలో గుండ్‌పోటుతో మరణించాడు. ఆయన 1912 జూలై 30వ తేదిన న్యూయార్క్ నగరంలో ఒక నిరుపేద యూదు కుటుంబంలో పుట్టాడు. ఆయన పూర్వీకులు ఉక్రేయిన్ ప్రాంతం నుంచి అమెరికాకు వలస వచ్చారు. ఆయన వివాహం 1958లో రోజ్ అనే మహిళతో జరిగింది. ఆ దంపతులకు ఇద్దరు సంతానం. భార్య రోజ్, కొన్ని పుస్తకాలకు సహరచయిత కూడా. మిల్టన్ ఫ్రీడ్‌మన్ ఆర్థిక శాస్త్రంలో చేసిన కృషికి గాను 1976లో ఆయనకు నోబెల్ బహుమతి లభించింది. 1988లో ఆయనకు 'ప్రెసిడెన్షియల్ మెడల్ ఆఫ్ ఫ్రీడమ్' లభించింది. వినియోగ విశ్లేషణ, ద్రవ్య చరిత్ర, స్థిరీకరణ విధానాలలో ఆయన చేసిన కృషికి గాను నోబెల్ బహుమతిని ఇచ్చారు.

ఆయన ప్రఖ్యాత రచనలు డజనుకు పైగా ఉంటాయి. వాటిలో ముఖ్యమైనది 1962లో ఆయన రచించిన 'ప్రైస్ థియరీ', 1962లోనే రచించిన 'కాపిటలిజం అండ్ ఫ్రీడం', 1972లో 'ఏన్ ఎకనామిక్ ప్రొటెస్ట్', 1975లో 'దేర్ ఈజ్ నో సచ్ థింగ్ యాజ్ ఏ ఫ్రీ లంచ్', 1979లో 'ఫ్రీ టూ చూజ్' రచనలు వచ్చాయి. వీటిలోని చివరి పుస్తకం పబ్లిక్ బ్రాడ్‌కాస్టింగ్ సర్వీస్ అనే ఛానల్‌లో వెలువడిన కార్యక్రమపు అక్షరరూపం. ఇక 1966–83 మధ్య కాలంలో ప్రఖ్యాత వారపత్రిక న్యూస్‌వీక్‌లో ఆయన రచనలు చేసారు.

'షికాగో స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్' అనే ఆలోచనా ధోరణికి ఆయనను ఆద్యుడుగా పరిగణిస్తారు. ఈ ఆలోచనా విధానపు సారంశం – ద్రవ్య పరిమాణం అనేది ప్రభుత్వ విధాన పనిముట్టుగా ఉండాలి అనేది. ద్రవ్య పరిమాణమే ద్రవ్యోల్బణం, వాణిజ్య ఒడిదుడుకులకు మూల కారణం అనేది ఫ్రీడ్‌మన్ సూత్రీకరణ. ఫ్రీడ్‌మన్ సంప్రదాయక కీన్స్ ఆర్థిక విధానాలకు వ్యతిరేకి. ఈ ఆర్థిక విధానాల ప్రకారంగా ప్రభుత్వ వ్యయం, వడ్డీరేట్ల నియంత్రణ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో స్థిరత్వానికి మూలాలు. కీన్స్ ప్రతిపాదిత ఈ ఆర్థిక విధానాలు, 1930వ దశకపు ఆర్థికమాంద్య కాలంలో అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ ముందుకు తెచ్చిన న్యూడీల్ మొదలుకొని – 1960వ దశకపు చివరి వరకూ అమలు అయ్యాయి. 1960వ దశకం చివరిలోను, 70వ దశకం ఆరంభంలోను పెట్టుబడిదారీ వ్యవస్థలో పారిశ్రామిక సంస్థల లాభాలు కుంచించుకు పోవటంతో కీన్స్ ఆర్థిక విధానాలపై నీలినీడలు పడ్డాయి.

పెట్టుబడిదారుల లాభాలను పెంచేందుకు కార్మిక అనుకూల విధానాలను తిరగదోడేందుకు ఉద్దేశించిన ఆర్థిక విధానాలది 1970వ దశకం ఆరంభం నుంచి పెద్దపీట అయ్యింది. ఈ కాలంలోనే అమెరికాలో రొనాల్డ్ రీగన్ అధ్యక్ష పదవిని ఎక్కాడు. బ్రిటన్‌లో 'మరో ప్రత్యామ్నాయం లేదు' అనే పేరిట ఐరన్ లేడీ గా పేరుపొందిన మార్గరెట్ థాచర్ ప్రధాని అయ్యారు. ఈ మొత్తం నేపథ్యంలోనే ఫ్రీడ్‌మన్ ఆర్థిక ఆలోచనలకు ప్రాధాన్యత పెరిగింది. స్వేచ్ఛా ఆర్థిక విధానాలను ఫ్రీడ్‌మన్ ప్రతిపాదించాడు. ఆయన భావాలు ముగ్గురు అమెరికా అధ్యక్షులను (నిక్సన్, ఫోర్డ్, రీగన్), ప్రపంచంలోని పలువురు దేశాధినేతలను, పారిశ్రామికవేత్తలను, ఆర్థికశాస్త్ర విద్యార్థులను ప్రభావితం చేసాయి. రాజకీయాల్లోను, ఆర్థికశాస్త్రంలోనూ కూడా ఫ్రీడ్‌మన్ వేదవాక్కు ఒక్కటే – అదే వ్యక్తి స్వేచ్ఛ. 2002వ సంవత్సరంలో ఫ్రీడ్‌మన్ అభిప్రాయాల గురించి మాట్లాడుతూ నేటి అమెరికా అధ్యక్షుడు బుష్ ఇలా అన్నాడు 'ఎంపిక చేసుకునే స్వేచ్ఛ సమాజంలోని వ్యక్తులకే ఉండాలని, ప్రభుత్వం దీనిలో జోక్యం చేసుకోరాదు, ఆ ఆలోచన అమెరికాను మార్చి వేసింది, ఇప్పుడు ప్రపంచాన్ని మార్చి వేస్తోంది.'

ఒక ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య సరఫరా నిలకడగాను, పరిమితులకు లోబడి ఉండాలనేది ఫ్రీడ్‌మన్ భావన. ఆయన వేతన, ధరల నియంత్రణను వ్యతిరేకించాడు. ఫెడరల్ రిజర్వ్ ఆర్థిక వ్యవస్థలో జోక్యం చేసుకోవటాన్ని నిశితంగా విమర్శించాడు. ఆయన భావాలకు మూలం 18వ శతాబ్దపు ఆర్థిక వేత్త ఆడమ్ స్మిత్ ఆర్థిక సిద్ధాంతాలు. అయితే, ఫ్రీడ్‌మన్ 'సంపూర్ణ పెట్టుబడిదారీ' విధానాలను ప్రబోధించినా – వాస్తవ పరిస్థితులలో చేయగల్గిందల్లా సాధ్యమైనంతగా ఆ ఆదర్శానికి దరిదాపులకు వెళ్లటం మాత్రమేనని విశ్వసించాడు.

కీన్స్ విధానాల బద్ధవ్యతిరేకి అయిన ఫ్రీడ్‌మన్ 1930వ దశకపు ఆర్థిక మాంద్యం గురించి విస్తారంగా రచనలు చేసాడు. ఆయన ఆ ఆర్థిక మాంద్యాన్నే 'గొప్ప సంకోచింపు'గా అభివర్ణించాడు. అంటే, ఫ్రీడ్‌మన్ ఉద్దేశ్యంలో వాటి ఆర్థిక మాంద్యానికి కారణం ఫెడరల్ బ్యాంకు అప్పట్లో తీసుకున్న పొరపాటు విధానమైన ద్రవ్య సరఫరాలను సంకోచింప చేయటమే (కుదించటమే). దీనర్థం, నాటి ఫెడరల్ బ్యాంకు విధానాలు గోటితో పోయేదాన్ని గొడ్డలి దాకా తీసుకువచ్చాయనేది ఆయన విశ్వాసం. నాటి ఆర్థిక మాంద్యం స్వేచ్ఛా వ్యాపార వ్యవస్థ వైఫల్యం కాదని, అది ప్రభుత్వ విచారకర వైఫల్యమనేదే ఫ్రీడ్‌మన్ వాదన. ద్రవ్యోల్బణాన్ని, ఇతర ఆర్థిక సమస్యలను పరిష్కరించే పనిని స్వేచ్ఛా మార్కెట్ మాత్రమే చేయాలన్నది ఆయన విశ్వాసం. అలాగే ఆయన 'నెగెటివ్ ఆదాయ పన్ను' విధానాన్ని కోరాడు. దీని ప్రకారంగా తక్కువ ఆదాయ వర్గం వారు ప్రభుత్వం నుంచి డబ్బును పొందగలరు. అయితే, ఫ్రీడ్‌మన్ ఆర్థిక విధానాలను నమ్మిన అమెరికా అధ్యక్షులలో కూడా ఏ ఒక్కరూ ఆయన ప్రతిపాదనలను సంపూర్ణంగా అమలు జరిపేందుకు సాహసించలేదు. వీరిలో ఒకరైన నిక్సన్, ఫ్రీడ్‌మన్ సలహాలకు భిన్నంగా ద్రవ్యోల్బణాన్ని తగ్గించేందుకే ఆర్థిక నియంత్రణలను అమలుపరిచాడు.

ఫ్రీడ్‌మన్ ఆలోచనలు తీవ్రంగా వ్యతిరేకించిన వారిలో ఈ మధ్యనే అంటే సుమారు ఆరు నెలల క్రితం చనిపోయిన జాన్ కెన్నెత్ గాల్‌బ్రెత్ ముఖ్యుడు. గాల్‌బ్రెత్ అభిప్రాయాల ప్రకారంగా వేతన, ధరల నియంత్రణలు ఆర్థిక వ్యవస్థ మనుగడకు తప్పనిసరి. ఆర్థిక వ్యవస్థలో

ప్రభుత్వ జోక్యం తగిన మేరకు ఉండాలనేది గాల్‌బ్రెత్ ఆలోచన. స్వేచ్ఛా మార్కెట్ విధానాలకు పట్టం కట్టాలని వాదించిన ఫ్రీడ్‌మన్ వ్యక్తిగత జీవితం ఆ విశ్వాసాలకు విరుద్ధ దిశలో సాగింది. ప్రభుత్వం కంటే ప్రైవేట్ రంగానిదే సామర్థ్యం ఎక్కువని వాదించిన ఆయన ఏ నాడు ప్రైవేట్ రంగంలో పనిచేయలేదు. అమెరికా పన్ను చెల్లింపుదారుల డబ్బుతో నడిచిన ప్రభుత్వ ఏజెన్సీలు, విశ్వవిద్యాలయాల్లోనే ఆయన పనిచేశాడు. అలాగే, 1960వ దశకం యావత్తు ఆయన ప్రభుత్వ జోక్యంతో కూడుకున్న 1930వ దశకపు న్యూడీల్ ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూనే గడిపాడు. అయితే 1930వ దశకపు ఆర్థిక మాంద్య కాలంలో ఆయన అదే న్యూడీల్‌ను అమలు పరిచిన ఏజెన్సీలలో పని చేసాడు. ఇక కార్పొరేట్ సంస్థల దాత్రుత్వాన్ని వ్యతిరేకించిన ఆయన పని చేసింది రాక్‌ఫెల్లర్ సంస్థ స్టాండర్డ్ అయిల్ దాతృత్వంతో ఉనికిలోకి వచ్చిన షికాగో విశ్వవిద్యాలయంలో. వ్యక్తిగత స్వేచ్ఛను అత్యున్నతమైనదిగా ప్రతిపాదించిన ఫ్రీడ్‌మన్ – ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని కూలదోసి పినోచెట్ అనే సైనిక నియంత నేతృత్వంలో చిలీ దేశంలో ఏర్పడ్డ దేశానికి సలహాలు ఇవ్వటం, ఆ దేశంలో ఆర్థిక శాస్త్రం పై ఉపన్యాసాలు ఇవ్వటం కూడా వివాదాస్పదమే.

ఆర్థిక సంపత్తి పెరిగితే అన్ని పడవలూ నీటిలో పైకి లేస్తాయి, అంటే సంపదను పెంచగలిగితే తుదకు పేదలకు కూడా లబ్ధి కలుగుతుంది అనేది ప్రపంచీకరణ సమర్థకుల వాదన. అయితే వాస్తవానికి సుమారు రెండున్నర దశాబ్దాల పైబడిన ప్రపంచీకరణ చరిత్రలో ఈ మాటలు కల్లలే అయ్యాయి. కానీ, ప్రపంచీకరణ సమర్థకుల ఈ వాదనలకు ఆర్థికశాస్త్ర రంగంలో నేలను చదునుచేసి సిద్ధం చేసిన వారిలో ముఖ్యుడైన ఫ్రీడ్‌మన్ మాత్రం ఈ కాలంలో ఒక వెలుగు వెలిగాడు. ఆయన జీవిత చరమాంకంలోనే ప్రపంచంలో జరిగిన పలు మార్పులు ఆయన ప్రతిపాదించిన ఆర్థిక సిద్ధాంతాలకు పూర్తిగా భిన్నంగా సాగాయి. ముఖ్యంగా లాటిన్ అమెరికా వంటి దేశాలలో వీస్తున్న వామపక్ష పవనాలు ఫ్రీడ్‌మన్ ప్రతిపాదిత స్వేచ్ఛా విపణి ఆర్థిక విధానాలను సవాలు చేసేవిగా ఉన్నాయి. అంతే కాకుండా, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో మార్కెట్ ఆర్థిక విధానాలు సృష్టించిన, రోజురోజుకూ మరింతగా సృష్టిస్తున్న ప్రకంపనలు ఆ దేశాల ఆర్థిక వ్యవస్థలనే సమూలంగా కుదిపి వేసే దిశగా సాగుతున్నాయి. ఏదేమైనా కీన్స్ విధానాలను కొనసాగించలేని పరిస్థితిలో 1970వ దశకం ఆరంభం నాటికి పడిపోయిన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలకు అందివచ్చిన ఆర్థిక సిద్ధాంతకారుడు మిల్టన్ ఫ్రీడ్‌మన్. సుమారు రెండున్నర మూడు దశాబ్దాల పాటు ఆయన విధానాలకు పెట్టుబడిదారీ ప్రపంచం నీరాజనాలు పడుతూ వచ్చింది. కాబట్టి మనం ప్రపంచీకరణ యుగపు పెట్టుబడిదారీ వ్యవస్థ మానసపుత్రుడిగా మిల్టన్ ఫ్రీడ్‌మన్ ఆర్థిక భావాలను చూడటం అనివార్యం. ◆

---

*(7వ పేజీ తరువాయి)*

తెలంగాణ విద్యావంతుల వేదిక కరీంనగర్ జిల్లాశాఖ తమ వంతు కర్తవ్యంగా ప్రత్యేక తెలంగాణా పట్ల ప్రజల్ని చైతన్యపరిచే కార్యక్రమాల్లో భాగంగా–ఎన్నికల ముందే జిల్లా నలుమూలల నుండి సుమారు ఏడువందల మోటార్‌సైకిల్స్‌తో తెలంగాణ సాధన ర్యాలీ కరీంనగర్‌కు నిర్వహించింది. ఇందులో సుమారు 1200 మంది యువకులు, ఉద్యోగులు పాల్గొని గ్రామగ్రామాన ప్రచారం చేస్తూ, పాటలు పాడుతూ వంద గ్రామాల ద్వారా యాత్ర సాగింది. సాయంత్రం కలెక్టరేట్ ముందు మూడు వేల మందితో ధర్నా నిర్వహించడం జరిగింది. కలెక్టరేట్ రోడ్ జనంతో కిటకిట లాడింది. ఎక్కడ చూసిన తెలంగాణ నినాదాలు, కళాకారుల పాటలు, ఆటలు – దీంతో కరీంనగర్ జిల్లాలో తెలంగాణ గురించి చర్చ మొదలైంది. తర్వాత నెల రోజులకే (అక్టోబర్ 14) సర్వీస్ గ్రౌండ్‌లో విద్యావంతుల వేదిక ఆధ్వర్యంలో 'తెలంగాణ ధూంధాం' జరిగింది. దీనికి లక్షమంది జనం హాజరయ్యారు – వీరంతా స్వతహాగా వచ్చినవారే – బస్సుల్లో, స్వంత వాహనాల్లో, నడుచుకుంటూ వచ్చారు. తర్వాత సిరిసిల్ల, జగిత్యాల పట్టణాల్లో ధూంధాం కార్యక్రమాలు జరిగాయి. వీటికి కూడా వేలాదిగా జనం హాజరయ్యారు – వీరందరిని ప్రశ్నిస్తే మాతోబాటు మా కుటుంబంలోని వారి ఓట్లు కూడా తెలంగాణాకేనన్నారు. ఎన్నికల తేది ప్రకటించాక వేదిక పెద్ద ఎత్తున చైతన్య సదస్సుల్ని నిర్వహించింది. తెలంగాణ విద్యావంతుల వేదిక మేధావులు, కళాకారుల బృందాలతో తెలంగాణ గుండె చప్పుళ్ల పేర ప్రదర్శనలిచ్చారు. వేదిక సిరిసిల్ల, ముస్తాబాద్, గంభీరావుపేట, జగిత్యాల, గాలిపెల్లి మొదలగు చోట్ల సదస్సుల్ని నిర్వహించింది. తెలంగాణ వాదం బలపడడానికి ఓ ప్రణాళిక ప్రకారం సదస్సులు జరిగాయి. మొదట వేదిక పెద్దల సభ తర్వాత కెసిఆర్ సదస్సు, తర్వాత రసమయి గుండె చప్పుళ్లు ఇలా పార్లమెంటరీ నియోజకవర్గంలోని అన్ని మండలాలు కవర్ అయ్యాయి. వీటికి తోడు కాకతీయ, ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు బృందాలుగా ఏర్పడి గ్రామాల్లో ప్రచారం చేశారు. కాకతీయ యూనివర్సిటీ నుండి అధ్యాపక బృందాలతో ప్రచారం చేశారు. అన్నింటికి వేదిక ప్రెస్‌క్లబ్. ఉదయం నుండే ప్రెస్‌క్లబ్ జనం, విలేకరులతో కిటకిటలాడింది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండే గాక ఢిల్లీ తదితర నగరాల నుండి కూడా మీడియా ప్రతినిధులు వచ్చారు. దేశం యావత్తు కరీంనగర్ వైపే చూసింది. ఇంతమందిని సమన్వయం చేస్తూ ప్రెస్‌మీట్స్ పెట్టించడం, సదస్సుల్ని నిర్వహించడం, పుస్తకాల ఆవిష్కరణలు ఇలా విద్యావంతుల వేదిక రెండునెలలు, రోజుకు ఇరవై గంటలు పనిచేసింది.

ఎన్నికలు జరిగినన్ని రోజులు అన్ని పార్టీలు మందు పీపాల కొద్ది ప్రవహింప చేశాయి. ఎన్నికల ముందు రోజు ఐదో కోట్ల మందు వ్యాపారం సాగింది. నెలరోజుల్లో 200 కోట్ల మద్యంతో ఓటర్లకు గాలం వేశారు. తెలంగాణ ఆకాంక్ష ముందు మందు–మనీ పని చేయలేదు.

పార్టీలకతీతంగా కరీంనగర్ ఓటర్లు తెలంగాణ వాదాన్ని గెలిపించారు. ఇప్పటికైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మొండి పట్టు వీడి ప్రత్యేక తెలంగాణ ఏర్పాటు దిశలో కదలాలి. అంతవరకు తెలంగాణా ఉద్యమం ఆగదు. ◆

# బుష్ సైగతో సద్దాంకు ఉరి

– ఆజాద్



అనుకున్నంతా అయ్యింది. ప్రపంచ పెత్తందారీ అమెరికా లక్ష్యం మేరకు సద్దాంకు ఉరిశిక్షను ఇరాక్ ప్రభుత్వ కోర్టు ప్రతిపాదించింది. సుమారు తొమ్మిది నెలలుగా సాగిన విచారణా నాటకం తుది అంకానికి చేరింది. ఇరాక్ 'ప్రజాస్వామ్య' ధోరణికి ఈ నాటకం దర్పణం పట్టింది. పశ్చిమాసియా దేశాల్లో అమెరికా–బ్రిటన్‌ల ఉమ్మడి శాంతి ప్రయోగానికి ఇది ప్రతీకగా నిలుస్తుంది. ఈ కపట ధోరణిని మూడో ప్రపంచ దేశాలే కాకుండా, ఆమ్నెస్టీ వంటి సంస్థలు కూడా ప్రశ్నించాల్సి వచ్చింది. ఆమ్నెస్టీ సంస్థను ప్రత్యేకంగా ఎందుకు పేర్కొంటున్నామంటే, ఈ సంస్థ ఏనాడూ సద్దాం హుస్సేన్‌కు మద్దతుదారు కాదు. ఒకనాడు కువైట్‌పై సద్దాం ప్రభుత్వం నెరపిన దాడిని తీవ్రంగా ఖండిస్తూ, సద్దాం ప్రభుత్వ దారుణ మారణకాండపై ఆమ్నెస్టీ అనేక కథనాలను వెల్లడించింది. అటువంటి ఆమ్నెస్టీ సంస్థే నేటి కుతంత్ర తీర్పును తూర్పారపట్టింది. తూర్పార పట్టడమే కాదు, ఈ తీర్పుపై అప్పీల్ చేసుకునే అవకాశాన్ని సద్దాంకు కల్పించాలనీ కోరింది. అయితే ఈ విన్నపాన్ని అమెరికా–బ్రిటన్‌లు మన్నిస్తాయన్నదీ దురాశే. ఎందుకంటే ప్రకటిత తీర్పు వెలువడిన వెంటనే బ్రిటిష్ హోంశాఖ కార్యదర్శి జాన్ రీడ్, 'ఇది ఓ సర్వసత్తాక దేశం (ఇరాక్) వెలువర్చిన సర్వసత్తాక తీర్పు' అని అభివర్ణించడం జరిగింది. దీనికి కొనసాగింపు గానే వైట్‌హౌస్ యంత్రాంగం ఇరాక్ దేశం న్యాయవ్యవస్థ స్వతంత్రతను కొనియాడుతూ, అమెరికా ఎన్నికలకు ముందుగా ఈ తీర్పు వెలువర్చడం వెనక ఏ కుతంత్రాలూ లేవని పేర్కొంది. ఇరాక్‌లో సున్నీ తెగల అధికార ధోరణిపై ప్రతిచర్య కాదని అడగకుండానే ప్రకటించడం, ఈ అగ్రరాజ్యాల 'కుట్ర'ను చెప్పకనే చెప్తున్నాయి. ఈ నేపథ్యంలోనే అమెరికా ప్రభుత్వం తాము సద్దాంతో గతకాలంలో నెరపిన మిత్ర వైఖరులను వెల్లడించే సాహసం చేయలేదు. ఇదే సందర్భంలో ఇరాక్‌లో చోటు చేసుకున్న గ్యాస్ బీభత్సంలో అమెరికా–బ్రిటన్‌ల ప్రమేయం గూర్చిసైతం వెల్లడించే అవకాశం సద్దాంకు విచారణ కాలంలో అనుమతించలేదు.

తనపై హత్యా కుట్ర చేపట్టారనే నెపంతో సద్దాం ప్రత్యర్థి వర్గాలపై దాడులకు పాల్పడ్డారనే అనుకుందాం. సద్దాం దాడుల్లో మృత్యువాత పడిన వారి సంఖ్య వందల్లో ఉంటే, అమెరికా ఇరాక్‌పై నెరపిన అనైతిక దాడుల మూలంగా అభం–శుభం తెలీని పసిపిల్లలు, స్త్రీలే ఆరు లక్షల దాకా బలికావడం అబద్ధమా? కాదు. అంటే ఇక్కడ తనపై కుట్రను తిప్పికొట్టేందుకై ఆదేశ నేతగా చేపట్టిన ప్రతిదాడిలో వందలమంది మృతికి కారణమయ్యాడని, అకారణంగా ఇరాక్‌పై దురాక్రమణకు పాల్పడి ఆ నేతను పదవీచ్యుతుడ్ని చేసి, జన విధ్వంశక ఆయుధాలు ఉన్నాయనే తమ ఆరోపణనూ నిరూపించుకోలేక లక్షలాది మంది సామాన్యుల చావుకు కారణమైన 'దురహంకారం' ఇప్పించిన తీర్పు ఇది.

అమెరికా ఇరాక్‌పై జరిపిన దాడిని ఇరాక్ ప్రజలు జాతీయ ప్రతిఘటనా యుద్ధ స్ఫూర్తితో తిప్పి కొడుతూనే ఉన్నారు.

సిరియాను లోబర్చుకుని ఇరాన్‌ను ఒంటరిని చేసింది. సిరియా ద్వారా ఇరాక్‌కు చమురును తీసుకెళ్లేందుకై అమెరికా తన మార్గాన్ని సుగమం చేసుకోగలిగింది. ఇరాక్‌పై తమ అదుపును స్థిరీకరించుకునే దశలో అగ్రరాజ్యాలు నేడున్నాయి. ఇందుకై ఈ రెండు శక్తులూ, అనేక కుత్సిత ఎత్తుగడలకు సైదోడుగా షియా–సున్నీ వైషమ్యాలకు సైతం ఆజ్యం పోస్తున్నాయి. తమ కీలుబొమ్మ ప్రభుత్వం ద్వారానే ఇరాక్ ప్రజలపై ఊచకోతకు పాల్పడుతున్నాయి. ఇందుకు ఉదాహరణ; ఇద్దరు బ్రిటిష్ గూఢచారులే బాంబులు పెట్టినందుకు ఇరాకీ అధికారులు వారిని నిర్బంధించడం. అయితే, బ్రిటిష్ బలగాలు ఇరాకీ జైలుపై దాడిచేసి వీరిద్దర్నీ విడుదల చేసాయి. ఈ చర్య అగ్రరాజ్య పెత్తన ధోరణిని మరింతగా బలపరుస్తుంది.

ప్రపంచంలోని చమురు నిక్షేపాల్లో 60 శాతం సౌదీ అరేబియా, ఇరాన్, ఇరాక్, కువైట్‌లలోనే ఉన్నాయి. దేశాలను అదుపులో ఉంచుకునేందుకై అగ్రరాజ్యాలు పన్నిన ఈ పన్నాగం, చమురు సంపదపై తమ ఆధిపత్యాన్ని నెల్పుకొనేందుకే. ఇందుకై 2003 మార్చ్‌లో ఓ అబద్ధపు ఆరోపణతో దండెత్తి సద్దాంను పదవీచ్యుతుడ్ని చేసి, ఏడెనిమిది నెలలు ఇరాక్ ప్రజలపై తీవ్ర నిర్బంధ ప్రయోగాలతో, కడకు తిక్రిత్‌లో సద్దాంను పట్టుకుంది అమెరికా. సుమారు పదినెలలు విచారణ తంతును జరిపింది. ఈ విచారణా తంతులో జనవిధ్వంసక ఆయుధాలు సద్దాం హయాంలో ఉన్నాయన్నది ప్రధానమైన ఆరోపణ. స్వయంగా ఐక్యరాజ్య సమితి విచారణ కమిషన్ సైతం ఈ ఆయుధాల అబద్ధాన్ని రుజువు చేయలేకపోయింది. తదుపరి సద్దాంపై నెరపిన విచారణ చట్టబద్ధ పాలనలేని పరిస్థితుల్లో, నిందితుడికి అవసరమైన న్యాయ సహాయాన్నీ అందివ్వక, ఇద్దరు న్యాయమూర్తులు నిరాకరించినా, నిందితుని తరఫున వాదించేందుకై స్వచ్ఛందంగా ముందుకొచ్చిన ముగ్గురు న్యాయవాదుల్ని హత్య చేసి, నిర్లజ్జగా ఈ మరణశిక్షను విధింపచేసింది సామ్రాజ్యవాదం.

ఈ సామ్రాజ్య వాద విపరీత పరిణామాలు మూడో ప్రపంచ దేశాల్లో కనువిప్పు కల్గిస్తున్నాయి. మరోవైపు సామ్రాజ్యవాదం తనకనుకూలంగా పలు దేశాల పాలకవర్గాలను కూడగట్టే యత్నం చేస్తుంది. అణుసమస్యను ఎజెండాగా చేసి, ఫ్రాన్స్‌ను ఇయు ద్వారా తన గుప్పిట్లోకి తీసుకుంది. 'ఉగ్రవాదంపై గ్లోబల్ యుద్ధం' అంటూ భారత పాలకవర్గాలను కూడగట్టుకుంది. పొగడ్తలతో చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను రూపొందించేయత్నం జరుపుతుంది అమెరికా. దీనికి భారత్ పాలకులు పావులు కాబోతున్నారు. ప్రత్యమ్నాయంగా షాంఘై కో–ఆపరేషన్ కౌన్సిల్ ఏర్పాటు ద్వారా రష్యా, చైనాలు దగ్గర కాబోతున్నాయి. ఇందుకు సైదోడుగా ఇరాన్‌తో పాటు పలు సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు ఏకం అయ్యేందుకు సంసిద్ధం కాబోతున్నాయి. ఇరాక్ ప్రజల సాక్షిగా ఐక్య పోరాటాల ద్వారానే ఈ సామ్రాజ్యవాద దుందుడుకుతనానికి కళ్లెం వేయగలుగుతామనే స్ఫూర్తిని మూడో ప్రపంచ దేశాలన్నీ గుర్తెరగాల్సి ఉంది. ◆

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు/కారణాలు తెలియని | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26-11-2006 నుండి 2-12-2006 | 31 | 2 | 17 | 1 | - | - | 11 | 5 | 4 | 41 | 12 | 7 | 2 | - | - | 6 | - |
| 3-12-2006 నుండి 9-12-2006 | 20 | 3 | 195* | - | - | - | 2 | 8 | - | 16 | 18 | 17 | 3 | - | - | - | - |
| 10-12-2006 నుండి 16-12-2006 | 11 | | 23 | - | - | - | 15 | 4 | 1 | 45 | 12 | 2 | 2 | - | - | - | - |
| 17-12-2006 నుండి 25-12-2006 | 12 | 2 | 13 | 2 | - | - | 4 | 8 | 1 | 29 | 21 | 4 | - | - | - | 6 | - |
| మొత్తం | **73** | **7** | **248** | **3** | **-** | **-** | **42** | **25** | **6** | **131** | **63** | **30** | **7** | **-** | **-** | **12** | **-** |

గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.
(ఇప్పటికి హైదరాబాద్ ఎడిషన్ వరకే పరిమితమైనది)

* వీటిలో **176** మంది ఈ సంవత్సర కాలంలో ఆత్మహత్యల పాలైన కార్పోరేట్ కాలేజీల విద్యార్థులవి.

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-12-06 PRINTED BOOK
Postal Regn. No. LII/RNP/H-HD 1029/2004-06




ముఖ్యమంత్రి డా. వై.యస్. రాజశేఖర రెడ్డి గారి నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ అన్ని రంగాలలో పురోభివృద్ధిని సాధించింది. వ్యవసాయం మరియు నీటిపారుదల రంగాలలో ప్రత్యేక శ్రద్ధ చూపుతూ ఆంధ్రప్రదేశ్‌ను హరితాంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దాలన్నదే ఈ ప్రభుత్వం ఆశయం. భూమిలేని నిరుపేదలకు భూమి పంపణీ వంటి పథకాలే కాకుండా పంటపొలాలకు నీటిని అందించే ప్రక్రియలో భాగంగా రాష్ట్రంలో **51** భారీ, మధ్యతరహా మరియు చిన్నతరహా నీటి ప్రాజెక్టులను నిర్మించాలని లక్ష్యంగా పెట్టుకుంది. అప్పుడే ఆంధ్రప్రదేశ్ దేశానికే 'అన్నపూర్ణ'గా నిలుస్తుంది.

## రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన కొన్ని సంక్షేమ పథకాలు

- **51 భారీ మరియు మధ్యతరహా సాగునీటి ప్రాజెక్టులను 60 వేల** కోట్ల రూపాయలతో చేపట్టి, రాబోయే **5** సం.లలో పూర్తి చేయడం. వీటి ద్వారా కోటికి పైగా ఎకరాల ఆయకట్టు సాగులోకి వచ్చే అవకాశం
- అతిపెద్ద మల్టీ నేషనల్ కంపెనీస్‌తో పాటు **Microsoft, IBM, Motorola, GE, HSBC, DELL, Satyam, Infosys** మొదలైన **Fortune 500** కంపెనీలకు నిలయంగా మారింది. **IT/ITES** ఎగుమతులలో **2005-2006** సం॥లో రూ.**12,521**లతో, **51%** వృద్ధితో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో నిలిచింది
- నాలెడ్జ్ కారిడార్, బ్రాడ్‌బాండ్, జవహర్ నాలెడ్జ్ సెంటర్, ఇ-ప్రొక్యూర్‌మెంట్, బహుళ ప్రయోజన కార్డులు వంటి ప్రాధాన్యతలు
- ఎస్.సి., ఎస్.టి., బి.సి.మరియు ఇతర భూమి లేని **3,14,685** లక్షల మంది నిరుపేదలకు **4,37,019.86 ఎకరాల భూమిని** మూడు విడతలుగా పంపిణీ చేయడం జరిగింది
- దేశంలోనే మొట్టమొదటిసారిగా పట్టణ నిరుపేదలకు అందించే గృహ సౌకర్యం '**రాజీవ్ గృహకల్ప**'
- రాష్ట్రంలో పేదలకు గత ఏడాది **6.54** లక్షల గృహాల నిర్మాణం చేపట్టడం జరిగింది. ఈ ఏడాది **12.50** లక్షల గృహ నిర్మాణం చేపట్టాలన్నది లక్ష్యం
- **అగ్రికల్చరల్ టెక్నాలజీ మిషన్** - వివిధ పంటలలో దిగుబడి లోపాలను గుర్తించడం, ప్రత్యామ్నాయ వ్యవసాయ విధానాల ద్వారా వాటిని ఎదుర్కోవడం. నీటి సామర్థ్యాన్ని పెంపొందించడం. మెట్ట వ్యవసాయానికి కావలసిన విధానాలు మరియు పంటమార్పిడి విధానాలను పెంపొందించడం
- స్వయం సహాయక బృందాలలోని మహిళలకు '**ఇందిరా క్రాంతి పథం**' ద్వారా పావలా వడ్డీకే రుణాలు
- రూ.**500** కోట్లతో ఎస్.సి., ఎస్.టి.,బలహీన వర్గాల సమగ్రభూమి అభివృద్ధి ప్రాజెక్టు '**ఇందిర ప్రభ**'.

**ప్రతి క్షణం... ప్రతి పదం... ప్రజల కోసం**

Release Order No. 265/Sou/Advt.I/2006-07

Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.